ఆం. సా. ప. ప్ర. వ్యాజియం ప్రచురణ—3

# కుచేలోపాఖ్యానము

[ ఘట్టుప్రభు ప్రణీతము ]

84
2-55

పరిష్కర్త

శ్రీ వోలేటి వేంకట సుబ్బరాయశాస్త్రి, ఎమ్.ఏ.,

సాహిత్య విద్యాప్రవీణ, ఉభయ భాషాప్రవీణ




జనరల్ ఎడిటర్

డా. వి. వి. కృష్ణశాస్త్రి, ఎమ్.ఏ., పిహెచ్.డి.,

సంచాలకులు

పురావస్తు ప్రదర్శన శాలల శాఖ




ప్రచురణ కర్త

పురావస్తు ప్రదర్శన శాలల శాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు—1

ఆం. సా. ప. ప్ర. మ్యూజియం ప్రచురణ—3


# కుచేలోపాఖ్యానము

[ ఘట్టుప్రభు ప్రణీతము ]



పరిష్కర్త :

శ్రీ వోలేటి వేంకట సుబ్బరాయశాస్త్రి, ఎమ్.ఏ.

సాహిత్య విద్యాప్రవీణ, ఉభయ భాషాప్రవీణ




జనరల్ ఎడిటర్ :

డా. వి. వి. కృష్ణశాస్త్రి, ఎమ్.ఏ., పిహెచ్.డి.

సంచాలకులు

పురావస్తు ప్రదర్శన శాలల శాఖ

ప్రచురణ కర్త

పురావస్తు ప్రదర్శన శాలల శాఖ

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము, హైదరాబాదు—1.

779—i

# విషయసూచిక

ఆముఖము

# ఆముఖము

మానవుడు పురోభివృద్ధిని కాంక్షించుట సహజము. పురోభివృద్ధి ద్వివిధము—ఐహికము, ఆముష్మికము. ఐహికము పురుషార్థములలోని అర్థకామములకు సంబంధించినది. ఆముష్మికము మోక్షపరమైనది. పురుషార్థ సాధన ప్రతి మానవుని కర్తవ్యము. అర్థకామముల ననుభవించుటకును మోక్ష సాధనకును ధర్మానుసరణమే మార్గము. ధర్మ సత్యాదుల నాశ్రయింపనిదే పురుషార్థ సాధన నిర్విరోధముగ సుగమము కాజాలదు. అట్టి ధర్మ సత్యాదులు భారతీయ సంస్కృతికి మూలభూతములై యున్నవి.

కావున ప్రతి భారతీయుడును భారతీయ సంస్కృతికి ప్రతీక కావలెను. పరదేశీయానుకరణము పరమ మౌఢ్యము. "స్వధర్మే నిధనం శ్రేయః" యను సూక్త్యనుసరణీయము. భారతీయసంస్కృతి ప్రపంచములోని సకల సంస్కృతుల కంటెను మిక్కిలి యుత్తమమైనది. అట్టి దేశీయ సంస్కృతి రామాయణ మహాభారతేతిహాసములందును, శ్రీమద్భాగవతాది పురాణములందును నిక్షిప్తమై యున్నది. అందువలన నీగ్రంథములు భారత జాతికి అమూల్యాభరణములు. వీనిని సదా పఠించువారలు వాని తత్త్వమును జీర్ణించుకొని త్రికరణ శుద్ధిగ ననుభవించి యాచరణలో పెట్టిన యెడల తమ వ్యక్తిత్వమును, నైతికాదర్శములను, దేశీయవిలక్షణతను ప్రకటించుటకు సర్వదా సర్వథా సమర్థులై యుందురు.

అట్టి మహిమాన్వితమైన సాంస్కృతికాదర్శములను విస్మరించుట కేజాతి యుచ్చగించును! అందులకే మన పూర్వులు పురాణేతిహాసగత ఆఖ్యానోపాఖ్యానములను వివిధ సాహితీప్రక్రియలలో రచించి రచింపించి దేశీయ సంస్కృతీ పరమైన విలువలను కాలాంతరములో పరిపోషించి, దశ దిశలకును వ్యాపింపచేసిరి. అనేక విదేశ దండయాత్రలకు తట్టుకొని వివిధ మతముల యొక్క దాడులను సహించి భారతీయ సంప్రదాయమను నీ మహావటవృక్షము శాఖోప శాఖలుగ నభివృద్ధి పొంది మనుచున్నది. ఎందరో మహాకవులు తమ అత్యుత్తమ రచనల ద్వారా విలువైన సందేశములను జాతికి అందించి వెడలి పోయిరి. ఈ సంప్రదాయమునకు మూలకందములు వేదములు, ఉపనిషత్తులు. ఆదికవి వాల్మీకి మహర్షి కృతరామాయణము, వేదవ్యాసమహాముని విరచిత భారత భాగవతాదులు భారత సాంప్రదాయ సాహిత్యమునకు మకుటాయమానములు.

ఆంధ్రవాఙ్మయము భారతీయ సాంప్రదాయిక సాహిత్య ప్రభావితమై రమారమి పది శతాబ్దములు మూడు పూవులారుకాయలుగ నభివృద్ధి నందినది. ఆంధ్రసాహిత్య సమారంభము శాసనములందక్కడక్కడ మధుబిందువులొలికించి నన్నయాదుల మహాభారత కావ్య రచనతో మధుమయ కోశమైనది.

కవిత్రయ ప్రణీత మహాభారతము ప్రతి యాంధ్రుని ప్రభావితుని గావించి వ్యక్తిత్వమును సముపార్జింపచేయుటయే గాక పరోక్షముగ దేశీయ సంస్కృతియందు భాగస్వామినిగ జేసినది సాహిత్య ప్రయోజనములలో నిట్టిశ్రేష్టతమ ప్రయోజనమును యీ మహాకావ్యమొనరించుట ఉత్తమ సాహిత్యావసరము నెంతేని యనువడింప చేయుచున్నది. అనేక ధర్మములను ప్రబోధించి సంఘ సౌశీల్యత నుద్దీపింప చేసినదీ మహాకావ్యము. శ్రీనాథ కాశీఖండ భీమేశ్వరపురాణాదులును పోతన సహజ పాండితీ ప్రకర్షప్రతీకయైన శ్రీమహాభాగవతమును తెలుగునాడును, సచ్చిదానందమయజగత్తున విహరింపజేసినవి. అప్పటికిని తనివితీరక ఎందరో కవికులతిలకులు తమ తమ శక్త్యనుసారము భక్తి ప్రబోధక గ్రంథములను కాలాంతరములలో వెలయింపజేసిరి.

సాహిత్య రచనా కౌశల దృష్టితో పరికించిన వానిలో కొన్ని గ్రంథములత్యుత్తమ సాహిత్య పీఠము నధిరోహింపలేకపోవచ్చును. అన్నియు కవిత్రయాదుల గ్రంథములతో తుల్యములు కాకపోవచ్చును. అంతమాత్రమున నుత్తమాదర్శములను ప్రవచించు నేగ్రంథమును నిరసింపరాదు. "ముఖే ముఖే సరస్వతి" యని పెద్దల నానుడి. ఏ పుట్టలో నే పామున్నదో యెవ్వరికెరుక? భగవద్భక్తిని హృదయములందు ప్రతిష్ఠింపచేయు శక్తియున్న చాలదా భక్తిప్రబోధక గ్రంథ సముదాయమున నట్టి గ్రంథముల గ్రహించుటకు? పైగా పూర్వ కవీకృత గ్రంథముల నేదేని కొంత విశిష్టతయుండక పోదని నానమ్మకము.

ప్రస్తుతము వెలువరింపబడుచున్న కుచేలోపాఖ్యాన మను నీ పాత్ర మట్టి విశిష్టతను సంతరించుకొని చదువుచున్న కొలది చదువ వలయు ననుపించు పద్యకావ్యము. భారతీయ సంప్రదాయ సాహిత్య మహావటవృక్ష శాఖోపశాఖలందలి చిరుకొమ్మల రెమ్మల కున్న కమ్మలలో నొకకమ్మ యీ షట్పుప్రభుకృత కుచేలోపాఖ్యానము. ఇంత కాలమునకు అనగా సుమారు మూడు శతాబ్దములకు తరువాత నీకబ్బమునకు లభ్యమానములైన తాళపత్ర ప్రతుల సంఖ్యను తులనాయమానముగ గమనించిన గత శతాబ్దములందీగ్రంథము ప్రజాదరణమునొంది యున్నట్లు చెప్పుటకు సందేహింప నవసరము లేదు. అట్టి గ్రంథమీ కాలమందు ముద్రణ భాగ్యమందిన యాంధ్రప్రజానీకము సమాదరింపగలదని యాకాంక్ష.

నవ్య వచన కవితాధురీణులు కొందరు పూర్వ సాహిత్య కవితా రీతులను ద్వేషించుచున్నట్లు కన్పట్టు చున్నది. ఇట్టి ధోరణి వారి హృదయ వైశాల్యతనంతగా వినువడింపజేయజాలదు. ప్రతి విషయము నందును కాలానుగతమైన మార్పులు వచ్చుట సహజము. ఇట్టి మార్పులు గత కాలమునకు సంబంధించిన విషయములందు ద్వేషమును ప్రబలింపచేయరాదు. గతము లేనిదే ప్రస్తుతము లేదు కదా. ఏమార్పును వొక్కుమ్మడి ప్రభవింపదు. సాహితీవిషయములందు ప్రక్రియలలో భిన్నత కన్పించినను శబ్ద జాలము, కవిత్వ గత విషయము, భావము, శబ్ద ప్రయోగ సరళి, మొదలగునవి కొంతవరకైనను గత సాహిత్యాను పూర్వ్యములై యుండును గదా. పూర్వులు ప్రసాదించిన జ్ఞానమును పూర్తిగా విస్మరించుట నేలవిడిచి సాము చేయుట వంటిది. ఏది యెట్లున్నను ద్వేషించుట శ్రేయోదాయకమని తలంపను.

"సర్వే జనా సుఖినోభవంతు" "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు"ను నా కాంక్షలు

కలిగి విశ్వమానవ సౌభ్రాతృత్వమును ప్రవచించిన మన పూర్వుల భావములలో నెన్నియో మన కనుసరణీయములుండునని నమ్మిన మన పూర్వ సాహిత్య మందు ప్రేమ జనింపక పోదు. నేడు అంటరాని తనము సంఘ సౌశీల్యమునకెట్లు మచ్చగా పరిగణింపబడుచున్నదో, యట్లే పూర్వ సాహిత్య కవితారీతి యంటరానిదనుట కూడ మన సంఘమున కొక మచ్చయే యగునేమో ! ఇట్టి భావ వ్యక్తీ కరణము వలన నెవరినైన గాయపరిచియున్న యెడల క్షంతవ్యుడను. ఇట్లు చెప్పుటలో స్వార్థమొకింత లేక పోలేదు. — ఎటులైననను నిప్పటి యువతరమును కుచేలోపాఖ్యానము వంటి పూర్వకావ్యముల పుటలను తెరపించి పఠనోన్ముఖులను గావించుటయే.

ఇంతేకాక వర్తమాన ప్రపంచమున కుచేలోపాఖ్యాన పఠనావశ్యకత నొక్కింత నిరూపింప యత్నించెదను. వర్తమాన ప్రపంచము నిరవధికాందోళనాయుతము. కాలము క్రమముగా వెళ్లుట లేదు. అహర్నిశలు మానసికోద్రేకములకు లోనై కాలము గడుపుచున్నారు ప్రజలు. "క్షణము తీరికలేదు దమ్మిడి ఆదా లేదన్న" సామెత వలెనున్నది జీవన పరిస్థితి. ఏదోనొక సమస్య ప్రతి వానిని కలవరపెట్టు చునేయున్నదీ రోజులలో. తృప్తి లేదు. శాంతి లేదు. జీవన భృతికై ప్రాకులాట సతతము సాగుచునేయున్నది. ఇట్టి పరిస్థితులు మానసికా వేదనలకు మానవుని లోను చేయుచున్నవి. ఇందువలన మానవుని యారోగ్యము, సుదృక్పథము, సుజీవన సరళి కుంటువడుచున్నవి. ఒక్క మాటలో చెప్పవలెనన్న మానవుని మనుగడయే కష్టమగుచున్నది. ఇట్టి విషమ పరిస్థితులలో నుండి ప్రతి దినము కొంత కాలమైనను బయట పడవలయునన్న శాంతి సౌమరస్యముల నలవర్చుకొనవలయును. అట్టి శాంతి సౌమనస్యాదులలవడవలెనన్న నుత్తమ సాహిత్య పఠనమును భగవదారాధనములనే యాశ్రయింప వలెను. సుజ్ఞానసముపార్జనము, భక్తి తత్పరత, యోగావలంబనములే శాంతి సాధనకు సాధనములని వర్తమాన ప్రపంచము గుర్తించుచున్నది. పై మూడును మన పూర్వుల జీవన మార్గమున పెన్నిధులని వేరే చెప్పనవసరము లేదు. అందు భక్తి తత్పరత అత్యంత హితోపకారి. వర్తమాన ప్రపంచమున నిట్టి వారే హెచ్చు. కలియుగలక్షణమది. ఇట్టి ప్రజానీకమునకు భగవద్భక్తి ఔషధము వంటిది. "కలౌతు స్మరణాన్ముక్తిః" యని పెద్దల యాకాంక్ష కలదు కదా ! కాని ప్రస్తుతము మన దౌర్భాగ్యవశమున దైవస్మరణ కావశ్యకమైన పౌరాణిక ప్రబోధము ప్రచారమునుండి మృగ్యమైనది. రామాయణ, భారత, భాగవత కథల నాధారము చేసికొని ప్రచారములో నుండిన తోలుబొమ్మలాటలు, వీధి భాగవతములు, తదితర జానపద ప్రక్రియలు, కనుమరుగైనవి. సాంఘిక నాటకములు, తాత్కాలిక సమస్యాపరిష్కరణోపయుక్త రచనలు, అపరాధ పరిశోధక సాహిత్యము, చలన చిత్రములచే నాకర్షితులై కొట్టుమిట్టాడుచు, దోవ తెన్ను తెలియని ప్రస్తుత ప్రజానీకమునకు భక్తి పట్టుగొమ్మ. అందులకే యీ కుచేలోపాఖ్యాన గ్రంథావశ్యకత. భగవద్భక్తి ఐహికము ఆముష్మికము లను రెంటిని సాధింపచేయును. తద్వారా యుందు ప్రప్రథమమున చెప్పిన మానవుని సౌఖ్యమున కాలవాలమైన పురోభివృద్ధి కాంక్ష తీరగలదు. చూడుడీ గ్రంథమున వామాక్షి కుచేలురు వారి వారికి వలసిన

ఐహికాముష్మికములను సాధించిరి. వామాక్షి ''కరణేషు మంత్రి'' యన్న ట్లాపద్బాంధవి వలె భర్తకు కర్తవ్య బోధ చేసినది. దరిద్రముచేగాసి నొందనిదియు, నిరామయమునునగు దేహమే దేహి యొక్క ఉత్తమ స్థితికి సహాయ కారి యగును కాన ఐహిక వాంఛల తీర్చు కొనుట దేహధర్మమనియు నదియే ఆముష్మికాభివృద్ధికి సోపానమనియు నిరూపించిన దీకావ్యము. కుచేలుడో అచలుడు. దారిద్ర్యమతనిని యచంచల భక్తి నుండి విముఖునిగ చేయలేదు. బీదతనమతనిని జీవన కర్తవ్యమును బాధించలేదు. దారిద్ర్య ప్రభంజనమునకు రాలిపోని సుదామ మీ సుదాముడు. కుచేలునిలో శ్రీరాముడున్నాడు. ఇది యోగ భావ గర్భితము. సహస్రారకమలస్థ సుధా—(శ్రీ—లక్ష్మి—మకరందము—అమృతము) పానమత్తుడైనవాడు కుచేలుడు. కర్మ ననుసరించి దారిద్ర్యము వచ్చుచున్నదను సిద్ధాంతమును నమ్మక నిరంతరము పరితపించు ప్రస్తుత కాలపు చంచల మనస్కుల కీగ్రంథమందలి కుచేల రూప శ్రీరాముడు కర్తవ్యబోధ చేయుగాక

పైని పేర్కొనిన యుత్తమ ప్రయోజనముండిననే సరిపోదు గ్రంథ పఠనమునకు ఆగ్రంథమందు భావము భాషయు నాకర్షణీయములై యుండవలెనువారు కొందరుందురు కదా. వారి యభిప్రాయమును సహజమైనదే. భావ కాఠిన్యము చదువరులకు కొంత శ్రమ కల్గించుననునది సత్యమే. కానీ గ్రంథ పఠనమునకు విముఖత కలిగించు భావకాఠిన్యమిందెక్కడను కన్పించదు. భావసరళత్వమీ గ్రంథమున బహుళము. ఎంతటి కఠిన భావమునైనను సులభముగ బోధపడునట్లు రచించినాడు ఫుట్టు ప్రభువు. మనస్సునకు ద్వైత బుద్ధి కలుగకుండ మనోవ్యాపారమును స్తంభింపజేసి, భగవద్ధ్యానముతో నైక్యమొంది నట్లు చూపు సందర్భమున చూడుడు కవిత నెట్లల్లినాడో.

ఆ: ఉప్పు నీటిలోన నుంచినకరణిఁగ
ప్పరము వీతిహోత్రు నొఱసినట్లు
వారిరాశిఁబడిన వడగండ్ల కైవడి
శౌరియందె మనసు సంఘటించె. (ద్వి॰ఆ—ప.73)

భాషావిషయమున పరికించిన నిందు సంస్కృతసూక్తులు నచ్చటచ్చట సమాస మిళిత పద్య గద్య పాదములు గన్పట్టినను నవి నారికేళ పాక సదృశములు కాక సులభ శైలిలో కూర్చబడి చదువరులకు యింపుగను సులభగ్రాహ్యములుగను తోచుచుండును. వాడుకలో దినదినమును నుపయోగించు పదములతోనే తన కవితనంతయు శోభాయమానముగ చేసినాడు. కుచేలుడు సంపదల రాకపోకల స్వభావమును గూర్చి తన తరుణీమణికి నచ్చచెప్పు సందర్భమున కూర్చిన పద్య పాదములను గమనింపుడు.

క: కోరినను రావు మనమున
గోరక యుండినను బోవు గురు తెఱఁగి సిరుల్
పూరుషుల కర్మఫలముల
వారక యవి తమకుఁదామె వచ్చున్ బోవున్ (ప్ర.ఆ— ప. 83)

ఈతని పద్యముల నడక ఎచ్చటను కుంటుపడక పదములు మైనపు ముద్దల వలె నెటుమలిపిన నటు తన ఇచ్చవచ్చిన రీతి మలచుకొనుటకు వీలుగ సిద్ధముగ నున్నట్లు కన్పించును. ఇందుల కుదాహరణము లెన్నియైనను చూపవచ్చును. అయినను విస్తారభయమున నొక పద్యమునుదహరింతును. పురుష ప్రయత్నమును వదలి విరక్తుడైయున్న కుచేలునికి పురుషకారముయొక్క ప్రాముఖ్యమును బోధించు సందర్భమున వామాక్షి చేత పల్కించిన పద్యమును గనుడు :—

ఆ॥ దేవుడిచ్చుననుచు దిన దిన యత్నముల్
సేయకున్న నేల సిరులు గల్గు
బళ్ళెరమున నిడిన పంచబక్ష్యాన్నముల్
కుడువకున్న నెట్లు కడుపు నిండు. (ప్ర. ఆ—ప.89)

ఘట్టు ప్రభు వీకావ్యమున ప్రత్యేకతను కనబరిచినాడని చెప్పవచ్చును. అత్యంత సునాయాసముగా సంస్కృత లోకోక్తులను తెలుగు పద్యములలో ననుసంధానము గావించి భావక్లిష్టతగాని యన్వయక్లిష్టతగాని లేకుండ రచన సాగించుటలో నీతనికితడే సాటి. తెలుగు సామెతలు, నానుడులు, వాడుకపదములు, తన కవితయందు సందర్భ సుద్దిగ చక్కగ నతుకునట్లు నేర్పుతో వాడినాడు. మృదువైన శైలితో ద్రాక్ష పాకమున నలరారుచు నుదాత్త భావములతో లలితముగా నడయాడెడి యీతని కవితా కాంత కాలిమంజీర రవళి శ్రోత్రపేయము మనోహరము నైనది. సుమారు మూడునూరుల పద్దెముల కావ్యములో నూటికి మించిన లోకోక్తులను సామెతలను సంస్కృతమునను తెనుగుననను వాడిన ఘనత యీకవికే దక్కిన దన్న నతిశయోక్తి కాదు. మూడాశ్వాసములతో నొప్పారుచు మానవ ధర్మ బోధకమైన ఈ గ్రంథమును రచించి ఘట్టు ప్రభువు వినిర్మల కీర్తి నార్జించి బ్రహ్మైక్య మొందినాడు.

ఈ గ్రంథ పరిష్కర్త శ్రీ సుబ్బరాయశాస్త్రిగారు మిక్కిలి శ్రమ కోర్చి సంశోధిత ప్రతిని తయారుచేయుటయే కాక విపులమైన పీఠికను కూర్చి యీకావ్యమును సర్వాంగ సుందర మొనర్చెను. పరిషత్తునందు లభ్యమగు తాళపత్రప్రతులను వారి తండ్రిగారి మాతా మహులనుండి సంక్రమిత తాళపత్ర ప్రతిని మరియు ముద్రిత ప్రతిని యాధారముగా చేసుకొని కూలంకషముగా వానిని పరిశీలించి, పాఠభేదములను విపులముగ సమకూర్చిరి. సాహిత్య శిరోమణియు విద్వాంసులును నగు శ్రీ శాస్త్రిగారు తమ సాంప్రదాయ పాండితీ గరిమ నిందు బహువిధముల ప్రదర్శించిరి. ఘట్టు ప్రభువు యొక్క దేశకాల నిర్ణయమందెంతయో వైశిష్ట్యమును చూపి తమ నూతన సిద్ధాంతమును ప్రతిపాదించినారు. పీఠిక యందలి పృథుకోపాఖ్యాన వ్యాఖ్య వీరి పాండితీకౌశలమున కొక మచ్చుతునక. ప్రతివారును చదివి యబ్బుర మొందగల విశేష మీవ్యాఖ్య యందున్నదని నామనవి. ఇంకనూ నెన్నియో యావశ్యకములగు విషయముల నీ పీఠిక యందు సమకూర్చిరి. మహామహోపాధ్యాయ, వైయాకరణ, సార్వభౌమయిత్యాది బిరుదాంకితులగు కీ.శే. శ్రీ తాతాసుబ్బరాయ శాస్త్రి గారి ప్రియశిష్యులును ప్రాచీన గురుకుల పద్ధతిని విద్యాభ్యాసము కావించి వ్యాకరణాలంకార శాస్త్రములలో పాండిత్యమును పొందుటయే

కాక ఆంగ్లభాషయందు ఎం. ఎ. పట్టభద్రులయిన శ్రీ శాస్త్రిగారీ గ్రంథమును పరిష్కరించుట ముదావహము. ఈ కావ్య పరిష్కర్తృత్వమున కంగీకరించి సంపూర్ణముగ నొనర్చిన శ్రీ సుబ్బరాయశాస్త్రిగారి కృషి యభినందనీయము. ఆంధ్ర ప్రదేశ రాష్ట్ర పురావస్తు ప్రదర్శన శాలల శాఖ పక్షాన వారికి నా కృతజ్ఞతలు.

శనగవరపు దాశరథి
క్యూరేటర్,
ఎ.ఎస్.పి.గ. మ్యూ. & రి. ఇ.
కాకినాడ.

# పీఠిక

ఓమ్

" నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణ హితాయచ।
జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః ॥ "

పరాత్పరుని నిశ్వాస రూపముగా వెల్వడిన వేదరాశి మానవ కోటికి శిరోధార్యవు. "సత్యంవద, ధర్మంచర" వంటి విధి వాక్యములు, "నానృతం వదేత్, న పరదారాన్ గచ్ఛేత్, మాహింస్యాత్సర్వా భూతాని, బ్రాహ్మణో న హంతవ్య" వంటి నిషేధ వాక్యములు, "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" వంటి యర్థవాద వాక్యములేగాక దేవతాస్తుతి పరమైన కర్మపరములైన సంహితా బ్రాహ్మణ భాగములు కర్మవిధాయకములు ప్రభు సమ్మితముగా నుపదేశమొసంగజాలియున్నవి. విధి నిషేధాత్మకమగు శ్రుతిలోని యుత్తమ భావముల ననుసరించి ప్రవర్తించుటకు ప్రజల కా శ్రుత్యర్థమను భూతము కావలయును. ప్రవృత్తి నివృత్తి రూపకాదేశోపదేశములు ప్రభు సమ్మితము లుగా నుండుటచేత జన సామాన్యమునకు పరిచితములుగాక పోవచ్చును. ఆ శ్రుత్యర్థము లను సుపరిచితములు చేయుటకు మను గౌతమ పరాశరాపస్తంబాది మహర్షులు స్మృతులను రచించి మానవ హృదయములలో నా శ్రుతి భావ బీజములను నాటిన పుణ్యము గట్టుకొనిరి. 'శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్' అని శ్రుతి ప్రామాణ్యము నిలుపుచు వివరణములుగా వెలసిన యీ స్మృతులు శ్రుతికి భిన్నములుగాక శ్రుత్యర్థ పరిపోషకములుగా వెలయు చున్నవి. వేద ధర్మముల కద్దము వంటివి స్మృతులు, కాని శ్రుతుల వలెనే యవియును ప్రభుశాసనమువలె కఠినములుగా నుండుట పరికించి వ్యాసమహర్షి కేవలము ధర్మము కొరకే చెప్పుచున్నట్లు కాకుండ, మిత్రునివలె హితోపదేశము చేయు కొఱకు ఆఖ్యానోపాఖ్యానసహిత భారతేతిహాసమును, పంచలక్షణ లక్షితములైన యష్టాదశ పురాణములను ధర్మ గర్భములుగా సృజించి, యెల్లరకు నందించినారు. వేదములందలి నిగూఢ ధర్మములను దెలియగోరు బుద్ధిమంతులకు స్మృతులును పురాణములును సమగ్రముగా నుపదేష్టలగుట చేతనే వేదములకు తర్వాత స్మృతులును, పురాణములును చతుర్విధ పురుషార్థ సాధకములై వేదములతో సమముగా ప్రమాణములైనవి.

స్మృతిలోని ప్రతి వాక్యమునకు శ్రుతి యెట్లాధారమగుచున్నదో, అట్లే పురాణములలోని ప్రతి ధర్మమునకు నేదియో యొక శ్రుతి యాధారముగా నుండును. కాన పురాణములందలి ధర్మ ప్రబోధక వాక్యము లెల్ల వేద వాక్యములుగనే భావించి గృహస్థుడైన ప్రతి పురుషుడు ధర్మార్థ కామములను పరస్పరానుపహతములుగా అనగా ఒండొంటికి బాధ కలుగనట్లు సేవించి చిత్తశుద్ధి నొంది మోక్షాధికారి కావలయును.

హితాహిత ప్రవృత్తి నివృత్తి సంపాదకములగు శ్రుతి స్మృతుల వలెనే పురాణేతిహాసాదులు కూడ సమర్థములగు చున్నవి. ఆనుపూర్వీ ప్రధానమగు వేదముల వలె

గాక అర్థ ప్రధానములగు పురాణాదులు స్తుతి నిందాముఖములుగా పఠితలకు రాగద్వేష మూలమున కర్తవ్యా కర్తవ్య ప్రవృత్తి నివృత్తులను గలిగించు చున్నవి. దృష్టాంత నిదర్శనోపమానముల ద్వారా మిత్రులు పన్యసించి రాగద్వేషాదులను గలుగజేసి కర్తవ్యాకర్తవ్య బుద్ధిని పెంపొందించునట్లు కథాద్వారముగా పురాణాదులు సుహృత్సమ్మిత ములై ప్రవృత్తి నివృత్తులకు హేతుభూతములగుచున్నవి. పౌరాణిక గాథలకు చారిత్రక ప్రసిద్ధియుండినను, ప్రతిపాద్యవిషయ తత్పరతయే ప్రధానము కాబట్టి ప్రతిపాద్య విషయ ప్రశంసా సూచకములుగా, నింద్యార్థ నిందా పరములుగా గాథలు నిరూపితములగు చున్నవి. మిత్ర సమ్మితమై క్రమముగా సభిరుచిని కలుగజేయు పురాణాది వాఙ్మయము వ్యాస వాల్మీకుల మూలమున స్కంధ కాండాత్మక వృక్ష రూపమై వృద్ధి నందినది. అయ్యది శ్రీరాముని యెడననురాగము, రావణునియెడ ద్వేషము, పాండవులయెడ నభిమానము, కౌరవులయెడ పగ గలిగించి, రామాదులవలె ప్రవర్తింప వలయుననియు, రావణాదుల వలె ఆచరింపరాదనియు ప్రవృత్తి నివృత్తు లకు హేతువగు చున్నది. పరికించినచో పురాణాదులు విషయాంతర నిబంధనద్వారా మనః ప్రవృత్తి నివృత్తులకు హేతుభూతములగు చున్నవి. ఈ పురాణేతిహాస వాఙ్మయ మొసంగిన యుపదేశబలమే భారతజాతి సంస్కృతి నిర్వహణ ద్వారా సమస్త దేశములకు శ్రేయోదాయక మగుచున్నది. సంస్కృతిని నిలుపుకొనుట, సచ్ఛీలము కలిగి సత్ప్రవర్తన కలవడుట, విశ్వసోదర భావము గలిగి యుదారబుద్ధితో జీవించుట నేర్పినది ప్రాచీన వాఙ్మయమే. గనిలోని వజ్రములను బంగారమందు పొదిగినది. శబ్ద ప్రధానము, ప్రభు సమ్మితము అయి భయ పురస్సరముగా ప్రవర్తక మగుచున్న వేదరాశికన్నను, అర్థప్రధానము మిత్ర సమ్మితము అయి అనునయ పురస్సరముగా ప్రవర్తకమగు చున్న పురాణ ప్రపంచముకంటెను, విలక్షణమై విశిష్ట స్థానమ్ము నార్జించుకొనగలిగిన కావ్య వాఙ్మయము పుష్పఫల భరిత నందనోద్యానము.

# కావ్యము - తత్ప్రయోజనము

రసోల్లసిత శబ్దార్థ సంఘటనాత్మక కవికర్మ కావ్యము. వేద ధర్మములను బోధించుటకు మిత్ర సమ్మితములుగా పొడచూపిన పురాణముల వలెనే యావేద ధర్మములను వాచ్యమొనర్పక వ్యంగ్య మర్యాదతో బోధించుటకే కావ్యములును వెలువడె ననుట యభియుక్తోక్తి. కావ్య పరిశీలనము వలన ధర్మమునందు శ్రద్ధయు, నశ్వరములగు విషయములందు వైముఖ్యము, మనస్సునకు స్థైర్యమును, భగవంతుని యందు దృఢమైన భక్తియు గలుగుననుట నిశ్చయము.

కావ్యము కాంతా సమ్మితము. ఒక రమణీయ రమణీ వరణీయ కటాక్ష వీక్షణ దరహసితాదిచేష్టలతో వరుని సమావర్జించుకొనునట్లు పఠితల కుతుకంఠ కలుగజేసి స్వాభిముఖులనుగా చేసికొను సరసతాపాదకము కావ్యము. విలక్షణమై, సహృదయ హృదయాహ్లాదకారియై కర్తవ్య ప్రవృత్తిని, అకర్తవ్య నివృత్తిని కాంతా సమ్మితముగా ప్రవర్తింపజేయునదియె కాళిదాసాదులచేత పరిపుష్టమై శ్రుతిస్మృతుల ధర్మోపదేశ సౌరభమును, ఆచార ఫలములను పంచగలిగిన కావ్య వాఙ్మయము ఆర్ష సంస్కృతి ద్రుమ సంపద. కామిని 'నాకిష్టమైనదిది, దీనిని జేయు' మనికాని, 'వాకిష్టమైనదికాదు, చేయవద్ద'ని కాని వాచాచెప్పదు, కాని తన యభీప్సితమునే నేరవేర్చుకొన గలదు. అట్టి కామినికి కావ్యమునకు భేదమెంత మాత్రము లేకపోవుట చేతనే కావ్య ప్రపంచము సహృదయ పఠితల సమావర్జించు కొనుచున్నది. కావ్యశ్రీ సంసేవనమున కువ్విళ్ళూరు సహృదయులున్నంతవరకు సరస కావ్య జగత్తు దిన దినము క్రొంగ్రొత్తశోభలతో విరాజిల్లు చుండుట తథ్యము. కావ్య ప్రయోజనము ప్రధానముగా పురుషార్థోపదేశమనినను కాంతా సమ్మితముగా సరసతాపాదనముతో ప్రవర్తకమగుటచేత విలక్షణమనక తప్పదు. అదృష్ట ఫలాపాదకమగు వేద వాఙ్మయము వలెగాక దృష్ట ఫలముగూడ నాపాదించునది కావ్యము.

కావ్యం యశసేऽర్థకృతే వ్యవహార విదే శివేతరక్షతయే ।

సద్యః పరనిర్వృతయే కాంతా సమ్మిత తయోపదేశయుజే' ।। కా.ప్ర.1–2,

కావ్యము వలన యశస్సు, ధనము, వ్యవహారజ్ఞానము, అమంగళప్రశమనము సద్యః పర నిర్వృతికలుగును.

'కాళిదాసాదీనామివయశః, శ్రీ హర్షాదేర్ధావ కాదీనామివ ధనమ్, రాజాదిగతోచితాచారపరిజ్ఞానమ్, ఆదిత్యా దేర్మయూరాదీ నామివానర్థ నివారణమ్, స్వాస్వాదనాత్ సమనంతరమేవ సముద్భూతం సకల ప్రయోజన మౌళిభూతం విగళితవేద్యాంతరమానందం కాంతేవ సరసతాపాదనే నాభిముఖీకృత్య రామాది వద్వర్తితవ్యం నరావణాది వదిత్యుపదేశంచ యథా యోగం కవేః సహృదయస్యచ కరోతీతి సర్వథాతత్రయతనీయమ్ '. మమ్మట కావ్య ప్రకాశః

బహు ఫలజనకమై బహూపయుక్త మగుట విశిష్ట క్యాజగత్తునే కవిస్రష్ట నిర్మించి లోకోత్తరానంద దాయకుడైనాడు. క్యాములు లోకోత్తరానందములు.



J. 779—1

కావ్య ప్రయోజనమని తెలియు చున్నది. ఆనందోపదేశములు కావ్య ప్రయోజన ములుగా ఆనంద వర్ధనుడు స్పష్టము చేసెను. ఈ యానందోపదేశములలో నేది ప్రధానమని ప్రశ్నించుకొని అభినవ గుప్తపాదులు లోచన వ్యాఖ్యలో చర్చించి యొక సిద్ధాంతమును చేసియున్నారు.

"శ్రోతూణాం వ్యుత్పత్తి ప్రీతీ యద్యప్యస్తి యథోక్తం ధర్మార్థ కామ మోక్షేష తథాపి ప్రీతిరేవ ప్రధానం. అన్యథా ప్రభు సమ్మితేభ్యో వేదాదిభ్యః మిత్ర సమ్మితే భ్యశ్చ ఇతిహాసాదిభ్యః కోఽస్య కావ్య రూపస్య వ్యుత్పత్తి హేతో ర్జాయా సమ్మితత్వ లక్షణో విశేషః ఇతి ప్రాధాన్యేన ఆనంద ఏవోక్తః చతుర్వర్గ వ్యుత్పత్తేరపిచ ఆనంద ఏవ పార్యంతి కంఫలమ్" లోచన వ్యాఖ్య.

శ్రోతలకు వ్యుత్పత్తి కలుగుచునేయున్నది. ఐనను ఆనందమే ప్రధానము. కానిచో ప్రభుసమ్మితములగు వేదాదులకన్న మిత్ర సమ్మితములగు ఇతిహాసాదులకన్న కావ్యము కాంతాసమ్మితమని చెప్పిన లక్షణమునకు విశేషమేమి?కావున ప్రధానముగ ఆనందమే కావ్య ప్రయోజనమని తేలినది. చతుర్వర్గవ్యుత్పత్తి కంటెను ఆనందమే ముఖ్య ఫలము. ప్రధాన ఫలమానందము. ఆనుషంగికము చతుర్వర్గ వ్యుత్పత్తి. 'వేద శాస్త్ర పురాణముల కంటే కావ్యములు ప్రజలకు మనోరంజనము కలిగించుచు ఉత్తమ సంస్కారమును వ్యంగ్యముగ బోధించు'నని విశ్వనాథుడు కావ్య మహత్త్వమును ప్రతిష్ఠించినాడు.

"విశ్వశ్రేయః కావ్య" మనినన్నయ మతములో నిఖిలాభ్యుదయములకు కావ్యమే హేతువని స్పష్టపడును.

పాశ్చాత్య కవీశ్వరులు విమర్శకులు కావ్య ప్రయోజనమును గూర్చి విపులమైన చర్చ చేసియున్నారు.

"కవీశ్వరులు సరస్వతీదేవి కృపా కటాక్ష విశేషముచే దివ్య భావావిష్టులై కవితా గానము చేయుదురు. కవిత్వ ప్రయోజనము ఆనందము" హోమరు. కావ్య ప్రయోజనము ఆనందమే యనునభిప్రాయము 'ప్లాటో' కాలము వరకు ప్రచారములో నున్నది. తరువాత కవుల ప్రధాన కర్తవ్యము నీత్యుపదేశమని ప్రజలలో మార్పు వచ్చినది. "కవి చేయు నుపదేశము అనవద్యమై న్యాయబద్ధమై యుండి, జాతిని ఉన్నత పథము వైపు పయనింపజేసినపుడే కవి పూజార్హుడు".

"నిరంతర రసోద్గార గర్భాః సౌందర్య నిర్భరాః ।

గిరః కవీనాం జీవంతి నకథామాత్ర మాశ్రితాః" ॥

కావ్యములో కథ—పాత్ర—రసముల కుత్తరోత్తర ప్రాధాన్యము కలదు. కేవల కథను ఆశ్రయించుకొని కవి వాక్కులు బ్రతుకలేవు. శృంగారాది రసములకాట పట్టులై వక్రోక్తి చతురములైనచో ప్రజల హృదయములలో గాఢముగ నాటుకొని ప్రజావాణిగా శాశ్వత స్థానము నందును.

సత్కార్యోన్ముఖులనుగా జేయు ఆదేశ ఉపదేశ సందేశములలో నే యొక్కటియు విడువదగినది కాదు. మహా కావ్యములు ప్రధానముగా రసానంద జనకములై, వ్యంగ్యముగ ధర్మోపదేశము చేయవలయును. అన్నిటిని సమన్వయము చేయు

బాధ్యత కవిలోకమున కున్నది. వ్యాస వాల్మీకుల యడుగుజాడలలో పయనించు కాళిదాసాదులగు మహా కవులు ధర్మ సంస్థాపనమునకే శ్రమించి, యధర్మముపై ధ్వజమెత్తినారనక తప్పదు. పురుషార్థములలో నాద్యంతములు ప్రబోధితములైనచో ధర్మ విరుద్ధమగు నర్థ కామములు ప్రచారితములగునుగదా? కావ్య ప్రభావ ప్రబోధితులైన సహృదయులుత్తమాదర్శముతో జీవయాత్ర సాగించి యితరులకు మార్గదర్శకులుగా నుండజాలుదురు. ''యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరోజన:'' గదా? కావున కొండొకచో శిష్టాచారముకూడా ప్రమాణ పదము నధిష్ఠించుచుండును. అస్తు. కుచేలోపాఖ్యానము కావ్యశ్రేణిలోనిది.

ప్రకృతము వ్యాసమహర్షి మహాభారత రచనానంతరము వికల చిత్తుడై మన కొలగ సాధనభూతమైన భగవచ్చరిత్రమును వర్ణించుట ప్రధానమని రచించిన పురాణము భాగవతము. భగవత్ప్రతిపాదికమగుటచేతనే గాక సుగుణ సంపదను చాటుటచేతగూడ నీ గ్రంథము భాగవతమైనదని ధ్రువ ప్రహ్లాదాంబరీషాది భక్తుల చరితము లీ గ్రంథ ప్రాశస్త్య ర్శనములు. గజేంద్రమోక్ష రుక్మిణీ కళ్యాణాదులు భగవంతుని లీలలను డును. రామకృష్ణ పరమహంస నుడివినటుల భాగవత భక్త కొక్కరీతి గుర్తించుట భారతీయ సంప్రదాయము. ''సాధుల హృదయము ల హృదయంబు నేన'' అనిన భగవంతుని భక్త ప్రేమచాటు భాగవత పురాణము. ప్రహ్లాదాది భక్తులు భక్తికి పరాకాష్ఠాభూతులు. దశావ విశిష్టముగా జేర్కొనదగినది శ్రీకృష్ణ చరితము. భగవద్దత్తము ను పిమ్మట భాగవతమును దేవునితో సమానముగా నారాధించుటకు లి మహత్త్వమే. మత గ్రంథములను దేవతుల్యముగా భావించువా నులు మత గ్రంథములను దేవునిగా నారాధింతురు. మహమ్మ క్రైస్తవులును పరిశుద్ధ గ్రంథములనే ప్రతి పదమునను ప్రమాణీక

వతము చరిత్రప్రధానమైనను బురాణము. 'సర్గశ్చ ప్రతిసర్గశ్చ వంశోమన్వంత నాను చరితంచేతి'' యను పంచలక్షణ లక్షితమైన పురాణమయ్యు, మభిలషించి, భగవదవతార మహిమలను వివరించి శుభ పరంపరలకు ప్రచిన గ్రంథమిది. అవతారముల చరిత్రములని మనవారు భావించు యణములు తమ తమ సద్గుణములచేత దేవతలైనట్టి యుత్తమ పురుషుల చరిత్రములు. భాగవతము భగవల్లీలలతో హృదయముల నాక్రమించి సన్మార్గవర్తనులనుగా జేయు భక్తి ప్రధానమైనది.

భారతీయ సంస్కృతి నిలువబడుటకు మూల స్తంభములు ధర్మ సత్యాదులు. వానిని నిలుపజాలినవి స్మృతీతిహాస పురాణ విశిష్టములైన శ్రుతులు. ఆ శ్రుత్యాది ప్రామాణికతను నిలుప దృఢ దీక్ష బూనిన మహర్షు లుపనిషత్తులతో తృప్తిపడక బ్రహ్మ సూత్ర భగవద్గీతలను గూడ పరమ ప్రమాణములుగా స్వీక రించి ఆర్షమతములు స్థిరపరచిరి. అందు త్రిమతాచార్యులుగూడా తమ తమ సిద్ధాంతముల కనుకూలముగా సమన్వయించుకొని వ్యాఖ్యానమొనర్చిన భగవద్గీతకు గల స్థాన మసామాన్యము. శంకర రామానుజాదుల తర్వాత

నెందరో భగవద్గీతకు వ్యాఖ్య లొనర్చి తమ తమ యాశయముల కనుగుణముగా నిరూపించుటయేగాక గీతయందలి యుత్తమ శ్లోక మకరందము నందరకు పంచిపెట్టినారు. అందరకు నన్ని రీతులుగా ఆదర్శ భావములను ప్రకటింప సమర్థములగు వ్యాస భగవానుని యుపదేశములు భగవద్గీతలో నెన్నియో నిక్షిప్తము లైనవి. శ్రీకృష్ణుడర్జునునకు ఉపదేశించిన ఘట్టములోనే గాక శాంతిపర్వములో ధర్మజునకు భీష్మునిచేత ప్రబోధింపబడిన సదుపదేశము లెన్నియో వివృతములైనవి. వానిని జదువుకొని తృప్తిపడుట కాదు. తమ జీవితములో ఆచరణలో బెట్టు వ్యక్తులు పరిమిత సంఖ్యలో నుందురు. ఆచరణలో నున్నదానినే యితరుల కాదర్శముగా జూపగలవారు మిక్కిలి యరుదు. అట్టి భాగవత మర్మమును గీతా తత్త్వమును జీర్ణించుకొని అనుభవించి జీవితములో ఆచరణలో బెట్టు వ్యక్తులతో దనకు స్థానమున్నదని తెలుపుకొనక పోయినను తన ఆశయములను గుర్తింప వీలు కలుగునట్లు రచన సాగించినవాడు ఘట్టు ప్రభువు. వ్యాస భగవానుడుగాని పోతనామాత్యుడుగాని యిట్టి ఆశయములను ప్రకటింపలేదని కాదుగాని తాను వ్రాసిన గ్రంథమును మూడాశ్వాసములుగా రచించిన పద్ధతి మాత్రము స్పష్టముగా గీతా తత్త్వమును వెల్లడింప సమర్థమైనది. ముఖ్యముగా కుచేలోపాఖ్యాన మావిషయమును ప్రకటించుటకే కవి వినియోగించుకొనెనను విషయమున నేవిధమైన సందేహమునకు స్థానము లభింపదు. భగవద్గీతలోని పదునెనిమిది యధ్యాయము లను కాండ త్రయాత్మకముగా (1. కర్మకాండము, 2. ఉపాసన—భక్తి కాండము, 3. జ్ఞాన కాండము) విభజించిన పద్ధతి ననుసరించి కుచేలోపాఖ్యానమును మూడాశ్వాసములుగా విభజించి వివరించెను.

''నిష్కామ కర్మాచరణ మూలమున చిత్తశుద్ధిని బడసి అచంచల భక్తితో పరమాత్మను భజించుచు ధైర్యముతో మనస్సును ఇంద్రియములను స్వాధీన మందుంచుకొని శబ్దాది విషయములను కామ క్రోధాదులను విడచిపెట్టి ఆహార విహారములయందు సంయమన తత్పరుడై ధ్యాన యోగాభ్యాసము గావించుచు ఆత్మానాత్మ క్షేత్రక్షేత్రజ్ఞ విచారణ సలుపువాడు బ్రహ్మ సాక్షాత్కార రూప మోక్షము నీ జన్మలోనే పడయుచున్నా డను గీతాసారమునకు లక్ష్యభూతుడైనవాడు కుచేలుడు నాయకుడు. తితిక్షువైన ముని—స్థితప్రజ్ఞుడు, ఉదాసీనుడును.

''కృష్ణస్యాసీత్సఖా కశ్చిద్ బ్రాహ్మణో బ్రహ్మ విత్తమః
విరక్త ఇంద్రియార్థేషు ప్రశాంతాత్మా జితేంద్రియః
యదృచ్ఛయోప పన్నేన వర్తమానో గృహాశ్రమీ....''

'అని వ్యాస ముని కృష్ణ సఖుని కుచేలుని అర్జున స్థానములో నిలిపినాడనవలయును.

'జనవర గోవింద సఖుడు కుచేలుండు
నానొప్ప విప్రుండు మానధనుడు
విజ్ఞాన రాగాది విరహిత స్వాంతుండు
శాంతుండు ధర్మ వత్సలుడు ఘనుడు
జితేంద్రియుడు బ్రహ్మవేత్త దారిద్ర్యంబు
బాధింప నొరుల గార్పణ్యవృత్తి

"పడుగ బోవక తనకు దా నబ్బినట్టి
కాసు పదివేల నిష్కముల్ గా దలంచి
యాత్మ మోదించి పుత్రదారాభి రక్ష
యొక విధంబుగ నడుపుచు నుండునంత."

అని పోతనామాత్యుడు గీతార్థము ననుభవములోనికి దెచ్చినవానిగా జూపియున్నాడు. 'వీతరాగ భయక్రోధా మన్మయా మాముపాశ్రితాః, బహవోజ్ఞాన తపసా పూతా మద్భావమాగతాః— యదృచ్ఛా లాభ సంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః సమస్సిద్ధావ సిద్ధౌచ—శ్రద్ధావాన్ లభతే జ్ఞానం తత్పర స్సంయతేంద్రియః జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధి గచ్ఛతి—యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః సర్వ భూతాత్మ భూతాత్మా—యతేంద్రియమనోబుద్ధి ర్మునిర్మోక్ష పరాయణః విగతేచ్ఛా భయక్రోధో యస్సదా ముక్త ఏవసః" ఇత్యాది గీతా శ్లోక వివృత లక్షణ లక్షితుడు—కుచేలుండను ముని నందను డొక్కరుడు దిన దినము హరి సేవానందంబున సకలేంద్రియ బృందముల బరిత్యజించి ఆత్మవత్సర్వ భూతాని యనెడు పలుకు సత్యముగ సకల జనము నిజ ప్రాణ సమముగా దలచుచు శాంతి యుదయము దయయు గలిగివర్తించును. సాందీపనియొద్ద కృష్ణునితో గూడి సమస్త శాస్త్రములు చదివినాడు. మహోపవాసము లొనర్చుచు జఠరాగ్ని చల్లార్చినాడు. నిజ స్వాంతమును బిగబట్టి చలనమొందక పంచేంద్రియముల నడగించినాడు. స్నాన సంధ్యాద్యనుష్ఠాన కర్మంబులతో దీర్ఘ వ్రతములు కావించినాడు. శత సహస్ర పరిచ్ఛేద సంఘటిత పురాణ జీర్ణోత్తరీయంబు రమణ దాల్చుట కుచేలుడను పేర ప్రసిద్ధి కెక్కినాడు.

ప్రథమాశ్వాసములో కర్మ భాగమును వివరించి దైవ పౌరుష వాదములను విమర్శించి పురుషకారమునకు సమ్మతి జూపి కృష్ణ దర్శనమున కేగ నిశ్చయించుకొనిన కుచేలుని ద్వారకా నగర యాత్ర ప్రకటితమైనది.

ద్వితీయాశ్వాసములో కృష్ణుని చెంతజేరి యాతడొనర్చిన సపర్యలకు ముగ్ధుడై పంచేంద్రియముల చేష్టలుడిగి మాధవ ధ్యానమున మేను మరచి యాదవాధీశ్వరుని యందే మనస్సు నింద్రియములను జొనిపెను. అట్టి కుచేలుని బాల్య సఖుని ప్రేమ పురస్సరముగా సత్కరించుటయేగాక ప్రధాన సందేశముగ దెల్ప దలంచిన గురు భక్తిని వివరించుట, భక్తితో దెచ్చిన యడుకులనుండి పిడికెడు భక్షించి ఆత్మలో తృప్తినంది కుచేలుని రాకకు కారణము గుర్తించి వీడ్కొలిచ్చిపుచ్చుట. కుచేలుని దురదృష్టమున కితరులు చింతించుట, భక్తి పరీక్షలో కుచేలు డుత్తీర్ణుడై తృప్తితో నింటికి బయనమగుట వివరింపబడినది.

తృతీయాశ్వాసములో కుచేలు డింటికి దిరిగి వచ్చునప్పటి కింద్రజాలమువలె గ్రామ గృహాదులు మారిపోయి యైశ్వర్య పూర్ణము లగుట—తత్ఫలము ననాసక్తితో కొలది దినము లనుభవించినను ఆ యైశ్వర్యమునకు ముగ్ధుడు గాక కాంతా సుతాదుల యెడ విరక్తుడై యేకాంతమున నుండి తన యంతరంగమున కృష్ణ పరమాత్మను ధ్యానించి, కృష్ణ ప్రత్యక్షముకాగా ముక్తి నర్థించుట. కృష్ణ సాక్షాత్కారము, ఆతడొసర్చిన యుపదేశము లిచ్చుట ప్రధానములు. ఈ భాగమును జ్ఞానకాండగా భావించుటచేతనే ఘట్టు ప్రభువు శ్రీ కృష్ణుని నోట విపులముగా బల్కించినాడు.

కర్మ భక్తిజ్ఞాన రూపమగు గీతా తత్త్వమును బహిర్గత మొనర్చి, తనకు గీతపై గల యధికారమును అనుభూతిని ప్రకటించిన కవి సర్వదా, సర్వథా సకల లోకోప కారకుడనక తప్పదు. భాగవత భక్తికి భగవద్గీతా భక్తికి, కుచేలోపాఖ్యాన భక్తికి వేరు వేరు లక్షణములున్నవి. ఇందలి భక్తి దైవ భక్తి (కర్మ శ్రద్ధ) గురు భక్తి, మిత్ర ప్రేమ, భక్త ప్రీతి (భక్తిస్సా పరమ ప్రేమరూపా) రూపముగా విశాల భావమున వివరింపబడినది. ఇట్టి సంఘటనలను పరిపక్వ హృదయమున్న కవిగాని వర్ణింపలేడుగదా?

రణరంగమున జయమభిలషించి యక్షయ తూణీరములు గాండీవము ధరించి మహోత్సాహముతో కృష్ణ సారధ్యము గల రథముపై వేంచేసిన యర్జును డుభయ సైన్యముల మధ్యనుండి శత్రు పక్షములో నున్న భీష్మ ద్రోణాదులను పరికించి బంధు వధకు జంకి మోహాక్రాంతుడై కర్తవ్యపరాఙ్ముఖుడైన తరుణమున శ్రీకృష్ణ పరమాత్మ గీతోపదేశము చేయుటయేగాక విశ్వరూప సందర్శన భాగ్యమును ప్రసాదించినాడు. అర్జునునిపై దనకుగల గాఢానురాగమునకు ఫల మింతకంటె నింకేమి కావలయును?. అట్లే బాల్యసఖుడైన కుచేలునియెడ గల యపార ప్రేమకు చిహ్నముగా కుచేలుడు తన మందిరమున ప్రవేశించినపుడు ఎదురు వచ్చియు, భార్యా సహితుడై సపర్య లొనర్చియు, విరక్తుడై పరమాత్మ ధ్యాన లగ్న మనస్కుడైన తరుణమున అష్టమహిషీ సహాయుడై స్వయముగా కుచేలు నింటికి వచ్చియు దర్శన మొసంగి తత్త్వోప దేశము చేయుట యెంతయు మెచ్చదగి యున్నది.

తృతీయాశ్వాసమున నీ ఘట్టమును గీతా తత్త్వమును పోల్చి చూచుచో నెన్నియో గీతా శ్లోక భావములు వ్యక్తపడుటయేగాక మించిన యుదార భావము లుత్తమాదర్శములు బహిర్గతము లగుచుండును. గీత యొసంగు సందేశములకు ముగ్ధులగు సహృదయు లెల్లరీ కుచేలోపాఖ్యానమును పరిశీలన పూర్వకముగా చదివినచో తల లూపక మానరు. కర్మ ప్రాధాన్యమును ఉపాసనా కర్తవ్యతను జ్ఞానావశ్యకతను జాటు నీ గ్రంథను భగవద్గీతకు పరిశిష్ట గ్రంథముగా గాక విశిష్ట గ్రంథముగా రాణింపగల సూక్తులతో నిండినందున ప్రశంసాపాత్రము. ''శిష్యస్తేహం శాధిమాంత్వాం ప్రపన్న'' మనిన యర్జునునకు ''అశోచ్యా నన్వ శోచస్త్వం'' తో మొదలిడి ''మాశుచః'' అని ముగించుచు ''మామేకం శరణం వ్రజ, యోగక్షేమం వహామ్యహ'' మ్మని యభయ హస్త మొసంగిన శ్రీకృష్ణుడు బాల్య సఖుడైన కుచేలునితో నెంత వినయ వినమితుడై వివేక యుతముగ మాటాడెనో యది పరికించిన యెడల నా కృష్ణుని మిత్ర ప్రేమ, కుచేలుని పరమ భక్తి పరకాష్ఠకు జెందియున్నవని తోచక మానదు.

బిచ్చమెత్తియైన జీవింతునుగాని రక్తపు కూడు కుడువ నొల్లనని సమర పరాఙ్ముఖుడైన యర్జునున కుత్సాహము రేకెత్తించి యుద్ధోన్ముఖుని జేయ సంకల్పముతో కృష్ణ పరమాత్మ దివ్య చక్షువు లొసంగి విశ్వరూప సందర్శనమును గలిగించి నందుననే ధనంజయునకు స్వధర్మ నిర్వహణము నందభిలాషను రేకెత్తించి నాడు. విశ్వరూప దర్శన మూలమున నర్జునుడు నిమిత్తమాత్రుడుగా పేర్కొనబడి నాడు. కింకర్తవ్యతామూఢుని కర్తవ్యోన్ముఖుని జేయు సంకల్పముగాన నట్లు ప్రత్యక్ష మగుట యవసరము.

సంసారమందు విరక్తుడై మోక్ష పురుషార్థముపై నత్యాసక్తి గల కుచేలుని
మనస్సును మార్చుటకు సంసార ధర్మముల ననుష్ఠించిన తర్వాత తురీయ పురుషా
ర్థమునకు జేరవలయునని సంసారమందనురక్తిని పునః ప్రతిష్ఠ చేయు నిమిత్తమే
యష్ట భార్యా సమేతుడై దర్శన మొసంగుట సముచితము. భగవంతుని విచిత్ర
లీల లసామాన్యములు. అనుభవజ్ఞులకు మాత్రమే గోచరము లగును.

భేద బోధకము కర్మకాండము. భేదా భేద రూపమున వెలయునది భక్తి
భాగము కేవలాభేద బోధకము జ్ఞానకాండము. జనులలో బెక్కురు పురుషార్థ
త్రయము ననే యాసక్తులగుట, సామాన్యాధికారులు. వారు కర్మల మూలమున చిత్త
శుద్ధి నంది భక్తి మూలమున సాధన చతుష్టయ సంపత్తిచే ప్రజ్ఞా పరిణతి నందిన
జ్ఞానులగుచో కుచేలునివంటి స్థితినందగలరు. శ్రీరామచంద్ర కార్య ప్రతిపాదకము
రామాయణము కర్మ ప్రధానము. నిత్యాచార లోక వ్యవహారముల భండారము
నధ్యాత్మ విషయ సంకలితము నగు భారతము జ్ఞాన ప్రధానము. కర్మ కాళిందియు
జ్ఞాన సరస్వతియు భక్తి గంగయు గలిసి పూత మొనర్చు పుణ్య భాగీరథి కుచేల
చరిత్రము త్రివేణీ సంగమముగా సకల జనులను పవిత్ర భావ పరిపూర్ణులను
గా జేయుచు ముక్తిని ప్రసాదించునని తెల్పుట కూడ నొక యాశయము కావచ్చును.
కవి తలంపు నెరుగుట సామాన్యాంశము కాదు.

# ఘట్టు ప్రభు రచనలు

1. బాల వివేక చింతామణి—నీతి బోధకము. 1873 సం. అచ్చుపడినది.
2. కుచేలోపాఖ్యానము — ప్రబంధము. 1888 సం. అచ్చు పడినది.
3. సురాభాండేశ్వరము — ఏకాశ్వాస ప్రబంధము 1915. సం. అచ్చుపడినది
4. యాజ్ఞవల్క్య చరిత్రము. మహాకథ. 1955 సం. అచ్చు పడినది.

''సంస్కృతాంధ్ర భాషలయందుగల సామెతలను పలుకుబళ్లను ప్రతి పద్యము నందు ందుపరచి కోవిద గ్రామణులును కోమల మతులగు మాణవకులును కూలంకషముగావరింప గిన కుచేలోపాఖ్యానము రచించిన ఘట్టు ప్రభువు ''రంభా రావణ సంవాదము అను యక్షగానమును రచించెనని వీరేశలింగము పంతులు గారును, వారి ననుసరించి ప్రాచ్య ఖిత పుస్తక భాండాగారసూచిక యందును వ్రాయబడినది. కాని యక్షగాన కర్త షయ కవివేఱు అతడు యాజ్ఞవల్క్యయుడు కాడు. తలిదండ్రులు, సూత్రగోత్రములు ేరు. కాబట్టి ఘట్టు ప్రభువు కాడనుట యుక్తము'' అని నిడదవోలువారు తెల్పి యున్నారు. అముద్రితమగు ''సత్యభామా విజయము'' విషయము సందేహాస్పదము.

ఘట్టు ప్రభువునకు అతడు రచించిన గ్రంథములలో కుచేలో పాఖ్యానమునకు తెలుగు సాహిత్యమున నొకవిధమగు ప్రత్యేకత గలదు. కథ పౌరాణికమయ్యును, కవి ప్రాచీనుడయ్యును నది విలక్షణమగుటకు ఆ కవి ప్రతిభయు తత్కాల వాతావరణమును కారణములనవలయును. జన సామాన్యమున కందుబాటులో నుండు రీతిగా పద్యరచనకు పూనుకొనిన కవిగా నీతడు పేర్కొనదగి యున్నాడు. తనకు పూర్వ ముందలి కవులు ఒకటి రెండు తావులలో చమత్కారముగా వాడిన లోకోక్తులకు ముగ్ధుడగుటయేగాక, శైవ కవుల ధోరణిని మించి తన గ్రంథములో నెన్నియో సూక్తులను శ్రుతి స్మృతి పురాణాదుల నుండిన వానినవసరము వచ్చిన తావులందెల్లవాడుట ఇతని కలమునకు నూతనతను సమకూర్చినది. కనుకనే తాను వ్రాయునది తెలుగు ప్రబంధ మయ్యును సంస్కృత సూక్తిమయుమొనర్చి సంస్కృత భాషకు తెలుగు నకుగల సన్నిహి తత్వమును నిరూపించినాడు. సంస్కృతమునభ్యసింపని తెలుగు వారు కూడనీగ్రంథ మును జదువునపుడు భయపడవలసినయవసరము కలుగదుసరిగదా యాశ్రుత్యాదులయర్థ మిట్టే యవగతమగుచుండును. క్రొత్తగా తోచదు. భావానుభూతి కెట్టియడ్డంకి గాన్పింపదు.

''సామెతలేని మాట ఆమెతలేని యిల్లు'' అని సామెత చెప్తారుగాని 'ముద్ద ముద్దకూ బిస్మిల్లా' అని అదేపనిగా సామెతలువాడితే అదోలా వుంటుంది. ఆదినుండి మన కవులు తమ కావ్యాలలో అవసరమైన చోట్లల్లా సామెతలు మితంగా వాడుతూ నే ఉన్నారు. మధ్యకాలపు కవులలో నాచన సోమన్న తరువాత కవులలో చేమకూర వెంకటరాజుగారు ఎక్కువ సామెతలు వాడడంలో ఘనులు. వాళ్లకన్న నేనేం తక్కువ తినలేదని సగర్వంగా ముందుకొచ్చేకవి ఇంకోఆయన ఉన్నాడు అతనిపేరు ఘట్టు ప్రభువు'' అని యీకవిని గూర్చి తమభావము నీకాలములో దెల్పినవారున్నారు.

మార్గ, దేశి భేదమును మన దృష్టికి దెచ్చిన నన్నెచోడుడు, తర్వాత శైవ కవు
సంస్కృత సూక్తులను శ్రుతుల నుండి ప్రమాణీకరించు పద్ధతిని ప్రవేశ పెట్టినార
తత్ప్రభావ మితని రచనకు మెరుగు పెట్టినది. నన్నయనాటి పురాణ కవితా మార్గము
నన్నెచోడుని వస్తుకవితా మార్గమును అను గంగాయమునలు ఘట్టు ప్రభు
సరస్వతిని చేరుకొని త్రివేణీ సంగమస్థానమున పరమ పవిత్ర భావ బంధురము
పరమార్థ ప్రబోధ ప్రవీణములైనతి కెక్కినవి. శైవ పారమ్యమును జాటు తత్కాల
ప్రబంధములను మించు కోర్కె యేలేనిచో విష్ణుపారమ్యమునింత విశేషము
శ్రుతి స్మృత్యాదుల తో నిరూపించి యుండడనవచ్చును. సంస్కృతము వైదిక దృష్టి
ప్రచారమొనర్చునను వారు సైతము తాము కూడ సంస్కృత సూక్తులను వాడకుం
తమ మత ప్రచారమును సాగింపజూడరు. శైవ కవులు వాడిన సంస్కృత సూక్తుల
శైవ పరములు, ప్రమాణీకరించిన శృతులు—అవని ''బ్రాహ్మణో నహంతవ్యః'' యను ప
కులు 'సమానశీల వ్యసనేషు సఖ్య' మనిన వచనము. వేద ప్రామాణ్యము ఆర్ష ప్రామాణ
ముగల దేశభాషా గ్రంథముల కాదరముండెడి కాలమున దమ గ్రంథముల ననువా
మొనర్చినవారు వాడుట మాత్రము కాదు, కేవలము స్వకర్తృకములగు గ్రంథము
లందున వాడుట గమనింపదగును. తన్మూలమున దమ గ్రంథమునక
తద్గత కథకు ప్రమాణత స్థిరపడునను భావముగల వారనుట తథ్యము
'ధరనుమామాతాపితా రుద్ర, మమ కర్తా మహేశ్వరః, శ్రుతి ఏక ఏవరుద్రో,
యున్నయట్లు, 'కోయని శ్రుతియు, 'నే కోరుద్ర ఉచ్యతే, 'శ్రుతి సదా పశ్యంతి
సూరయోయనగ 'శ్రుతి సనహరిగ్ం హరంతం, బనుచు'' వంటి శృతులను,'రాజ్ఞో రాష్ట్ర
కృతం పాపం రాజపాపం పురోహితాన్' వంటి సూక్తులను, 'రాజులబోరయుద్ద్రాష్ట్రంబు
పాపమోజమాలినవారి నొగిబర్పుకున్న, వినఁజెప్పకున్నఁ దజ్జనవాథు పాపమనఘ పురోహితు
లను నవశ్యముబొందు' అనునీతి యను వాదములను వాడిన కవులను అనుకరించెను
మించెను అనియూ క్రింది ప్రమాణములు సూచించును.

విష్ణుపరములైనవి— 'నదైవం కేశవాత్పరమ్, సర్వం విష్ణుమయం జగత్, ఏకో
విష్ణు మహద్భూతమ్, అణోరణీయాన్మహ తోమహీయాన్, నా విష్ణుః పృధివీ
పతిః' వంటి శృతి వాక్యములతో 'నమో బ్రహ్మణ్యదేవాయ............గోవిందాయ
నమోనమః' వంటి శ్లోకములనే శ్లోక పాదములనే సూక్తులుగా సుమారు డెబ్బదివాడిన
కవి సంకల్పము తన గ్రంథమునకు ప్రముఖ స్థానము నార్జించుకొనుట కనక తప్పదు.
ఈ కవి వాడిన శ్రుతి స్మృతి సూక్తులను ప్రత్యేకముగా సవివరణముగా వ్రాసిన
యొక గ్రంథముగా రచించుట కవకాశమున్నది. క్రోడీకరించిన వానిని ముందు చూడ
గలరు.

ఒక్కొక్క కవి తనకు నచ్చిన ప్రాచీన కవి మార్గమును బట్టియే సంచరించుచుండు
ను. తిక్కనకవిని నాచన సోమనవలె, జక్కనను రామరాజ భూషణుని తనకు మార్గ
దర్శకులుగా ఘట్టు ప్రభువెన్నుకొని నాడనవచ్చును. పూర్వకవి స్తుతిగా సంస్కృత
కవులనే స్తుతించి తెలుగు కవుల నెత్తుకొనక పోవుట, తనకుల గోత్రాదులుగాని, తన
యితర రచనల గూర్చిగాని యే గ్రంథములోను దెల్పుకొనకుండుట వింతగానున్నది. తన్ను
గురించి వ్రాసికొనిన పద్యము మాత్రము 'భ్రమరాంబికా వర ప్రభవ దివ్య కవిత్వ—
....ఘట్టు ప్రభు నామధేయ విఖ్యాతయశుడ.' కుచేలోపాఖ్యానము—1.12.

''శత లేఖినీ పద్య సంధాన ధౌరేయు——బుధ విధేయు శుభమూర్తి నావ, రుు'' అను రామరాజ భూషణుని దలపింప జేయుచున్నది. జక్కన తాత నాటి ండి వచ్చిన కవితారీతులలోను, ఆశుకవిత్వాదులలోను తనకు గల యసాధారణ ప్రజ్ఞను కటించుకొనుట యితని ప్రాచీనతను దెల్పగలదు. పదునారవ శతాబ్దమునకు ముందే ంగు కవులు తెలుగు కవిత్వము నాల్గు విధములుగా నున్నదను తలంపుతోనుండి ంన్నారు. అట్టి చతుర్విధ కవితను వ్రాయగలుగుటయే పరిపూర్ణతకు లక్షణమను ప్రాయముతో నుండెడివారు. అందువలననే ఆంధ్ర కవితా పితా మహుడు పూర్ణ తా శక్తి తనయందున్న ఆత్మ విశ్వాసమును నున్నట్లు గద్యములో వ్రాసి కొనుట నుభూతమే. ముందీ విషయము వివరింపబడును.

''ఘటికాశత గ్రంధ ఘటనా సముచిత
    చాతుర్య మహిమకుఁ జాలినాఁడఁ
భౌఢిమనేకైక పక్షమాస మహాప్ర
    బంధ కల్పన శక్తిఁ బ్రబలి నాడ
మఱియునాశువు చిత్రమాధుర్య వాక్యప్ర
    గల్భనంబున నుతుల్ గాంచినాడ''.

ఈ కవితా ప్రక్రియను తమకు ఘనతను చేకూర్చుదానినిగాఁ దెలుపుకొను కాలమునకు ంచెము వెనుకగా నుండదగిన కవిని పూర్తిగా వెనుకకు లాగు ప్రయత్నమున ండుట కన్న, ఈ చతుర్విధ కవితా రచనా సామర్థ్య ప్రకటనమువలనను మధుర తి రగడ వంటి ఛ్ఛందస్సున రచన సాగించుటను ప్రాచీనుని గానెంచుట తగదా? రవర్ణనమును పరికించుచో ప్రాచీనతనే వెల్లడించుట కంగీకరింతురు. రచనా విధానము ను, వర్ణనములోను అవంతి పట్టణమునకును ద్వారకా పట్టణమునకు, తాపసి ల్లె పట్టణముగా మారినదని వర్ణించునపుడును పుష్పలావికాదులను విటజనములను పిలొ్కనుటలోను ప్రాచీనుల పద్ధతియే కొట్ట వచ్చినట్లు ప్రత్యక్షమగునని తెల్పుటకు హసింతును.

## అవతారికా భాగము

సామాన్యముగాగాక అసామాన్యముగా లోకమునకు విజ్ఞానమును ఆనందవ ప్రసాదించుటకు భగవంతునిచే సృజింపబడిన వ్యక్తులలో గణింపదగువారు కవు కవులు లేనిదే గ్రంథములులేవు. సమగ్ర చరిత్రములేదు.

"వ్యాకులుడైన పార్థునకు నా హరి గీతను దెల్పియుంట వీరాకృతి నిల్వరావ దశాననుడీల్గుట మిథ్య వ్యాసవాల్మీకులు దెల్పకున్నకృతిలేని మహాత్ముల వర్తన రత్నాకర వేష్టితావని వినంబడదెన్ని గతుల్చరించినన్" అను రీతి చరితను నిల్పు గ్ర ములులేని జగమంధకారబంధురము. లోకశ్రేయమునే కాంక్షించి తమ జీవితము ధారవోసిన కవులను విస్మరించుజాతి యెన్నడును వృద్ధినందబోదు. సామ్రాజ్యమ బోగొట్టుకొనుటకు సమ్మతింప వచ్చునుగాని తమ దేశకవిని వదలుకొనుటకే సమ్మతింపరు.

ప్రాచీన కవులు తమ దేశకాలములను గూర్చికాని, తమ్ముగూర్చికాని విశేషమ చెప్పుకొను అలవాటు కలవారుకారు. కనుకనే వాల్మీకి వ్యాసాదులవలె భాసకా సాదులు ఏ కాలమువారో యే యేదేశములందెవరెవరి యాస్థానములందు మెల నిశ్చయముగా దెలిసికొను నవకాశమిప్పటికిని లభింపకున్నది. తమ దేశమును గు యంతగా పట్టించు కొనక పోవుటవలన వారి దేశమునుగూర్చి తరువాతి వ తగవులాడుకొను స్థితికి దావొసంగినారు. వారి దృష్టిలో మాండలిక భేదాదు స్థానము లేకపోవచ్చును. యావద్భారతములోనేభాగమునకు జెందినను భారతదేశవ కాగౌరవము లభించును. ఒక మండలములో నుండిన కవి తన మండలమును గు తెల్పుకొనినచో దనకు హానిలేదు. పరిగదా ఆ మండలమునకు నీ మండలమునకు బడవలసిన స్థితి కలిగియుండదు.

ఇటీవల కవులన్నవో పలువురు తమ దేశకాలములను గాని, తమకాశ్రయభూతు ప్రభువుల ప్రశంసను గాని, ఇష్టదైవ ప్రస్తుతిగాని చేయుచుండిరి. పూర్వక స్తుతి, కుకవి నింద, గ్రంథ రచనయందు తమకు గలిగిన ప్రోత్సాహము, ఉద్దేశమ మున్నగువానిని గ్రంథావతారికలో తెలుపు చుండుట యొక సంప్రదాయముగా నే నది. దానిని బట్టి గ్రంథరచనలో కవి భావమును, దేశకాలములను గూర్చి కొ వరకైన గ్రహించుటకవకాశము కలిగినది. హరిహరాదులను గజాననార్క సరస్వతు స్తుతించుటయు 'ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవాపితన్ముఖ'మ్మను నియమానుసార వస్తునిర్దేశముగాని, ఆశీర్వచనముగాని చేయుటయు నాచారమైనది.

# కవి దేశకాల నిర్ణయము

ఘట్టు ప్రభువు తన దేశకాలములనుగాని, తన కాశ్రయభూతులైన ప్రభువుల ప్రశంసనుగాని చేసియుండలేదు. ఇష్టదైవ ప్రశంసను గ్రంథమునుబట్టి కృతిపతిని బట్టి పలురీతుల యొనర్చినాడు.

తనను గురించి సురాభాండేశ్వర, కుచేలోపాఖ్యానములో గొంత వరకు దెల్పు కొనినాడు. యాజ్ఞవల్క్య చరిత్రములో ఆశ్వాసాంత గద్యను బట్టి కవిని దెలిసికొను స్థితి కలిగినది. సత్యభామావిజయము విషయము సందేహాస్పదము. పూర్వ కవి స్తుతిలో గూడ నీతని మార్గము వింతగనున్నది. ప్రాచీన సంస్కృత కవులనుపేర్కొని నాడుగాని తెనుగు కవి నొక్కనినైన తలంపడు. తనకంటె ప్రాచీనులగు తెనుగుకవులు పలువురుండగా వారిలో నే యొక్కని పేరైననెత్తకుండుటలో నుద్దేశ్యమేమై యుండునో? కుకవి నింద సాగించినాడు. తన ఘనతను వెల్లడించు కొనినాడు. కాని తన వంశము నుగాని సూత్ర గోత్రములనుగాని జననీ జనకులనుగాని పద్య భాగములో బేర్కొనలేదు. ఆశ్వాసాంత గద్యములో ''యల్లయామాత్యపుత్ర'' యని యున్నందున జనకుడు యల్లయ్య అనితేలినది. సత్యభామావిజయములో

''ఇది భ్రమరాంబా సమిద్ధప్రసాద
విదిత సారస్వత విఖ్యాత ఘట్టు
వీర సత్పుత్ర నవీన సాహిత్య
సారాభిలాష శేష కవీంద్ర భవ్య
శేముషీ రచితమై చెలువగు సత్య
భామావిజయమని ప్రఖ్యాతిగాంచి
అనుపమంబైన మహా ప్రబంధమున
అనఘ వైఖరి తృతీయాశ్వాసమయ్యె.''

అని తక్కిన గ్రంథములలో జనకుడు యల్లయ్య యని యుండగా నిందులో, 'వీరన' యని యున్నది. ''ఘట్టుప్రభు నామధేయ విఖ్యాతయశుడ, ఆది కవితా ప్రమదాజనకుండ ఘట్టు ప్రభునాముండన్'' అని చెప్పికొనిన నామము శేషకవిగా నిందు బేర్కొనబడినది. 'వీరన వ్యవహారనామము ఎల్లయ్య అయియుండదగును ఈతని పేరు శేషయ కవి. ఘట్టు ప్రభువు అనునది వ్యవహారనామము, అని ని. వేంకటరావుగారు తలంచినారు. ''ఘట్టు ప్రభువు అనునది వ్యవహారనామమట, పేరు శేషకవి. ఇతడు ఘంటయ్య'' అని శ్రీ కావలి వేంకటస్వామిగారు వ్రాసినారని బులుసు వేంకట రమణయ్యగారు వివరించినారు.

'ఇతని పేరు ఘట్టుప్రభువు. ఇతని అసలుపేరు ఘట్టు శేషయ్య', అని ఆర్ముద్రగారు నిర్ణయించినారు. తన వంశమునుగాని జననీ జనకులను గాని పేర్కొనక పోవుటచేతను, సూత్రగోత్రాదుల నెత్తుకొనకపోవుటచేతను పలు సందియములక దారి చూపినట్లయినది. ఘట్టు వారింటి పేరనియు పేరు ప్రభువనియు చెప్పువారు పలువురు. దేశమును గూర్చి కాలమును గూర్చి సందేహములేగాక వంశమును గూర్చి

కూడ సందేహింప వలసిన స్థితి వచ్చినది. నన్నయ్య వంటి యేయొకరిద్దరో తప్ప మిగిలిన వారిలో పలువురు నియోగులగుటచేత కాబోలు తనను గూర్చి కవి తెలుపుకొనక పోయినపుడు ఆతడు వైదికుడైనను నియోగిగా గణింపబడినాడు. వైదిక కర్మలందు లగ్నచిత్తులగువారు కృతులను రచించి కృతిభర్తలను వెదకు పనికి పూనుకొనువారు కారేమో ? ఘట్టు ప్రభువు అమాత్య పుత్రుడుగాన నియోగియైనను ఆర్వేలవాడా, ప్రథమ శాఖకు జెందిన వాడా యను సందేహము తీరలేదు. యాజ్ఞవల్క్య చరిత్ర రచనను బట్టి ప్రథమశాఖకు జెందిన వాడనక తప్పదు. ఘట్టువారు ప్రథమ శాఖలో నుండి నందున నాళ్లగట్టు వారాతనిని ప్రోత్సహించి గ్రంథము వ్రాయించినందునపై యూహ సరియైనదే కావచ్చుననుకొన వీలుకాన్పింపదు. 'రంభారావణ సంవాద' మను యక్ష గానమును రచించిన శేషయ కవి ( ఘట్టు ప్రభువు) యాజ్ఞవల్క్యయుడుకాడు, తల్లిదండ్రులు సూత్రగోత్రములు 'వేరు' అని నిడదవోలు వారు నిశ్చయించినారు. అనగా ఘట్టు ప్రభు నామము గల శేషయ కవులిరువురు కాన్పించుచున్నారు. కవి తాను రచించిన యే యొక్క పుస్తకములోను తాను రచించిన మరియొక పుస్తకము పేరైన నెత్తికొనకపోవుట వింతగా దోచును. అసామాన్య కవి, మూడు నాలుగు గ్రంథములు వ్రాసినవాడు ఇంత నిస్పృహత్వమున నిర్లిప్తతతో తన చరిత్ర విషయములను వెల్లడించక పోవుటయేగాక దేశకాలాదులనేని పేర్కొనక పోవుట చాల శోచనీయము.

ఘట్టు వారిది కాత్యాయన సూత్రము. కాశ్యప గోత్రముగా ప్రథితమైనది. వేంకట రామకృష్ణ కవి రామాయణ కథను పట్టాభి రామాయణమను గ్రంథముగ రచించినాడు 'భ్రమరాంబికాలబ్ధ భాసితమ్మదు నవ్యకవితా రసజ్ఞత గాంచినాడ, సంస్కృతాంధ్ర విచారసార కల్పిత పద్యగద్యచమత్కృతి గల్గినాడ ............ఘట్టి రామ సత్కవివరుడు ఘనత కెక్కెను పదపద్య కల్పనమున'' అని (ఆర్, 172లో) చెప్పుకొనినాడు. ఈ కవియును కుచేలోపాఖ్యానములో 'భ్రమరాంబికావరప్రభవ దివ్య కవిత్వ విద్యా ప్రవీణత వెలసినాడ......ఘట్టు ప్రభునామధేయ విఖ్యాతయశుడ' అని పేర్కొనినవాడును ఒకే గోత్రమునకు జెందిన వారైనచో ప్రథమ శాఖీయులనక తప్పదు. కాని పందిటి గురివి శెట్టి 150 సంవత్సరములకు పూర్వము వ్రాసి యుంచిన తాళపత్ర గ్రంథము సురాభాండేశ్వర గద్యల— 'కవితా ధురంధర ఆర్వేల ఆత్రేయస గోత్ర ఆపస్తంబ సూత్ర ' అని యున్నది. ఇతడెవరి ప్రతిని జూచియిది వ్రాసెనో తెలియదు. భ్రమరాంబా భక్తులు కేవలశైవముగాక, వీరవైష్ణవము గాక యుభయమత సహనశీలురని వారంకితము చేసి స్తుతించిన దేవతలను బట్టి తేలుచున్నది. సూత్ర గోత్రాదులలోనే గాక దేశకాలములలోని వ్యత్యాసమునుగూడ తెలిసికొనుట ప్రధానాంశము.

అజ్ఞాతముగా నుండి పోయి మరుగుపడిన చరిత్రగల కవులను వెలుగులోనికి దెచ్చి వారి చరిత్రలను కొంత వరకైన ప్రజాసామాన్యమునకు అందుబాటులోనికి దీసికొని వచ్చి పలువుర ప్రశంసలకు పాత్రులైన వీరేశలింగము గారు ఆంధ్రకవుల చరిత్రము మూడవ భాగమున నీరీతిగా దెల్పియున్నారు. 'ఈ కవి నెల్లూరి మండలములోని వాడయినట్లును, అప్పటికెనుబది సంవత్సరముల క్రిందట నుండినట్లును నెల్లూరి మండల చరిత్రమున వ్రాయబడినది. కాబట్టి కవి యిప్పటికి నూరు సంవత్సరముల క్రిందట నుండినవాడు ' అని ప్రభుత్వము వారి రికార్డునుబట్టి నెల్లూరి ప్రాంతము వాడనినారు.

''నెల్లూరి మండల చరిత్రమిప్పటికి (1–1–1955) యెనుబదియేండ్లు క్రిందటిది. అనగా క్రీ. శ. 1870 ప్రాంతముది. కావున నప్పటికెనుబది యేండ్లనగా క్రీ. శ. 1750 ప్రాంతమున నీకవి యుండవచ్చును. ప్రస్తుతము మనకు లభ్యములైన గ్రంథముల తాళపత్ర ప్రతులును నీకాలమునే స్థిరపరచు చున్నది.'' అని నిడదవోలు వారు వివరణ మిచ్చియున్నారు. వారి లెక్క ప్రకారము క్రీ. శ. 1790 కావలసియున్నది. ఇంచుమించుగా వీరేశలింగము గారనిన కాలమునకే వీరును సమీపించినారు. కుచేలోపాఖ్యానవ్రాత ప్రతులు 461–468లకు విశేష కాలవ్యత్యాసము కానరాదు. పైనుదాహరించిన తాళపత్ర ప్రతుల కాలములబట్టి ఘట్టు ప్రభువు క్రీ. శ. 1730–1780 ప్రాంతములనున్న వాడనవలసియుండును.

"బులుసు వేంకట రమణయ్యగారు ఆంధ్రకవిసప్తశతిలో ఘట్టు ప్రభువు, ( శేషకవి ) ఈతడు ప్రథమ శాఖా బ్రాహ్మణుడు. ఎల్లనామాత్యుని పుత్రుడు. ఈతడు నెల్లూరి ప్రాంతము వాడనియు రెండు వందల యేబది యేండ్ల క్రిందట ( 16వ శతాబ్ది నడుమ ) నుండినవాడనియు దెలియుచున్నది. ఘట్టు ప్రభువనునది వ్యవహారనామమట. పేరు శేషకవి. ఇతడు ''ఘంటయ'' అని శ్రీకావలి వేంకట రామస్వామిగారు వ్రాసినారు ( 1956) ఏరు పదునారవ శతాబ్ది నడుమకేల దేల్చిరో కారణమును వివరింపలేదు.

సమగ్రాంధ్ర సాహిత్యములో నీకవి కాలమును గూర్చి తెల్పుచు క్రీ. శ. 1730–1750 ప్రాంతము వాడనినారు. తాళపత్ర గ్రంథముల లేఖరుల కాలమును బట్టి నిర్ణ యించుచో క్రీ. శ. 1738 నాటికే తాళపత్ర గ్రంథములు లభించినందున కవి యంతకు పూర్వమే ప్రథితుడయి యుండవలయునుగాన 17వ శతాబ్దికి తరువాతి వాడు కాడనవలయును. తాళ పత్ర గ్రంథములను బట్టియేగాక యితర ప్రమాణము లచే గూడ నిర్ణయము చేయజూచుట యవసరము. కవికృత గ్రంథ ప్రమాణము లను బట్టిగాని ఇతర కవుల గ్రంథ ప్రమాణములను బట్టిగాని కాలము నిర్ణయింపదగు నాధారములు నిశ్చితముగా లభింపవు. తాను కృతి యొసంగిన యమాత్యుడైనను ప్రథితుడుకాడు. చరిత్ర కెక్కినవాడుగా గాన్పింపడు. అముద్రితమగు సత్యభామా విజయములో పేర్కొన్న నాళ్లగట్టువారు కూడ ప్రసిద్ధులుగా తోచదు. ఐనను ఆకవి వేరనియే భావింప వలసి యుండును.

ఘట్టు ప్రభువు గ్రంథములు క్రీ. శ. 19వ శతాబ్ది చివర 20వ శతాబ్ది ప్రారంభములోను ప్రకటితములైనందున నూరు సంవత్సరముల క్రిందట నుండిన

1. కావలి వేంకటరామస్వామి యను నాయన ఆంగ్లభాషలో గొందరాంధ్ర కవులను గూర్చిన చరిత్రలు వ్రాసి 1847వ యేట బొంబాయిలో వెలువరించినారు. కవుల చరిత్ర రచనలో వీరిదే ప్రథమ ప్రయత్నము.

'Biographical sketches of Deccan Poets by Cavely Venkata Rama Swamy.' Printed in 1829 at Calcutta—Reprinted in 1888 Madras.

వాడని వారేగాని ఆతని కవిత్వమును శైలిని పదభావములను విచారించి నిర్ణయించి నట్లు తోచదు. సంస్కృత లోకోక్తుల నెక్కువగా వాడు సంప్రదాయము శైవ కవుల నుండియు లోకోక్తులను, జాతీయములను నుడి కారములను నాచన సోమనాధుల నుండియు, హరిహరాద్వైతము తిక్కనాదుల నుండి గ్రహించినాడు. పోతన శ్రీనాధాదుల ఛాయ లచ్చటచ్చట కన్పించినను స్వతంత్రుడు. జనసామాన్యమునకు కవితనందుబాటు లోనికి దేజాచిన కవులలో విశిష్టస్థానమును నాక్రమించిన కవి. కేవల శృంగారవర్ణనము నకు మక్కువ చూపువాడు కాడు.

ఆంధ్ర శబ్ద రత్నాకరము రచించిన శ్రీ సీతారామాచార్యులవారు ఘట్టు ప్రభువు గ్రంధముల నుండి యుదాహరణ లిచ్చుటచేతను నీకవియందు గౌరవముగలదని తోచును. కుచేలోపాఖ్యానము సురాభాండేశ్వరములలో నుండియే యుదాహరించుట చేత నప్పటికి యాజ్ఞవల్క్య చరిత్రము సంగతి తెలియదని తోచును.

ఒక కవియొక్క ప్రయోగములను ప్రమాణికరించునప్పుడాతని కొక విశిష్ట స్థాన ముండునని తెల్పుట ముఖ్యము. అట్టి కవికాలమును ఇదమిద్ధమని తేల్చుట కష్టము. బులుసువారనినట్లు 16వ శతాబ్దినడుమ వాడేయనినచో పలువుర పల్కులను కాదని వలసి వచ్చును. నెల్లూరి మండలము కవి వేరైనచో గొంత వరకు సమన్వ యము చేసి కొనవీలుండును.

ఆంధ్ర కవుల చరిత్రమునువెలుగులోనికి దెచ్చిన శ్రీ వీరేశలింగముగారు నెల్లూరు మండలము కవియని యొక నిర్ణయముచేసియున్నారు. వారు ప్రథములుగాన నేదియో యొక యాధారముతో నామండలమువాడనినారు. దానిని నిడదవోలువారుగాని, బులుసు వారుగాని ఖండించలేదు. ఆరుద్రగారు కొంచెము చురుకుపాలుగా ''నెల్లూరివాడని పొర బడుతున్నారు. నెల్లూరు మండల చరిత్ర ఆధారంగా వీరేశలింగం గారు తమ కవుల చరిత్రలో ఇతని నివాస సీమను పేర్కొన్నారు. మన పరిశోధకులందరూ దీనిని అంగీకరించారు. అయితే యితని కృతులను చూస్తే అతడు కర్నూలు జిల్లా, నంది కొట్కూరు తాలూకా వాడని చెప్పవచ్చును. సత్యభామ విజయంలో పేర్కొన్న గ్రామా లన్ని ఆ తాలూకాలోనే ఉన్నాయి. యాజ్ఞవల్క్య చరిత్ర కూడా దానినే బలపరు స్తుంది.'' అన్నారు. అముద్రితమైన సత్యభామ విజయము నాధారముగా దీసుకొని నెల్లూరు మండల కవిని కర్నూలు మండలమునకు దీసుకొని వెళ్లుటయేగాక ''రెండు కావ్యాలను కర్నూలు మండలంలో వ్రాసిన గట్టు ప్రభువు ఆ ప్రాంతం వాడేనని వికరంగా చెప్పవచ్చును.'' అని ''అయితే బంగారం ఏ గనిలో పుట్టినా గీటురాయి విలువతేలుస్తుంది.'' అని సెలవిచ్చినారు.

అసలు సత్యభామ విజయాన్ని ఘట్టు ప్రభువు వ్రాసినట్లంగీకరించవచ్చునా? లేక ఆ గ్రంధము రచించిన శేషకవి ఘట్టు ప్రభువే యనవచ్చునా? పైన తెలిపి నట్లు ''ఘట్టు ప్రభు నామధేయ విఖ్యాత యశుడ'' ''ఆదికవిత ప్రమదాజనకుండ ఘట్టు ప్రభువా ఖ్యుండన్'' అని పేర్కొనిన ఘట్టు ప్రభువు సత్యభామావిజయ ములో ''కరమున రాణించు ఘట్టు వంశమున సరసుడవయ్య శేష కవీంద్రనీవు'' అని పేర్కొనినట్లు వ్రాసికొనునా? అసలు పేరు, వ్యవహారనామమేదో ఉపపత్తిగా పేరు గూర్చి సర్దుకొనజూచినను తండ్రి పేరునైన గుర్తింపవలదా? ఎల్లయామాత

పుత్ర, యల్లయామాత్య పుత్ర'' అని ఆశ్వాసాంత గద్యములలో బలు తావుల నుండి నందున తండ్రి యల్లయ్య అనకతప్పదు. ఇదియును అసలు పేరు, వ్యవహార నామము అని త్రోసివేయుట భావ్యముకాదు. వీరయ్య ఎల్లయ్య అను పేర్లు పద్య గద్యములలో నిబద్ధింపబడి యున్నందున ఇరువురు నొకరేయనుట సబబుగాదోపదు. తన గొప్పతనమును గొంత వరకు చాటుకొనిన ఘట్టు ప్రభువు తండ్రి పేరేల పేర్కొనలేదో? శేషకవీంద్రుడు మాత్రము వీరయ్య పుత్రుడనని స్పష్టముగా చెప్పుకొనినాడు.

''శ్రీ భ్రమరాంబా సమిద్ధ ప్రసాద
విదిత సారస్వత విఖ్యాతఘట్టు
వీరసత్పుత్ర నవీన సాహిత్య
సారాభిలాష శేషక వీంద్రభవ్య.'' అను పద్యమున ఛందోబద్ధమై యతిప్రాసలలో నిరూపితమైనందున శేషయ్య తండ్రి వీరయ్య యనక తప్పదు. తన సూత్ర గోత్రాదులనుగాని తన వంశమునుగాని, తుదకు తండ్రి నామమునుగాని పేర్కొనక పోవుటచేత నెన్నియో సందేహము లుదయించుచున్నవి.

సత్యభామావిజయంలో పేర్కొన్న గ్రామాలన్నీ నందికొట్కూరు తాలూకాలోనే యున్నందున కవి కర్నూలుజిల్లా వాడని నిర్ణయించి దానిని సమర్ధించుటక ''యాజ్ఞవల్క్యచరిత్రకూడా దానినే బలపరుస్తుంది'' అని ఆరుద్రగారు మరొక యుపపత్తిని జూపినారు. సత్యభామావిజయము వ్రాయ ప్రోత్సహించిన నాళ్లగట్టు ఎల్లయ్యగారు గట్టు శేషయ్యను పిలిపించాడు ''కరమును రాణించు......విశ్వరక్షకునకు విశ్వేశ్వరునకు అంకితముగ జేయు'' మనిన—రామాపురం కరణంగారు పిలిపించి విశ్వేశ్వరాంకితముగా వ్రాయుమని ప్రోత్సహించగా వ్రాసిన సత్యభామా విజయం గట్టు శేషయ్యది నంది కొట్కూరు తాలూకా అనిమాత్రం నిర్ణయింపగలదా? చక్కని కవిత్వమును రచింపగల సమర్థు డొకడున్నప్పుడు, ఆతడు తమ శాఖకో, తమకోవకో చెందినప్పు డెక్కడివాడైనను పిలిపించి గ్రంథము వ్రాయించి సత్కరించవచ్చును. అంతమాత్రమున కవి ఆ ప్రాంతము వాడని నిర్ణయించు టెట్లు? ''బొబ్బిలి పట్టాభిషేక చరిత్రము, బొబ్బిలియుద్ధ నాటకము రచించిన శతావధానులు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు బొబ్బిలి ప్రాంతము వారనగలమా?

ఘట్టు ప్రభువు రచనయేయని నిర్ణయింపబడు యాజ్ఞవల్క్య చరిత్రము కుచేలోపాఖ్యాన రచన తర్వాతదా? అంతకుముందుదా అని నిర్ణయించుటకు దగిన ఆధారములు కాన్పింపవు. కుచేలోపాఖ్యాన రచనకు ముందనియే నిర్ణయింపవలసి యుండును. ''నరునకు నంకితములుగా వరకృతులొనరింప మున్నగు పద్యము స్పష్టముగా ఘట్టుప్రభువు నరాంకితమునకు విముఖుడని తేల్చును. అతడు వ్రాసిన యితర గ్రంథములు దైవాంకితములు. యాజ్ఞవల్క్య చరిత్రలో మాత్రము

శా॥ శ్రీమత్పర్వత....ఉద్దండలింగా మాత్యాగ్రణికిచ్చుగాత నుతపౌత్రానేక సౌభాగ్యముల్, అని మొదటి పద్యములో నరున కాశీస్సు లొసంగి, ఎత్తుగీతిలో 'ప్రాత కోట మహాగ్రామ...శ్రీలొసంగుగాత'' అనికూడా దీవించినాడు. ఐదు పద్యములలో ఉద్దండ కులావతంసను లింగామాత్యు నాశీర్వదించినాడు. షష్ఠ్యంతములు లేవు. ఉన్న ఆశ్వా

సొంత పద్యములు సర్వసామాన్యములు. ఆ పద్యములలో చెప్పిన ప్రాత కోట
కొటూ్కరు తాలూకాలోనే ఉన్నది.

ఉద్దండ లింగామాత్యుడు దూరదేశస్థుడైనను కవిని రప్పించి యు
విరళముగా నున్న అనాటి కవులలో శ్రీనాథాదు లెక్కడకు పడితే అక్కడకు
రాజాశ్రయములో జీవించు నాచారమున్నదిగదా? రాజులనే కాదు, అమా
ఆశ్రయించువారు. అట్లే లింగయామాత్యునిచేత నాహూతుడైగాని,యాశ్రయిం
యక్కడకు వెళ్ళి గ్రంథము వ్రాసి యుండవచ్చును. వ్రాసిన గ్రంథమ
నీయవచ్చును. అంతమాత్రమున కవి ఆదేశమునకు జెందినవాడని నిర్ణయిం
అట్టి సందేహము రేఖామాత్రముగానైన తట్టుటచేత కాబోలు ఆరుద్రగా
బంగారం ఏ గనిలో పుట్టినా గీటురాయి విలువ తేలుస్తుంది' అని సూచన చే

కుచేలోపాఖ్యాన సురాభాండేశ్వరముల నాధారముగా దీసికొని దేశ నిర్ణయ
సావకాశము లేదుగాని గ్రంథస్థాంశములను అంతరంగిక సాక్ష్యములుగా దీసి
చరిత్ర స్వీకరింపవచ్చును. యాజ్ఞవల్క్యచరిత్ర, సత్యభామా విజయములన
కించి, నందికొటూ్కరు తాలూకాలోని గ్రామములైన రామాపురం ప్రాతకోట
నాళ్లగట్టు ఎల్లయామాత్యుడు, ఉద్దండ లింగయ మంత్రులను బట్టి ఒ
నిర్ణయము జరిగినది. ఆ నిర్ణయములో సత్యభామా విజయ కర్తృత్వ
గ్రస్తము. ఇక ఉద్దండలింగయ మంత్రి ఎక్కడివాడో? ప్రాతకోటలోని
ణుడు....సౌభాగ్యముల్'' అనుటచేత, ప్రాతకోటలోని శివుని స్తుతించిన మా
గ్రామవాసి యనవచ్చునా? ఒకవేళ మంత్రి ఆయూరివాడే కావచ్చుననుకొం
కవి విషయము? అంతరంగిక సాక్ష్యముతప్ప ఇతరాధారములకు దావులేనప్పుడే
నుండునో దానినే స్వీకరించుట లెస్స. యాజ్ఞవల్క్య చరిత్రములోని యా
పరికింతము.

'ప్రథమ శాఖాన్వయ' [1]ప్రభు శిఖామణులు నానంద కందళిత హృదయా
యొక్కనాడు సూర్యోపరాగ పుణ్యకాలమందున, సప్తనదీ సంగమేశ్వర మంది
గోపుర ద్వారంబున సుఖాసీనులై యిష్ట, గోష్ఠీ వినోదంబులం బ్రొద్దు
స్వశాఖాయుక్తుండగు మంజుభాషణుండను పౌరాణికుంగనుంగొని యిట్లని
వంశము...విరచింపుము....విఖ్యాతముగన్ః' ఆమంజుభాషణుడెవ్వరో కాదు. వ
ప్రభువే. వినిపింపుమనలేదు గదా? విరచింపు మనుటచేత నా కవియే మంజుభ
ప్రతిఫలించినాడు. కాగా ప్రథమశాఖకు జెందినవాడను వారికిది యాధారము
కుడు వినిపించునేగాని విరచింపడు. పౌరాణికునట్లు కోరుట యసంగతము.
సంగమేశ్వరము ప్రసిద్ధము.

ప్రాతకోట అను పేరునుబట్టియు, యాజ్ఞవల్క్యచరిత్రములోని యి
ములను బట్టియు ఘట్టుప్రభువు గోదావరీ తీరస్థుడనక తప్పదు. ప్రథమ శ

1. యాజ్ఞవల్క్యుని శిష్యులలో ప్రథముడు కణ్వుడు. ఆతడు ప్రవర్తింపచేసినది కాణ్వశా
శిష్యుడు గనుక ప్రథమశాఖ అనికూడ అందురు. దీనినే ఆదిశాఖ, అగ్రశాఖ. అని కూడ
కణ్వుడు తపస్సుచేసి తీసికొనివచ్చిన శాఖ గోదావరి కణ్వశాఖ.

ప్రభు శిఖామణులకు నివాసభూమి గోదావరీతీరము. ఎప్పుడు నెడతెగక ప్రవహించు ఏరునకు సమీపముగనే వేదవిదులైన విప్రవర్యులు వసించుచుందురు. కోటిఫలి తత్పరి సర గ్రామములు, పలివెల, ర్యాలి, కొమరగిరి పట్టణము. లక్ష్మీపోలవరము, కుంచనపల్లి, భీమక్రోసుపాలెము, పెదవళ్ల మున్నగు తావులందు యాజ్ఞవల్క్యశాఖకు జెందినవారెంద రో యున్నత స్థితిగతులతో నొప్పు నుత్తములు వసించుచుండువారట. ఆ శాఖకుజెందిన ద్విజులు, బొల్లాప్రెగడ, కొచ్చెర్లకోట, గోపేటి, చల్లా, తోలేటి, లింగాల, దామెర్ల, చట్లపల్లి, పతేలుఖానా, కూచి, తెనాలి, కాకర్లమూడి, అంబర్‌ఖానా, కొప్పర్తి, తుట్ట గుంట, గోపరాజు, గోదావరి, వరాహగిరి, పెడసనగంటి, భాగవతుల, ఆదుర్తి మొదలగు గృహ నామములుగల వారెందరో ప్రసిద్ధులున్నట్లు ప్రథితము. కంచర్ల, స్థానం, మునిమాణిక్యం మున్నగు నామములున్నవి. మిక్కిలి ప్రాచీనకాలములో గోదావరీ తీర మున కోటిఫలికి సమీపమున మహారాజుల నిలయమై పెద్దకోటగల గ్రామముండెడిది. నేటికిని కోటిఫలిలో నొక కొంతభాగము కోటగ్రామమునకు సంబంధించినదే. ఆ గ్రామము గోదావరి నదిలో క్రమక్రమముగా కలిసిపోవుట తటస్థించుచుండెను. అదొక్కటియేకాదు. దానితోబాటు వరుసగా మనకపల్లి, బ్రహ్మపురి, వింజరమువంటి గ్రామములుగూడ నదీ గర్భములో లీనమైపోయినవి. పిమ్మట వెనుక వెనుకకు వచ్చి వచ్చి గ్రామములు తిరిగి నిర్మించు కొనుట తప్పనిసరియైనది. నేడు పాతవింజరము గౌతమి కావలియొడ్డున, ఇప్పటి వింజరము నదికీవలియొడ్డున నొప్పుచున్నది. బ్రహ్మపుర్యాదుల స్థితి పూర్తిగా నదిలోనే. కోటగ్రామము క్రమక్రమముగా గోదావరినదిలో గలసిపోవు చుండుటచేత నానాటి రాజులు తమ కోటను తిరుగ నిర్మించుకొనునప్పుడు నదికి దూరముగానుండ నిశ్చయించుకొని వెనుకకువచ్చి నిర్మించుకొనిరి. దానినే రామచంద్రపురమందురు. నేటికిని దానిని కోట రామచంద్రపురమనుట ప్రసిద్ధి. ఈ క్షత్రియ ప్రభువులు విడిచివచ్చిన పిమ్మట కొందరు ధనికులు కొంతదూరము వెనుకకువెళ్లి క్రొత్తగా గ్రామమును నిర్మించుకొనినారు. దానినే నేడు క్రొత్తకోట యనుచున్నారు. నదీగర్భములో జాలవరకు గలిసిపోయినను, నేటికిని పెద్దపెద్ద భవనములతోడను, దేవాలయముతోడను, ఉత్తమ ద్విజాదినర్మ్యముల తోను ప్రాతకోటగ్రామము నిలిచియే యున్నది. ఆ దేవాలయపు భూములు నదీగర్భ ములో తేలియున్నవని, ప్రసిద్ధమైన మహా గ్రామమని పలువురు పెద్దలు చెప్పుచుందురు. ఆ ప్రభువుల చెంత మంత్రియైన ఉద్దండ లింగయమంత్రి చరిత్ర రచనకు ప్రోత్సహించి యుండవచ్చును. కోటగ్రామమునుబట్టియే కోటిఫలికి ప్రసిద్ధి హెచ్చినదని నేటికిని తెల్పువారు గలరు.

ద్వితీయాశ్వాసములో చిత్రరథ సంభాషణమున "మునీంద్రా! స్వర్గ మర్త్యపాతాళ లోకంబులలో......నీయంత విజ్ఞానవంతుని కని విని యెరుంగగావున నీకు శిష్యుండనై యుండెదననిన యా గంధర్వుని బరిగ్రహించి గోదావరి తీరంబునకుం జని అచ్చట దన పేరట యాజ్ఞవల్క్య పురంబను నొక్క నగరంబు నిర్మించి యందును ప్రవేశించి ఆశ్వ లాయన మునికన్యను వివాహంబై యని యున్నందున యాజ్ఞవల్క్యనిపురవము గోదావరీ తీరస్థము గదా?

తృతీయాశ్వాసములో గర్గియాజ్ఞవల్క్యని చెంతకు వచ్చుట—

"ఆలోల కల్లోలజాల......కూల సంస్థిత మునివేద ఘోషణంబు
గౌతమీ నామధేయ ప్రకాశితంబు గంగ కనుపట్టె నధికమోక్షప్రదంబు"

''కాంచెను యాజ్ఞవల్క్యముని కాంచెను గోపురహర్మ్యసౌధమున్......
సప్తగోదావర సలిలముల్ గొనివచ్చు విమల పుణ్యాంగనల్ వేలసంఖ్య
యజ్ఞ తంత్రముల త్రేతాగ్నిహోత్రంబుల కుండము లిండ్లిండ్ల కోట్లసం
వేదశాస్త్ర పురాణ వివిధార్ధ...ధరణి నిర్జరులద్బుదముల సంఖ్య
పరమ విజ్ఞానాను బంధమానసులైన తాపసోత్తములు పద్మముల సంఖ్య
గలిగియుండుదురైశ్వర్య కలితులగుచు నామహామహా పట్టణాభ్యంతరము

''తరుబృందంబుల శీతలచ్ఛాయా మహిత తలంబుల వినోదింపుచు, గోదా
సలిల తరంగ శీకరంబుల మార్గశ్రాంతి వారింపుచు''—మున్నగు తావులందు ప్రయోగిం
''గౌతమీగంగ, సప్తగోదావర, గోదావరి పదముల సన్నిహితత్వమునుబట్టి గోదావరి మం
ములోనున్న దానినే గ్రహించుట భావ్యము. ప్రాతకోటలో శివాలయము ప్రసిద్ధమైన
నేటికిని నిలచియున్నది. క్షత్రియ ప్రభువు లుండెడివారు. వారిచెంత నమాత్యులుం
తప్పదుగదా? యాజ్ఞవల్క్యచరిత్రమునుబట్టి ఆరుద్రగారు నిర్ణయించిన నందికొట్కూ
తాలూకాలోని పాతకోట గ్రామమునే సమ్మతించినను పై సప్తగోదావరాది వర్ణన
సముచితముగా నుండకపోవచ్చును. కవి యా పరిసర మనుభూతము కానిచో ని
విశదముగా వర్ణింపజాలడు. ఈ కోట, కోటిఫలి క్షేత్రములేగాక గౌతమీతీరమున
కిరువైపుల నెన్నియో పండితులుండు గ్రామములుండెడివనుటకు శ్రీనాథుని గ్రంథమ
సాక్షి భూతములు. నేటికిని బ్రహ్మపురి, మసకపల్లి (మస్కరపల్లి) వింజరము వం
గ్రామము లుత్తమ బ్రాహ్మణులకు వేదపండితులకు నిలయములైన వెన్నియో నదీగర్భ
లో లీనమైనవిగాక, పేర్ప్రతిష్టలతో విరాజిల్లుచున్నవి. కపిలేశ్వరపురము, దంగే
శివల మున్నగునవి వేదశాస్త్రములను వృద్ధిలోనికి దెచ్చుచున్నవి.

పెద్దాపురపు సంస్థాన ప్రభువుల పరిపాలనలో నుండిన యీ ప్రాంతపు టౌ
త్యము చరిత్ర ప్రసిద్ధము. క్రమక్రమముగా నీ భాగము పీఠికాపురాధీశులకుగు
సంక్రమించినది. వేదశాస్త్రములను సంరక్షించెడు ప్రముఖ పండితులు పలువురు గో
వరీ తీరమున గౌతమియొడ్డున వెలసియున్న సంగతి శ్రీనాథాది మహాకవులకృతుల
నెన్నియోతావుల జూడగలము. భీమేశ్వరపురాణము ప్రథమాశ్వాసములో ''ధరింయ
నేర్చిరి......గౌతమీతటము నందు'' అను పద్యముననేగాక కాశీఖండము మున్నగు గ్ర
ములలో గోదావరీ తీరపు మహత్త్వము ప్రకటితమైయున్నది.

నందికొట్కూరు తాలూకాకు చెందిన ప్రాతకోటయను నామమొక్కటి యున్న
కవి యా ప్రాంతమువాడనుట యంత సముచితముగా తోపదు.

సప్తనదీ సంగమేశ్వరమందిర ప్రాకారగోపుర ద్వారంబు సుగుణముల రాశియ
కాశిలో వసింపదలంచిన వ్యాసమహర్షికి శిష్యసమేతున కన్నము కరవైన క్లిష్టస్థితి
నతడు కొన్నినాళ్లు పవసించియు, తుదకు క్షుద్బాధకు దాళజాలక కాశిని శపింపబూ
తరుణమున విశ్వేశ్వరు నర్ధాంగి యన్నపూర్ణాదేవి షడ్రసోపేతమైన మృష్టాన్నమొస
యతిథి సత్కారమొనర్చినది: కాని విశ్వేశ్వరుని యనుగ్రహమునకు బాత్రుడుకాలేక పో
చేత నాతనికి కాశినుండి నిష్క్రమణము తప్ప గత్యంతరము లేదు. ఆ మహర్షి దక్షిణ
యను పేర ప్రసిద్ధివడసిన దక్షారామము (దాక్షారామము) చేరుకొనును. ఆ విషయ
స్కాందపురాణములోని భీమఖండములో నున్నది. ఆ భాగమును శ్రీనాథ మహ

తెనిగించి భీమేశ్వర పురాణమను పేరుంచెను. అందులో ''సంగమేశ్వర దివ్య శంభు లింగము'' అని వర్ణించియున్నాడు. తూర్పుగోదావరి జిల్లా రామచంద్రపురము తాలూకా లోని తాపేశ్వరము, ఏడిది, మండపేట, అను గ్రామములకు నడుమనుండిన సంగమేశ్వ రుడు ప్రసిద్ధుడు. తుల్యభాగా నదీతీరము నంటియున్న శంభులింగములో నిది ప్రాధాన్య ము వహించిన యీశ్వర లింగము. గౌతమీ నదియు తుల్యభాగానదియు సంగమించిన చోట నెలకొనినవాడు గాన సంగమేశ్వరుడయినాడు. తుల్యభాగా నదీశాఖ ధవళేశ్వరము దగ్గర గౌతమీనదిలో నుండి విడివడి వేమగిరి, కడియము, జేగురుపాడు, తాపేశ్వరము, అత్తమూరు, పొలమూరు, మహేంద్రవాడ, వెదురుపాక, వందలపాక, మామిడాడ, సంపర మీదుగా ముక్తీశ్వరము వరకు వచ్చి, అచ్చటనుండి మరలి చొల్లంగి దగ్గర సముద్రగామి యగుచున్నది. సప్తశాఖలు వేర్వేరు తావులలో సాగరమున సంగమించుచున్నది గోదావరి మండలములో గదా? సప్త సాగరయాత్ర యిప్పటికిని భక్తులనేకులు చేయుచునేయున్నారు. ముఖ్యముగా సంతానమునపేక్షించు యువతులీ తీర్థయాత్ర చేయుచో తన్మహిమ వలన వంధ్యాత్వదోషమునుండి విముక్తలై తప్పక సంతానమును బడయుట ప్రసిద్ధాంశము. రజోదోష నివృత్తికై ముత్తైదువలు యాత్రలొనర్చుట కలదు. ఆ శాఖలలో మొదటిది తుల్యభాగానది. ''షడ్బిస్తుల్యా తుల్యభాగా.''తుల్యాత్రేయీభరద్వాజీ గౌతమీ వృద్ధ గౌతమీ, కౌశికీచ వసిష్ఠాచ సప్తశాఖా: ప్రకీర్తితా:''. ఈ సప్తశాఖలు సాగరమున సంగ మించుచున్నవి. కపిలేశ్వరపురము దగ్గర కణ్వనదీశాఖ ప్రారంభమై దంగేరు గ్రామము నొద్ద గౌతమిలో కలియును. తత్సంగమ స్థలమున మరియొక ఆత్రేయశాఖ ప్రారంభమై మసకపల్లి, కోలంక, దుగ్గుదుఱ్ఱు, కాజులూరు మున్నగు గ్రామముల జుట్టికోరంగి దగ్గర సముద్రగామి యగుచున్నది. అచ్చట కురంగేశ్వరుడున్నాడు. సప్తముని సింధు సంగ మేశ్వరుడు—సప్తమునులు గొనితెచ్చిన గౌతమీ తుల్యభాగల సంగమక్షేత్ర వాసియైన ఈశ్వరుడు. తుల్యభాగానదీ తీరమునంటి ఏడిద సమీపమునగల సంగమేశ్వరుడు.

గౌతమి, భరద్వాజ, రేవ, ఇంద్ర, అహల్య యను నైదు తీర్థములు సంగమించిన ప్రదేశమును తీర్థాల మొండి యందురు. దీనికే 'సంవేద్యమని' వ్యవహారము. వృద్ధ గౌతమి ముక్తీశ్వరము నుండి తొత్తరమూడి, శానపిల్లంక, తాణేలంక, కొత్తలంక, కుండలేశ్వరము మీదుగా సముద్రగామి యగుచున్నది. ఈ ప్రాంతమే బ్రహ్మ సంవేద్యము. బ్రహ్మేశ్వరుడు, వృద్ధేశ్వరుడు, సంతానగోపాలస్వామి యచట నారాధ్య దేవతలు. ఇచ్చట సంతాన గోపాలుని యనుగ్రహ పాత్రులైన యువతులకు సత్సంతానము కల్గుట తధ్యము.

కౌశికి బెండమూరు లంక దగ్గర సముద్రములో గలియుచున్నది. విష్ణు సంవేద్యమని యందురు.

వసిష్ఠ-అంతర్వేది చెంత సముద్రములో సంగమించుచున్నది. ఈరీతిగా గోదా వరీ తీరములో పుణ్యక్షేత్రములు ప్రసిద్ధములై వెలసినవి.

''త్ర్యంబకాచల శిఖాగ్రంబునందుదయించి పాదిలి యార్యావర్త భూమి దడిసి ............కోటిపల్లీశు కోమలాంఘ్రులకు మ్రొక్కి కుండలాముఖ తీర్థంబు గుస్తరించి భీమ మండలి దాపల బెట్టుకొనుచు గౌతమీగంగ లవణాబ్ధి గౌగిలించె'' అని శ్రీనాథుని వర్ణనము. భీ. ఖం. 3–21

గౌతమీ శాఖలు—కౌంతేయు కణ్వనది తుల్యభాగ యేలేరులని ప్రసిద్ధము కౌంతేయ వాహిని — కౌశికీనది. కాణ్వ శాఖియులీనదీ తీరస్థులు.

"ఆంధ్ర భూ భువన మధ్యము పుండరీకంబు
సప్త గోదావరీ జలముతేనె
బ్రహ్మ సంవేద్యాది బహు తీర్థములు రేకు
లకరులు చారు దివ్యస్థలములు—"

అని శ్రీనాథుడు పలు తావులలో వివరించియున్న గోదావరీ తీరము పురా ప్రసిద్ధము.

"ఒకచోటఁ గోటిపల్ల్యుడు రాజ కోటేర విభాజితోత్సంగ వృద్ధ గం ఒకచోట నప్సరో నికర సంసేవితాంతరము శ్రీ సప్త గోదావరంబు .......

"కుండలాముఖ సంవేద్య శార్ఙాల తీర్థంబులు మొదలుగా గల" అని శాఖో శాఖా తీర్థంబులు గల భూభాగమున మాతృకాయమాన గోదావరీ తీర పుణ్యాశ్ర హార పరంపరా భూనిలింప సంసత్సంపాది తాధ్వర క్రియా సమాహూత పురుహూ తాది దేవతా కదంబ సంచరితంబు" అని తెల్పియున్నాడు.

"వేద పాఠ నిరస్త కిల్బిషులు నీతి విదులునై యొప్పు నిచ్చటి విప్రవరులు
ప్రతి వసంతంబునను కృత క్రతువు లగుచు రమణ నుందురు విష్ణు పరాయ
ణులయి"

విశ్వ గుణాదర్శను.

ర

శివుని

దిలల

రులు"

వేంకటాధ్వరి కొనియాడినాడు.

నాడును నేడును గూడ పలువురు భూ పుచు, ఇంద్రాది దేవతా కదంబంబు నాహ్వ ప్రాంతముల కంటెను విశేషముగ శ్రౌత ముల నభ్యసించుటలోను శ్రౌత కర్మముల ుక ప్రత్యేకత వహించి యున్నది.

తీరముననున్న సప్త నదీ సంగమేశ్వర గా యాజ్ఞవల్క్య చరిత్రములో పేర్కొని కొనినాడనవచ్చును.

చినందున కృష్ణ ప్రార్థనము చేయుట నెంచినందున షష్ఠ్యంతములలో గూడ

్రనము చేసిన ఘట్టు ప్రభువు గోదావరీ మండలము వాడను నూహను
కుచేలోపాఖ్యానములో –

ాంగనాచిత్త చిత్రాంబర......
ోపాల కృష్ణ రమాధవుండు,
గముల నెల్ల రక్షించుగాక''

గోపాలునకున్'' అని కృష్ణుని మదన గోపాల నామముతో బేర్కొని
దన గోపాలుని మందిరము లెచ్చట నున్నవి? కృష్ణ మందిరములు
గోపాల నంటి పదములతో వ్యవహృతములు పలురకము లున్నవి.
వి రాజమహేంద్రవరములో నుండినట్లు వర్ణించిన మదన గోపాల
గోదావరీ మండలములోనే యెక్కువగా కన్పించుచున్నవి. విద్య
అని ప్రసిద్ధి వహించిన వింజరము నందును తత్పరిసర గ్రామములగు
కుడుపూరు మొదలగు తావులందును ప్రాచీనములైన మదనగోపాల,
నేటికిని వెలయు చున్నవి. మదనగోపాలుని కృతిపతిగా జేయుట
ోదావరీ తీర వాసి యనవలయును.

స్వరములోని కథలో వర్ణితయైన స్త్రీ పాత్ర ఈడిగ కులమునకు
ఈంద్ర, ఈడిగ,'' యను పదములు కల్లు గీయు జాతివారికి
ి ప్రదేశము లందున్న వీరిని పలు నామములతో బిలుచుచున్నారు.
లములో కల్లు గీయు జాతి వారినానామములతోనే పిలుచు ఆచారము
చియున్నది. ఈంద్రపాలెము, ఈంద్రపేట, ఈడిగపేట, ఈడిగ
ు లిప్పుడును ఆ కులము వారి నివాసములై యున్నవి. కొన్ని గ్రామ
ొక్క జాతివారొక్కొక్క ప్రాంతమునందు నివసించుట కేర్పాటు
బ్రాహ్మణులగ్రహారములలో నుందురు. రాచవీధిలో క్షత్రియులు,
వైశ్యులు, వృత్తులను బట్టి శూద్రులలో పలువురు వారి వారి సందు
ుట ప్రాచీన పద్ధతి. కల్లు గీయువారు గ్రామమున కాదియందు
గాని యుందురు. అక్కడ నున్నచో సురాపానమునకు వచ్చు ప్రజలకు
లకు పని యుండదు. ఈంద్రపేట లీనాటికి నట్లే యుండుట
కల్లు గీయుటలో నిపుణులు వారే. గోదావరీ మండలములోనే
లను పేర చలామణియైన పూర్వకాలపు బంగారు కాసుల చరిత్ర
నున్నది. ఘట్టు ప్రభువు వ్రాసిన పుస్తకములకు తాళపత్ర ప్రతులు
లములో విరివిగా లభించెడివట. మా తండ్రిగారి మాతా మహులు
వ్రాసికొని భద్రపరచిన కుచేలోపాఖ్యానము తాళపత్ర గ్రంథము
ి సంవత్సరములకంటే పూర్వపు ప్రతి మాయింట నేటికిని చక్కని
్నది. అంత అభిలాషతో తాళపత్ర గ్రంథమును వ్రాసికొని నిత్య
చేసికొను సంతతి మహత్త్వము గల కుచేలోపాఖ్యానము రచించిన
ాచీనుడు కాప ఫలానా గ్రామమునకు జెందినవాడని నిర్ణయించుట
అయినను గోదావరీ తీరస్థుడని నిర్ణయించునుపపత్తులు
కు వీలు కానరానివి.

నెల్లూరు మండల చరిత్రలో బేర్కొనబడిన ఘట్టు ప్రభువు వీరేశలింగముగారు పేర్కొనిన ఘట్టుప్రభువు నొక్కడై అప్పటికెనుబది యేండ్ల క్రిందట నుండినటు లనవలయును. కావలివారు, బులుసువారి ప్రకారము ఘంటయ లేక [illegible] శేషకవి రెండువందల ఏబది సంవత్సరములకు పూర్వుడునై యుండవలయును. ఆరుద్రగారు తెలిపి నటుల సత్యభామా విజయ కర్త ఘట్టు ప్రభువే యను నిర్ణయము కావలయును. ఏది ఎట్లున్నను యాజ్ఞవల్క్య చరిత్రము, సురాభాండేశ్వరము, కుచేలోపాఖ్యానము ఘట్టుప్రభువు రచనగా గణింపబడి క్రీ. శ. 1873లో ప్రకటితమైన 'బాల వివేక చింతామణి' యను నీతి గ్రంథము రచించిన కవి 'నూనూగు మీసాల' వంటి పద్యమునుగాని 'భ్రమరాంబికా వర ప్రభవ దివ్య కవిత్వ' పద్యములో నాయా గ్రంథ ములు రచించినాడనని గ్రంథనామములుగాని పేర్కొనకపోవుట యింత తికమకలకు తావొసంగినది. కవి యావద్భారతమునకు చెందియున్నను ఆంధ్ర ప్రాంతము నకును అందు గోదావరీ తీరమునకును గౌరవమును సమకూర్చువాడుగా గణింప దగినవాడను వారికి, మండల భేదముతో పరీక్షించువారికి నిది యొక పెద్ద చిక్కు సమస్యగా పరిణమించినది.

# కుచేలోపాఖ్యానము—సంస్కృతాంధ్ర భాగవతములు

ఆర్ష విజ్ఞానమునకు ధర్మ ప్రతిష్ఠాపనకు భారతీయ సాహిత్యమునకు మూల పురుషుడైన వ్యాస మహర్షి రచించిన యష్టాదశ పురాణములలో విశిష్ట స్థానము నాక్రమించునది భాగవతము. అందు భగవంతుని లీలలను మహిమలను విపులముగా దెలుపునది దశమ స్కంధము. ఇందుత్తర భాగములో రెండధ్యాయములందు ఎనుబది యారు శ్లోకములలో కుచేలుని చరిత్ర గలదు. దానిని పోతన కవి తన యాంధ్రీకృత భాగవతమున డెబ్బది గద్య పద్యములందు జెప్పినాడు. ఘట్టు ప్రభు వీ యితి వృత్తమును గ్రహించి ప్రబంధముగా మూడాశ్వాసములందు మూడు వందల యరువదిమూడు గద్య పద్యములలో రచించినాడు.

వ్యాస భగవానుని సంస్కృత గ్రంథము కంటె పోతన మహాకవి యాంధ్రీకరణమునే యెక్కువగా ఘట్టుప్రభు వనుసరించెను. పోతన చూచిన మూలమున నట్లున్నదో, తానే స్వతంత్రించి తెల్పినాడో తెలియని యంశములను ఘట్టు ప్రభువు స్వీకరించుటయేగాక పై మెట్టునకు గూడ వెళ్లుట గమనింపదగును.

''కృష్ణస్యా సీత్సఖా కశ్చిద్బ్రాహ్మణో బ్రహ్మ విత్తమః।
విరక్త ఇంద్రియార్థేషు ప్రశాంతాత్మా జితేంద్రియః॥
యదృచ్ఛ మోపపన్నేన వర్తమానో గృహాశ్రమీ''

అని మూలమున బ్రహ్మ విత్తముడగు బ్రాహ్మణుడని పేరు లేకయే యుండగా పోతన జనవర! గోవింద సఖుడు కుచేలుండు నానొప్ప విప్రుండు మానధను డని ఆ బ్రాహ్మణునకు కుచేల నామమును బెట్టెను.

''తస్యభార్యా కుచేలస్య క్షుత్ క్షామాచ తథావిధా'' యను పాదమును జూచి యా పేరు వాడియుండునుగాని వ్యాసమహర్షి పేరెచ్చటను దెల్పలేదు. కట్టు గుడ్డ లేని పేద పాఱుడని తెల్పుటకు వాడిన కుచేల పదమును నామముగా పోతన భావించెననుకొనవలయును. మఱొక పర్యాయము ''కుచేలం మలినం క్షామం ద్విజంధమని సంతతం, దేవీపర్య చరద్భీష్మీ చామర వ్యజనేనవై'' యనుచోట వాడియుండెను. సర్వత్ర విప్రః, ద్విజః ద్విజాగ్ర్యః, బ్రాహ్మణః వంటి పదములను దప్ప పేరెచ్చటను దెల్పియుండనేలేదు.

భాగవతమునకు వ్యాఖ్య రచించినవారో, పరిష్కరించినవారో ఎవరైననేమి ''ఇతి శ్రీమద్భాగవతే మహా పురాణే దశమ స్కంధే ఉత్తరార్ధే శ్రీదామ చరితేఽశీతి తమోధ్యాయః'' అని దెల్పియున్నారు. శ్రీదామ చరితమని తెల్పుటకు

''అథాశీతితమేకృష్ణః శ్రీ దామానం గృహాగతమ్,
సంపూజ్యా పృచ్ఛ దర్థేప్సుం గురువాస కథాం ముదా।
ఏకాశీతి తమే సఖ్యు ర్జగ్ధ్వా పృథుక తండులాన్
శ్రియం నిర్మితవానింద్ర దుర్లభాంతు తదాశ్రమే''

అను వ్యాఖ్యానశ్లోకములలో శ్రీదామ నామమున్నది. ఆతడే కృష్ణ సఖుడు. సుదాముడనికూడ వాడు చున్నారు. అట్టి శ్రీదామ సుదామ నామములను తల్లిదండ్రులు పెట్టియున్నను చినుగు బట్టలనే ధరించుటచేత నీ పేరు వ్యవహారములోనికి వచ్చినదని భావించి పోతన వాడి యుండవలయును.

ఈ ఘట్టమున దాదాపు యిరువది రెండు తావులందా విప్రునిగూర్చి తెలుపవలసి వచ్చినపుడు ద్విజః, విప్రః, బ్రాహ్మణః, ద్విజన్మ, ద్విజాతి మున్నగు విప్రశబ్ద పర్యాయములే ప్రయుక్తములైనవి; కాని కుచేలుడను పేరుగా కానరాదు. 'తస్య భార్యా కుచేలస్య-కుచేలం మలినం క్షామం', అను రెండు తావులయందు మాత్రమే వ్యాసుడు కుచేల శబ్దమును వాడియుండెను. ఉత్తర హిందూ దేశమువారు 'సుదామాజీ' యని వాడి యున్నారు. ఆంధ్ర దేశములో పోతనామాత్యుని మూలముననే కుచేల శబ్దము ప్రచారములోనికి వచ్చిన దనక తప్పదు. అగస్త్యభ్రాతకు నిగమశర్మ అక్కకు తల్లి దండ్రులే పేరు పెట్టిరో తెలియదు. బ్రాహ్మణ ప్రవరుడు మాత్రము పెద్దన గారి కృపా పాత్రుడై ప్రవరుడుగా ప్రసిద్ధి కెక్కినాడు. శ్రీదాముడు కుచేల శబ్దము చేతనే ప్రసిద్ధుడగుట పోతన ప్రభావ మనవచ్చును.

ఘట్టు ప్రభువు— "అందు గుచేలుండను ముని నందనుడొక్కరుడు దినదినుహరి సేవానందంబున సకలేంద్రియ బృందముల బరిత్యజించి పేర్మి వహించున్" అని తెల్పుటయేగాక "శత సహస్ర పరిచ్ఛేద సంఘటిత పురాణ జీర్ణోత్తరీయంబు రమణ దాల్చి మౌనులు కుచేలుడీ మహామహు డనంగ బేరుగొన్నాడు దిక్కులు పిక్కటిల్ల" అని వస్త్రధారణ మూలముగా వచ్చిన వ్యవహార నామముగా దేల్చి వాడు. అందువలననే ముందు ముందు "సన్నంపు నారలాచ్ఛాదించుటయెకాని తొడుగ గోకలు లేవు బుడుతలకును" అని తెల్పెను. "వర మృష్టాన్న సువస్త్ర పీడితులమై వర్తింపగానేల" అని వస్త్రములకు వాచనివారుగా బిడ్డలు కాన్పింతురు. 'నిర్వరి యడుకుల్ దొరికిన యట్లు వధూమణి వరుని కుచేలమున ముడిచి" యని వస్త్ర దైన్యతను తెల్పెను. "ఎలమి నూకలు గట్ట నెడ మించుకయులేక చినిగిన కడు ప్రాత చేలతోడ" నని కుచేల శబ్దమునకే ప్రతిరూప మిచ్చినాడు. "వస్త్ర ముఖ్యంత్వలంకారమనెడు నీతి- వాక్యమరయ మంచి కోకలైన లేవు," "వస్త్ర హీనుడవు" వస్త్ర హైన్యమే హీనత గలుగవలె నమ్మ్రభములగు వలువలు, చీకొట్టుదురందరును గుచేలుండైనన్, తిరుపంబెత్తిన వస్త్రహీనుడయినన్, తాపసులకు నేల ధవళ వస్త్రం బులు సువర్ణ రజతంబులైన మంచి దుకూల వస్త్రంబులు గట్టనిచ్చి, కుడువఁ గూడుఁ గట్టఁ గోకయు లేకను జేరినట్టి దీనజనులు ఘనుల దిరియుంగఁ బోయినఁ గోకయైన నొక్క రూకయైన బలువుగా జినిగిన ప్రాత కుచేలంబు కాంచనాంబరమై ప్రకాశమొందె, దుకూలాంబరమున దడి యొత్తిపట్టు వస్త్రములు గట్టనిచ్చి," మున్నగుచోటుల వస్త్రములను జూచియే ప్రభువు లాదరింతురను నభిప్రాయమును సూచించెను. 'వాసః ప్రధానంఖలు యోగ్యతాయాః' అను సూక్తికి ప్రాధాన్యము నిచ్చియుండెను. వస్త్రమును బట్టివచ్చిన నామమును పోతన వ్యవహారములోనికి దెచ్చి నాల్గైదు తావులందు మాత్రమే వాడగా ఘట్టు ప్రభువు పదికి మించిన తావులందు ఉపయోగించి వస్త్రములపై మోజును చూపియున్నాడు.

వ్యాసమహర్షి కుచేలుని సంతానము గూర్చి యెచ్చటను పేర్కొనలేదు. భార్య పేరైన నెత్తలేదు. ''దాస్యతి ద్రవిణం భూరి సీదతే తే కుటుంబినే'' అని పతివ్రతామ తల్లి పలికిన మాటలలో సంతానము గలవాడనుకొనుటకు వీలు కన్పించు చున్నది. 'కుటుంబం, పుత్ర భృత్యాధికం అస్య' అను విగ్రహ వాక్యము చెప్పి సంతతి కలవాడనుకొనినను, ఇంకెక్కడను బిడ్డల సంగతి తలపెట్టక పోవుట గమనింపగలము. శ్రీకృష్ణునితో సంభాషణ సమయమునగాని ద్వారకనుండి యింటికి దిరిగివచ్చినపుడుగాని సంతానము గూర్చి పేర్కొనక పోవుటచేత గుచేలుడు భార్యా ద్వితీయుడేగాని సంతానము కలవాడుగా కన్పట్టడు. భార్య కూడ బిడ్డల గురించి యేమియు విచారింపరేల యని యడుగదు. దరిద్ర బాధకు లోబడిన యామె క్షుత్ క్షామయై కట్ట గుడ్డలు మంచివి లేక భర్తను ప్రేరేపించినట్లు తోచును. ఇంత మాత్రముననే కృష్ణ దర్శనమునకేగుమనిన భార్య వాక్యముల కుచిత స్థానము లేదను శంక గలిగినందుననో మరి యే హేతువుననో పోతన బిడ్డల సంగతి యెత్తవలసి వచ్చినది. ''బ్రహ్మవేత్త దారిద్ర్యంబు బాధింప నొరులఁ గార్పణ్య వృత్తి నడుగఁ బోవక.................పుత్ర దారాభిరక్ష యొక విధంబున నడుపుచు'' అని వ్యాస తనయునిచేత బల్కించినాడు. ''తద్భార్య దుస్సహ దరిద్ర పీడచే గడు నొచ్చి పెదవులు దడుపుచు శిశువు లాఁకటి చిచ్చుచేఁ గృశించి మల మల మాడుచు మానసం బెరియుంగఁబట్టె డోరెము మాకుఁ బెట్టు మనుచు పత్ర భాజన ధృత పాణులై తను జేరి వేడిన వీనులు సూడినట్లు యైన యొక నాడు వగచి నిజాధి నాథుఁజేరి యిట్లని పలికెను. ఓ జీవితేశ! తట్టు ముట్టాడు నిట్టి పేదరిక మిట్లు నొంప దీని కుపాయ మూహింపవైతివి.'' ''దారిద్ర్యాంధకార మగ్నులైన మము నుద్ధరింపుము హరి కృపా కటాక్ష రవిదీప్తి వడసి మహాత్మ'' యనినది. సంతాన మున్నట్లును దరిద్ర బాధకు తాళలేక ద్రవ్యాపేక్షతో భర్తను ప్రేరేపించినట్లును దెల్పుట బాగు.

కృష్ణుని సంభాషణములో ''భార్య సుశీల వర్తనముల భవత్సదృశ యగునె, తలఁప గృహక్షేత్ర ధన దార పుత్రాదులందు నీ చిత్తంబు సెందకుంట తోఁచు చున్నది'' అని అనిపించినాడుగాని బిడ్డల యోగక్షేమముల సంగతి యెత్తలేదు. ''ఇతడు పూర్వ భవంబున నైశ్వర్య కాముండై నన్ను సేవింపడు. ఐన నిక్కుచేలుండు నిజ కాంతా ముఖోల్లాసంబు కొరకు నా యొద్దకుఁజనుదెంచిన వాడు'' అని కృష్ణుడు తలంచునపుడైనను సంతానము విషయమై తలపోయలేదు.

కుచేలుడు ద్వారకనుండి యింటికి దిరిగి వచ్చునపుడైనను బిడ్డలెదురు వచ్చినట్లుగాని తమకు గల్గిన యైశ్వర్యమునకు సంతసమును ప్రకటించినట్లు గాని తెలుపలేదు. సరిగదా ''ఆ నారీరత్నంబును దానునుననురాగ రసము దళుకొత్తగ నిత్యానందము నొందుచుఁ బెంపూనిన హరి లబ్ధ వైభవోన్నతి మెరయన్'' అని భార్యా భర్తలనే పేర్కొనుటచేత సంతతి విషయములో గొంత సందేహ మున్నట్లుగానే తోపించు రీతిలో రచన సాగినది.

''గోవింద చరణారవిందంబుల యందులభక్తి ప్రతిభవంబును ............... పత్నీ సమేతుండై ...............విగత బంధనుండై యపవర్గ'' ప్రాప్తి నొందె 'నని తెల్పినందున పత్నీ ద్వితీయుడేగాని సంతతియుతుడుగా దీపకు. సంతాన మధిక

మైన చింత యధిక మగునని, సుతులు తక్కువైన సుఖ మెక్కువ యని
చేయు స్థితి ప్రాచీన యుగములలో గూడ నున్నట్లు తోపజేయు కుచే
గాథ నెక్కువ ప్రచారములోనికి దెచ్చినవాడు ఘట్టు ప్రభువే యనవలసి

''ఆ పతివ్రత పెనిమిటి ననుసరించి సులభముగ నిర్వరేడ్గుర సుతుల
నని సంఖ్య కూడ దెల్పినవాడు ఘట్టు ప్రభువు. ఇట్లు దెల్పుటకు
గ్రంథములోనో యుండి యుండును. 'నీ పేరెవరన నెడమ కన్ను చూపి
నీ భర్త పేరెవరన చినిగిన పాత చీర చూపె ననియు, నీ బిడ్డ లెందరన
వైపు చూపెననియు' మున్నగు పద్యము ప్రచారములోనికి వచ్చినది.
పద్యము. విచిత్ర కుచేలమను నాటకము వ్రాసిన కవి యితని న
వ్రాయుచు ఇంకొక ఆడుబిడ్డకూడ నుండిన బాగుండునని సోదెచెప్ప
మనినట్లు వ్రాయుట వింతకాదు. సంతానమధికము. సంపాదన చేయువా
వేళకు తిండికై పోరు పెట్టుటయేగాక ఆయా వస్తువులకై మారావ
చుందురు. అట్టిచోతల్లి సహింపలేక బాధ భరించలేక భర్తను ప్రేరేపించిన ద
దోచును. భర్త యెట్లును విషయ వాంఛ గలవాడు గాడు. ఉదాసీను
కూడ కోరికలను మనస్సులోనికి రానీయదు. బిడ్డల పోరున్నవాడు
గలదైనను బిడ్డల స్థితిగతులకు వగవకుండగలదా? దరిద్రమును
దానికి తలయొగ్గి యుండుటకన్న నేదైన మార్గమును వెదకి దానిను
నంద దలంపు కలుగుటచేతనే శ్రీకృష్ణ దర్శనమునకు ప్రేరేపిం
బాగుండునని దోచియుండును. నిర్ధనుడును మృతుడును సమానుల
కొనరాదు. దారిద్ర్యము యావజ్జీవ తీవ్ర వేదనాకరము గదా? దా
దోడు సంతాన మధిక మగుటచేతనే దైవ పౌరుషవాదముల ప్రసక్తికి దగిన
లభించినది. ప్రథమాశ్వాసమున ప్రాధాన్యము వహించు నీ సంభాషణ
ప్రభువును 'సకల కవి మిత్ర, సరసకవి మిత్ర', బిరుదముల కర్త నా

అడుకులను గురించిన విషయము పృథుకోపాఖ్యాన భాగములో
బడును.

కృష్ణ దర్శనమునకు వెళ్లునపుడు ఎట్టి యాటంకమైన నుండున
నట్లు లేదు. కనుకనే 'కృష్ణ సందర్శనం మహ్యం కథం స్యాదితి చింత
యొక్క మాట పలికిన వ్యాసుడు కృష్ణ మందిరమునకు ఏకాఏకిగా క
నాడు. పోతన కాలమునకు రాజదర్శనముకు వెళ్లుచోనెన్ని
లున్నవో యవన్నియు నిరూపించు సంకల్పము కలిగినందున విపులము
నాడు. కాలానుగుణమగు కవిత చరిత్రకు దోహదకారి యగును.

అట్టి కవినే యాదరించు స్వభావము ప్రజల కుండును. అ
పోతన వాక్యములు గుర్తింపదగినవి. 'ద్వారకా నగరంబు............
తద్వారపాలు రెక్కడి విప్రుడ విందేల వచ్చెదవని యడ్డపెట్టిరే నపుడు
బరిదానమిచ్చి చొచ్చెద నన్న నూహింప నర్థశూన్యుండ నేను'.
యాటంకమును దానికి విరుగుడు కూడ ఎంతయో సున్నితముగ వివర
వఙ్ఞడగుకవి. అంతమాత్రముతో నూరకుండక ఘట్టు ప్రభ

ంత ముందుకు నడచినాడు. కృష్ణమందిరమునకు ముందు వాకిటి కావలి
కులుండగా వారి నాశీర్వదించినాడు. పిమ్మట రుక్మిణీ విభుని పురమునకు
ష్ఫగా ఆ రాజమందిర సీమయందు ద్వార దేశపాలురగపడుదురు. వారినిగూడ
శీర్వదించి ప్రస్తుతించి "మీ యపార కరుణా విశేష మాధారముగను శౌరి గనియెద
పదల్చాలఁ గడచి—నే వచ్చిన ఈ రాకలు దేవకీ నందనున కిపుడె దెలుపగ వలయున్
ంవంటి ఘనుల వలనను శ్రీవల్లభు సమ్ముఖంబు జేరగ ంవచ్చునని" బిళ్ల బంట్రోతుల
ంనత వెల్లడించినాడు. అంతతో తృప్తి పడక తత్సార్శ్వంబులనున్న
ఃనుల పరిహాసమునుగూడ వర్ణించుట విశేషము. ద్వితీయాశ్వాసమునకు
కొత్తందనమును సమకూర్చు ఘట్టములో నిదియొకటి. ఈ ఘట్టమే లేనిచో
ాజనిందకు దగిన తావు కవికి లభ్యపడి యుండదు. ఆపామర జనముల వచన
ములకు ద్వారపాలురొసంగు ప్రత్యుత్తరములు భగవత్సన్నిధి నున్నవారికి దగిన
భావోపేతము లని తోచును. కృష్ణునకు ముందుగా మనవి చేసి, యాతని యను
మతిని త్వరగా వచ్చి యా కుచేలుని లోనికి పంపుటలో ననుజ్ఞను బడసికాని
లోనికి పంపకుండు సాంప్రదాయము స్పష్టముగా ప్రకటితమైనది.

# శ్రీకృష్ణ కుచేల విద్యాభ్యాసము

వేదవ్యాస మహర్షి భాగవత పురాణములో శ్రీకృష్ణ విద్యాభ్యాసము గూర్చి వర్ణించినాడు. దశమ స్కంధము పూర్వభాగములో కంస వధానంతరమున నలుబది యైదవ యధ్యాయము పరికించునపుడు కుచేలుడు కానరాడు. బలరామ కృష్ణులు గురుకుల వాసము చేయుటకుముందు యదుకులాచార్యుడగు గర్గ మహర్షిచే ద్విజత్వ సంస్కారము నందినారు. అవంతీ పురవాసి యగు సాందీపనిని గురువుగా నెన్నుకొనినారు.

"ఉర్విన్ మానవు లెవ్వరైన గురు వాక్యోద్యుక్తులై కాని త
త్పూర్వారంభము సేయబోలదనుచున్ బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియున్
గుర్వంగీ కరణంబు సేయఁ జనిరా గోవిందుడున్ రాముడున్"

చని వైభవరాశి యైన కాశిం జేరి తత్తీరంబున నవంతీపుర నివాసియు సకల విద్యా విలాసియునైన సాందీపనియను బుధవర్యునింగని యథోచితంబుగ దర్శించి శుద్ధ భావ వర్తనంబుల భక్తి సేయుచుండ వారల వలన సంతుష్టుండై— వేద శ్రేణియు............భూదేవాగ్రణి రామకృష్ణులకు సంభూత ప్రమోదంబున నరువది నాలుగు విద్యలు ......నేర్చిరిలేశా!

గురువులకు నెల్ల గురులై! గురు లఘు భావములు లేక కొమరొందు జగద్గురులు త్రిలోక హితార్థము గురు శిష్య న్యాయ లీల గొలిచిరి వేడ్కన్.
గురుదక్షిణగా నెన్నడో మృతుడైన గురుపుత్రుని దెచ్చి యిచ్చిన పిమ్మట "కాలుని వీటికి జని మృత బాలకు దేఁహొరుల వశమె భవదీయకృపన్!
మేలు దొరకొనియె మాకు విశాలమగు గాత మీ యశము లోకములన్"
అని దీవించిన గురువు ననుజ్ఞ పొంది స్వపురమును జేరుకొనినారు.

"గురుణైవ మనుజ్ఞాతౌ రథేనానిలరంహసా.
ఆయతౌ స్వపురంతాత పర్జన్య నినదేనవై
సమనందన్ ప్రజాస్సర్వాదృష్ట్వా రామ జనార్దనౌ
అపశ్యన్త్యో బహ్వాహాని నష్ట లబ్ధ ధనా ఇవ"

అంతకు పూర్వమెన్నడో మృతుడైన గురు పుత్రుని దెచ్చి యిచ్చుట గురువు పత్నీ వాంఛితము నెరవేర్చుట గురు దక్షిణ. ఈ ఘట్టమున నొసగు నుపదేశము.
"శిష్యులు బలాఢ్యులైన విశేష్యస్థితి నొంది గురువు జీవించును నిర్ధాష్య గుణ బల గరిష్ఠులు శిష్యులరై గురుని కోర్కె సేయందగదే?"

ఈ ఘట్టములో కుచేలుని పేరైన వినిపింపదు. ఇది కొన్ని రోజుల చరిత్రగా దోచుచున్నది.

ఆతడే గురువుకాని శిష్యులు వేరు. అది దశమస్కంధము ఉత్తర భాగము లో నెనుబదవ అధ్యాయములో నున్నది.

''కధయాంచక్రతుర్గాధా: పూర్వా గురు కులే సతో: !
ఆత్మనోలలితారాజన్! కరౌ గృహ్య పరస్పరమ్—
''అపి బ్రహ్మన్ గురుకులాద్భవతాలబ్ధ దక్షిణాత్ !
''కచ్చిద్గురుకులేవాసం బ్రహ్మన్! స్మరసి నౌ యతః
ద్విజో విజ్ఞాయ విజ్ఞేయం తమసః పారమశ్నుతే''

ఇత్యాది శ్లోకములలో వర్ణింపబడిన వ్యక్తులు శ్రీకృష్ణ కుచేలురు. ఆనాటికి కుచేలుడు కాదేమో? శ్రీదాముడో సుదాముడో అనుపేర బిలువబడి యుండవచ్చును. బ్రహ్మన్‌శబ్ద ప్రయోగము చేసియుండవచ్చును.

సంస్కృత భాగవతములో 80, 81 అధ్యాయములలో నుండు కధను వర్ణించుచు ''అధాశీతి తమే కృష్ణః శ్రీదామానం గృహాగతమ్,
సంపూజ్యా పృచ్ఛ దర్థేప్సుం గురువాస కధాం ముదా'' అనియు
ఏకాశీతితమే సఖ్యుర్జగ్ధ్వా పృధుక తండులాన్!
శ్రియం నిర్మితవానింద్ర దుర్లభాంతు తదాశ్రమే'' అనియు వివరింపబడినది.

ఇందు బలరాముని పేరు లేదు. ముగ్గురు కలిసి చదివినారా? బలరామకృష్ణులొక పర్యాయము కృష్ణ కుచేలురొక పర్యాయము చదివినారా? ఏమైనను కుచేలుడు కృష్ణుని బాల్య సఖుడు. సతీర్థ్యుడు. సాందీపని శిష్యుడు.

త్రికాలారాధ్యమగు ధర్మ ప్రబోధము ప్రధాన లక్ష్యముగా, శ్రుతి స్మృతి పురాణేతిహాసాదుల సారాంశమును గొంతా సమ్మితముగా నందించుట పరమ ప్రయోజనముగా జీవితాదర్శములను పాటించు నాచారమును ప్రచారములోనికి దేజాచుట ముఖ్య ఫలముగా గల ప్రాచీన మహర్షుల రచనలలోని వివిధ విషయములనే యవసరము ను బట్టి పెంచుచు విరోధమును బరిహరించుచు నూతనాంశములను బయలు పరచుచు నొక నిర్ణీత పధములో రచన సాగించిన ఘట్టు ప్రభువు తన గ్రంధములో నెన్నియో క్రొత్త సంగతులు వెల్లడించినాడు.

## గీతాచార్యుడగు శ్రీకృష్ణుని తద్బాల్య సఖుడగు కుచేలుని ద్వారా తెలిసికొనదగు ధర్మములు

బలరామకృష్ణులు చదివిన సాందీపని యొద్దనే కుచేలుడు కూడ విద్యాభ్యాసము చేసియుండెను. గురువు చెంతనే యెందుల కధ్యయనము చేయవలయునో, ఎట్లు

చేయవలయునో, గురు శుశ్రూషా విధాన మెట్లుండ వలయునో గురు దక్షిణ నొసంగుటయేగాక గురువును మెప్పించి యెట్టి యాశీర్వాదమును బొందవలయునో మున్నగు విషయములను విద్యార్థిలోకము తెలిసికొనదగు నంశములు గల ఘట్టమున
''ఎఱుగుదువె........................తివిరి...............యాచరించితినది గావున ..............గురు జనంబులఁ బరమ భక్తిని సేవించువారలఁ బరిణమింతును—
గురు పత్నీ నియోగమున ఇంధనానయనము.
''నాహ మిజ్యాప్ర............యధా''
'విడంబనంబయగు కాదె హరీ''

విద్య పూర్తి యైన పిమ్మట 'ఆచార్యాయ ప్రియంధన మాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః'' అను శ్రుత్యనుసారముగా పరిణయమాడుటను 'బ్రాహ్మణోత్తమ... తలప గృహక్షేత్ర ధన దారపుత్రాదులందు నీ చిత్తంబు సెందకుండుట వంటి ఉదార భావములఁ జాటుచుండును. బాల్య సఖునకు జేయఁదగు మర్యాదలు, అతిథి పూజ, బ్రాహ్మణ భక్తి, బాల్య మిత్రుడు ప్రేమ పాత్రుడగు ద్రోణునకు ద్రుపదుఁడొనర్చిన తిరస్కృతికి నిరసన భూతమైన కృష్ణ సత్కృతి యసామాన్యము. కుచేలునకు శ్రీకృష్ణుఁడొ నర్చిన సత్కారము వంటి యుదార భావముత్తమ శీల సాధ్యము. కుచేలుని మనస్తత్వము— స్థిత ప్రజ్ఞస్థితి. భగవదర్పిత పదార్థము. భక్తితో సజ్జనులకొసంగి నందున కలుగు ఫలము.

''దేవదేవుడఖిల భావజ్ఞుడాశ్రిత వరదుడైన హరికి ధరణి సురులు
దైవతములు గాన ధారుణీ దివిజుల కంటె దైవమొకడు కలదె భువిని.''

కుచేలుని చరితార్థుని జేయుట—పురుషార్థ చతుష్టయములో ధర్మ కామములు పురుషుల చేతిలోను, అర్థ మోక్షములు భగవంతుని చేతిలోను నుండును గాన ధర్మబద్ధమైన కామముతో జీవితము సాగించు భక్తులను గటాక్షించి తన చిత్తానుసారముగ అర్థమును, అంతియేగాక పరమార్థమును (మోక్షమును) ప్రసాదించు పరాత్పరుడు కుచేలునిపై నెట్టి కృపావర్షమును గురిపించెనో యట్టి కృపయే సర్వుల యెడ చూపును గాని తద్భాగ్యమున కర్హతగల వ్యక్తిగా జీవించుట ప్రశస్తము. పేదతనముతో సతమతమగు బాల్య సఖుని కుటుంబమునకు సహాయముగా నఖిల సంపదల నొసంగుటయేగాక మిత్రునకు మోక్షలక్ష్మిని ప్రసాదించుట గణనీయము.

వామాక్షికూడ భర్తకు దగిన, మించిన యుత్తమోదార గుణ శీల సంపన్న. పెనిమిటి మనసు నెరిగి వర్తించు సాధ్వీమతల్లి. పతి హితమే తన మతముగా నడచిన పుణ్య చరిత. పేదతనములో దన ప్రియుని బిడ్డలను మనస్ఫూర్తిగా ప్రేమించిన యిల్లాలు. ఈ యిరువురిలో నొకరుగూడ కామాసక్తులు గారు. ద్వాపర యుగమునాటి వారు. 'నారు పోసినవాడు నీరు పోయడా' యను మనస్తత్వము గలవాడు భర్త. పురుష ప్రయత్నము చేయకున్న సిరి కలుగదని పురుషకారమున విశ్వాసము గలది భార్య. ఈ దైవ పౌరుష వాదములను యుక్తి ప్రయుక్తులతో నెవరికి దోచినట్లు వారుగాక సశాస్త్రీయముగ న్యాయస్థానమున వాదించు

న్యాయవాదులను దలపించు రీతిలో దగినన్ని యుపపత్తులతో నొప్పించుట గమనా రము. తాలిమితో మెప్పించి ఒప్పించుటలో పైచేయి సహనశీలలైన స్త్రీలకే గాన వాదము నకు కుచేలుడు లొంగిపోవుట వింతకాదు.

## దైవపౌరుషవాదము

"ఉత్థానేచ సదాపుత్ర ప్రయతేథా యుధిష్ఠిర!
నహ్యుత్థానాదృతే దైవం జ్ఞామర్థ ప్రసిద్ధయే॥
సాధారణం ద్వయం హ్యేతద్దైవముత్థానమేవచ।
పౌరుషంహిపరం మన్యే దైవం నిశ్చిత్యముహ్యతే॥ అనియు
యదా హ్యేకేన చక్రేణ నరథస్య గతిర్భవేత్।

ఏవం పురుష కారేణ వినాదైవం నసిద్ధ్యతి"— అనియు భీష్ముడు ధర్మజునకు పురుష కారము ముఖ్యమని తెల్పెను.

వసిష్ఠ మహర్షి యింకను వివరముగా

"శుభా శుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనా సరిత్
పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభేపథి" అని శుభా శుభ మార్గములలో పయనించు వాసనా ప్రవాహమును పురుష ప్రయత్నముతో శుభ మార్గము లోనికి మళ్లించ వలయును. జన్మాంతర కర్మలు సంస్కార రూపముతో నంతః కరణములో నుండును. ఫలోన్ముఖమైన సంస్కారమే వాసన. అదే జన్మహేతువయిన ప్రారబ్ధకర్మ. పుణ్య పాపమిశ్రితమైనదిజన్మ. తప్పుత్రోవ నుండి బుద్ధిని మరలించు టకు ప్రయత్నించవలసియుండును. కొందరు సర్వము ప్రారబ్ధానుసారియని, యేమి జరిగిన జరుగుచున్న యూరకుందురు. ప్రయత్నము వలన ప్రారబ్ధమును మార్చు కొనవచ్చును అనియుదాహరణ పూర్వకముగా ప్రబోధించినాడు.

"విశ్వామిత్రేణ మునినా దైవముత్సృజ్య దూరతః।
ప్రయత్నేనైవ సంప్రాప్తం బ్రాహ్మణ్యం రామ! నాన్యథా"

దైవమనగా ప్రకృతము ప్రారబ్ధమని యర్థము. విశ్వామిత్రముని స్వప్రయత్నముతో ప్రారబ్ధమును దూరముగా వదలి బ్రహ్మర్షిత్వమును బొంద గలిగి నాడు. అందువలన ప్రారబ్ధమెట్లున్ననట్లు జరుగునని యూరకుండరాదని ప్రయత్న ప్రాధాన్యము నిరూపితమైనది.

"వినా పురుష కారేణ నదైవ మపిసిద్ధ్యతి!
నహి సుప్తస్య సింహస్య ప్రవిశంతి ముఖేమృగా",
'ఉద్యోగినం పురుష సింహముపైతి లక్ష్మీః
దైవేన దేయమితి కాపురుషావదంతి!
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా

యత్నేకృతే యది తుసిద్ధ్యతి త్ర తతోషః" ( యదినసిద్ధ్యతికో(త దోషః ) పై యభిప్రాయము మనస్సులో ధృడముగా నాటుకొనిన వామాక్షి

"యాదవ వల్లభుడును మీరాదిస్నేహితులటంచు నందఱు దెలుపన్, మోద మున విందు నెపుడా శ్రీదయితుని సమ్ముఖంబుఁ జేరి మహాత్మా చిన్నవాండ్రకు వేమైన సిరులు వేడి తెచ్చి రక్షించు కొనుము" అని కక్కూర్తి మాటయాడినది. బిడ్డల పాట్లు చూడలేక తాను భరింపలేక భర్తను యాచించు మనదుగాని"పూర్వ సఖుడైన యాదవ పుంగవుండు, మిమ్ముఁబొడగన్న సిరులెల్ల మిన్నకొసగు" నని ధైర్యముగా పల్కినది. భగవత్తత్వమామెకు దెలిసినంత కుచేలునకు దెలియదని గాదుగాని పురుషకారమునకు విముఖుండగుట చేత కుచేలుడు తన వాదమునకు ప్రక్రమించినాడు.

"తరుణీ పూర్వభవంబున
గుఱి మీఱగ చేసినంత కుడుతురు పిదపన్
నరులీజన్మంబున"
'ధనము గూర్ప వలెనె తనయులకును భుక్తి
లిడెడువాడు శ్రీరమేశ్వరుండు
మృగ సమూహములకు మేపు నీళ్లెవ్వడు
పెట్టి ప్రోచు నెలమినట్టడవుల—
రాతిలో కప్పకాహారమాతతముగ
నిడెడు దైవంబు మర్త్యులకేల మాను ?—
ఓ వనిత నీకుమారుల
ప్రోవగవలెననుచు సారెఁ బొగిలెదవుమదిన్
నీవెవ్వరో నేనెవ్వరో
శ్రీవరదుడెకర్త సకల జీవుల బ్రోవన్." అని ప్రారంభించి యెంతయో వివరించి 'కోరి వనురావు మనముమ గోరకయుండినను బోవు గురుతెరిగిసిరుల్ పూరుషుల కర్మ ఫలములు వారకయవితమకుఁదామెవచ్చున్ బోవున్—

మన తనయు లేమి చేసిరో
మునుపటి జన్మమున నంతమురహరుఁడొసగున్
విను తధ్యం బీభవమున

వనితా నీకింత చింత వలవదు సుమ్మీ'— అని విరక్తుడై 'సర్వంబునకు సర్వేశ్వరుండే గలండు, ప్రజల రక్షింపనేను సమర్థుండనే' యని దైవవాదమును ముగించిన కుచేలుని చిత్తంబు మెత్తంజేయ మరల పౌరుష వాదమును బలపరచినది వామాక్షి

"బలువుగ సత్కర్మంబులు
దలంచి యొనర్పకయ ఫలము దైవంబిడునే ?
హలికుడద నెరిగి విత్తన
మిల వెద వెట్టకయె పండునే ధాన్యంబుల్ "—ఏమి దృష్టాంతము ?
దేవుడిచ్చుననుచు దిన దిన యత్నముల్
సేయకున్ననేల సిరులుగల్గు ? బళ్లెరమున నిడిన పంచభక్ష్యాన్నముల్
కుడువకున్న నెట్లు కడపు నిండు ? ప్రత్యక్ష విషయముగదా ?

కావున మనుజుడు సేయక దేవుండీయంగలేడు తెగి యేమియు నానావిధ ధాన్యములుండిన వావిరివండకయె రిత్త వంటకమగునే ? అనుభూతమే. సహజ మైన దృష్టాంతాదులతో భర్త మనస్సునకు నచ్చజెప్పి మరలించినది. మానుష మున నమ్మానిని మృదు వచనములకు మౌనీంద్రుడు సమ్మతించెమానసవీధిన్"— కాంచనాంబరు నెలమి సేవించుట యును, ప్రజల రక్షించుటయు మంచిపనిఘటిల్లె, తీర్థమును స్వార్థమునటంచు దెలిసియపుడు ఎట్టకేలకు తత్కార్యమియ్యకొనియె. ఇట్లు పురుష కారమున మనుజుండె కర్త దైవంబునకు పనిలే దనిపించడు.

వామాక్షియే 'మనుజుడెల్ల ప్రొద్దుమానక సేయంగ
దైవయత్న మొకటి తారసిల్లు
గాక యూరకున్న గలదె భుక్తమునకు
దైవ మానుషములు దగ సమములు' అని దైవమును గూడ

పురుషకారముతో జతచేసి భర్తనులోగొనుట స్తుతిపాత్రము. యాచన అంటే గిట్టని నిష్కాముడెట్టి స్థితికి దిగజారవలసి వచ్చినది ? యాచన కంటె నికృష్టగతి మరొక్కటిలేదు. బలిని యాచించు నిమిత్తమే గదా పురుషోత్తముడు వామనుడు కావలసి వచ్చినది ? కృష్ణుని చెంతకేగుటకు నిశ్చయించుకొనినాడు. తీర్థము, స్వార్థము కలిసి వచ్చినది. మిత్ర సందర్శన భాగ్యము మహాభాగ్యము. లోకోత్త రపురుషుని దర్శించిన జాలునను కొనినాడు. భార్య మాటవినినట్లుగా కన్పించినను లోలోపల కృష్ణ సందర్శనమునే యాశించినాడు. సరేయని తలయూపినాడు. శూన్య హస్తములతో దర్శింపనేగరాదని 'కానికేమైన గొంపోవఁగలదెయింట' అనినాడు. ఏమియుండునో అంత ఎరుగని వాడా ? ఏపూట కాపూట గడవని స్థితిలోనే వస్తువులుండుననుకొనినాడు ? ఏదియో వంక పెట్టుకొని ప్రయాణము మానునేమో యని దూరదృష్టి గలదిగాన వామాక్షి ఆలస్యము చేసిన భర్త మనస్సు మారునని నాల్గు పిడికెళ్ల అడుకులు సంపాదించి గుడ్డను మూటగట్టి పై వస్త్రము కొంగున ముడిచినది. పిల్లలపోరు మాన్పుట కని యాచించి తెచ్చిన యడుకుల వలన నక్షయ మైన మోక్ష లక్ష్మి భర్తకును, తరుగని భాగ్యలక్ష్మితన తనయులకును కలుగునను తలంపులేని వామాక్షి సమయస్ఫూర్తి ప్రశంసనీయము. కుచేలునకు దగిన యిల్లాలు. యాచనా వృత్తి కిట్టనిది. కాని పరిస్థితియట్లు చేయించినదని సర్దుకొనలేకపోయిన కవి వామాక్షిచేత యాచన చేయింపలేదు.

# పృథుకోపాఖ్యానము

హామాక్షి సూచించిన ప్రకారము పురుషకారమునకు దల యొగ్గిన కుచేలుడు కృష్ణ సందర్శనమునకేగ నిశ్చయించుకొన్నాడు. 'రిక్తహస్తేన నోపేయాద్రాజానం దైవతం గురుమ్' ఇత్యాది వచనానుసారముగా కృష్ణ దర్శనమునకేగునపుడేదేని కానిక తీసికొని వెళ్లవలయునని పృథుకతండులములను దీసికొని వెళ్లినటుల కుచేల చరిత్ర వలన దెలియుచున్నది. వ్యాసుడు శ్రీదామ చరితా ధ్యాయములో 'యదృచ్ఛయోపపన్నేన వర్తమానో గృహాశ్రమీ' అని ప్రయత్నములేకుండ సమీపమందు లభించిన యర్థముతో వృత్తిని గల్పించుకొని జీవించు వానినిగా కుచేలుని దెల్పినాడు. ఉపాయనము దీసికొని వెళ్లుటకు ఘనమైన వస్తువులెట్లు లభించును ? ఏదేని కానితీసికొని వెళ్లుటకు చేత చిల్లిగవ్వ కూడలేని సంసారి. యాచనావృత్తికిట్టదు. బిడ్డలకు తిండి పెట్టగలనా లేదాయని యైన ఆలోచింపక అన్నిటికిని దైవము మీదనే భారముంచి బహు సంతానము కనినందులకు తగిన శాస్తి జరిగినదని ఆక్షేపించువారు నేటికాలమున కోకొల్లలు. "ఏష్టవ్యాబహవః పుత్రాః" అను దాని ప్రయోజనము గుర్తించువారాక్షేపణకు సమ్మతింపరు. పిడికెడడుకులు భగవ దర్పితము చేసి లేమిని రూపుమాపిన వాడనగా అతని భక్తి ప్రపత్తులకు ముగ్ధులుగాక తప్పదు. పట్టుకొని వెళ్లుటకీ అడుకులు మాత్రమింటిలోనున్నవా ? ఉన్ననాడే పూట కాపూట యింతతిని లేనినాడు పస్తుండుటకలవాటుపడిన యా యింటిలో నడుకులు నిల్వయుండునా ? 'కానికేమైన గొనిపోవఁగలదెయింట' అనగానే హామాక్షి కుచేలుని యింగితము గుర్తించి యడుకులు మూటకట్టియిచ్చినదనిన నాయడుకులెక్కడివని ప్రశ్నయుదయించక తప్పదు. వ్యాస మహర్షి "యాచిత్వాచతురో ముష్టీన్ విప్రాన్ పృథుకతండులాన్, చేలఖండేనతాన్ బద్ధ్వాభర్త్రే ప్రాదాదుపాయనమ్' అని నాల్గు పిడికిలుల యడుకులు యాచించి తెచ్చి నదనినాడు. ఈ భావము తనకు నచ్చక కాబోలు పోతన తన కుచేలుని 'దారిద్ర్యంబు బాధింప నొరులఁగార్పణ్య వృత్తి నడుగఁబోవక తనకుఁ దానబ్బినట్టి........ పుత్ర దారాభిరక్ష, యొకవిధంబుగ నడుపుచు నుండు వానినిగా జిత్రించినందున అడుకు లెక్కడివో తెల్పలేదు. ఏమైనను అమాత్య వంశములో జన్మించినవాడు గదా? 'శిశువు లాకటి చిచ్చుచే గృశించి మల మల మాడుచున్న — తను జేరివేడినను' బిడ్డలకు పెట్టకుండ దాచియుంచినదా ? తల్లి హృదయము ద్రవించునది. తండ్రి యొకవేళ బిడ్డల యాకలిని పట్టించుకొనక పోవచ్చునుగాని కన్నతల్లి యప్పతెచ్చియైన నింత బిడ్డలకు పెట్టనిదే యుండలేనిది. తాము పస్తులుండి బిడ్డలకింత పెట్టు తల్లు లుండుటచేతనే మాతృ హృదయము గణనీయము. మాతృ వాత్సల్యము దెల్పుటకే యుపమానమును సరిపడదు. ఒక మానవ జాతిలోనేగాదు; పశు పక్ష్యాదులు గూడ తమ పిల్లల విషయమై యెంతయో శ్రమననుభవించు చుండును. గోవ్యాఘ్రసంవాద మీ విషయమును స్పష్టముగ వివరించుచున్నది.

'విభుని శిథిల వస్త్రంబుకొంగునఁ బృథుక తండులములు నొకకొన్నిముడిచి వెయ్యమున ననుప' అనినాడేగాని అవి యేరీతిగా లభించినవో పోతన తెలుపలేదు.

ఘుట్ట ప్రభుని కుచేలుడు యాచకుడుకాడు. భార్య కూడనట్టి పని యొనర్చు టకు సమ్మతించు వాడునుకాడు. పతివ్రతా శిరోమణిగాన కొన్ని నాళ్ళు పవసించి తన యాహార పదార్థము మిగిల్చి మూటగట్టి యిచ్చినది. అడుకులను పట్టుకొని వెళ్లుటలో గుర్తింప వలసిన విషయములు పలురీతులుగా భావింపదగియున్నవి.

అవంతికి సమీపములోని తాపస పల్లెనుండి ద్వారకకు చేరుటకెన్నియో రోజులు ప్రయాణము చేయవలసియుండును. అంత కాలము చెడిపోకుండ నిల్వయుండదగు పత్రపుష్ప ఫలాదులుండవు గదా ? గొప్ప వారి యింటికి వెళ్లునపుడు కొద్దిపాటి యైన ఘన పదార్థమును దీసికొని వెళ్లుట కార్థిక పరిస్థితి బాగుండవలయును. ఏవైన మధురాది పదార్థములు చేయించి తీసికొని వెళ్లుటకు తాహతు లేదుగదా? తానున్న తాపసపల్లెలోని వారే కొందరో తనకన్న భాగ్యవంతులున్నను వారి చెంత బదులు తీసికొన్నచో మరల తీర్చగలమను ధైర్యముండుటకష్టము. తాను కొన్ని దినములు ప్రయాణముచేసి వెళ్లి శ్రీకృష్ణుని దర్శించి తిరిగి వచ్చిన తర్వాతగాని యాయప్పు తీర్చగలడా ? బహుయోజనములు నడిచివెళ్లి తిరిగి వచ్చుటకెంతకాలము పట్టునో ? ఇంతకు పూర్వ మెన్నడును ద్వారకకు వెళ్లి యుండలేదు. ఎట్లో అక్కడకు వెళ్లివచ్చుచోనతని దర్శనము సంభవించి యతడొక కాసో వీసమో యిచ్చినను తాను చేసిన యప్పు తీరునో లేదో అని కూడ సందేహము కలుగవచ్చును. ఆదియుగాక ఏ దేవునో, ఏ మహారాజునో చూచుటకు వెళ్లునట్లుగా వెళ్లుట లేదుగదా ? తన బాల్య స్నేహితుని సహాధ్యాయిని చూడగోరి నప్పుడు ఘనమైన యే యుపాయనము తీసికొనివెళ్లినను వింతగనే తోచును. తమకు లభించునది తామనుభవించునది పట్టుకొనివెళ్లు నపుడు కన్పించు అనురాగము అభిమానము మరియొక రీతిగానున్నచో విపరీత భావమును దొపజేయవచ్చును. ఏపదార్థమునైన పట్టుకొని వెళ్లినచో నా పదార్థము నెదుట నుంచవలయునుగదా? 'ఇవెక్కడివని'న తానేమి జవాబు చెప్పగలడు ? పత్రపుష్పఫలాదుల వలె కొలది రోజులకే చెడిపోకుండ నిల్వయుండ దగినవి, తనకు సులభమైనవి తన మిత్రుడు సందేహింపనివి తన మనోభావమును వెల్లడింప సమర్థములైనవి పృథుక తండులములని తలంచి యే యిల్లాలి సంకల్పము నకు సమ్మతి చూపినాడు. సంసార జలధిలో నాని, తాపత్రయాభీల దావాగ్నిలో వేగి, అనుదిన బాధాకరభీకర దరిద్ర దేవతా కరద్వయ ప్రేరితములైన రోకలిపోటుల బడిసాగి, నలిగిపోయిన అడుకు గింజలవలె నేను నలిగి పోవుచుంటినని వేరుగ చెప్పకొన వలసిన యవసరము కన్పింపదని తలంచి యుండును.

ఐహికముగ తన దయనీయ స్థితి సూచించుట యొక సంకల్పమనుకొన్నను అంతకంటె వేరొక గూఢ విషయమును స్ఫురింపజేయు సంకల్పముండి యుండును. వడ్లగింజలస్థితి "పునరపి జననం పునరపి మరణమ్" వంటిది. అది సంసార చక్ర ములో బడి జన్మ పరంపరలనను భవించు స్థితిని దెల్పును. 'సస్యమివమర్త్యః పచ్యతే సస్యమి వాజాయతే పునః' అని కదా ఉపనిషత్సూక్తి. వడ్లగింజలకు జన్మ రాహిత్యము కావలయుననిన మంగలములో వేయించవలయును. వేయించిన గింజ మరల మొలక యెత్తదు. ఏ కొంచెమోవేపు దెబ్బతినని గింజయైనచో మొలకరా వచ్చునను సంశయము తీరుటకు రోకటి పోటుతో రోటిలో సాగదీయబడిన అడుకు గింజయైనచో నది మొలకెత్తు గతియే యుండదు. తాను కోరునదాయడుకుల

వంటి స్థితియని గుర్తింప జేయుటకుచితములని పృధుకతండులములకు సమ్మతించి యుండును. కుచేలుని వాంఛ మొదటి నుండి యదియేయని గుర్తింపవచ్చును.

'విజ్ఞాని రాగాది విరహిత స్వాంతుండు, విజితేంద్రియుడు, బ్రహ్మవేత్త' ఇత్యాది లక్షణ లక్షితుడగు నాతని వాంఛ పారలౌకికముగాన అడుకులే యట్టి వాంఛను సూచింప దగియుండును. ఐహికపారలౌకికముల మాట యెటులున్నను, ఏ ఫలమునో (పనస మున్నగు వానిని) తెచ్చియిచ్చినచో దానిననుభవించుటకు కొంత సమయమును వృధా చేయవలసి యుండును. ముడివిప్పగనే నోటబెట్టుకొనుటకుపయోగించునవి కనుక కాలవ్యవధి కూడ లేకుండ భక్తితో నాతని కర్పింపదగియున్నవి. కాక వారి విద్యాభ్యాస కాలములో నొకరికొక రేవేని తినుబండారము లిచ్చిపుచ్చుకొనునపుడు భాగ్యశాలియగు కృష్ణుడిచ్చిన మధుర పదార్థములకు బదులుగా తాను తాపసపల్లెనుండు పృధుక తండులముల నిచ్చియున్న సంగతి జ్ఞాపకము చేయుటకూడ సంకల్పమేమో ?

ఏదేని పదార్థమును జేతబట్టుకొని ఆతని యెదుటనుంచు నప్పటికంటె తన కొంగున నున్న మూట విప్పబోనాతని గ్రాసవాసోదైన్యము ఒకరు చెప్పనక్కర లేకుండ స్పష్టముగా వెల్లడి కాగలదు. ఎన్ని చినుగులో? వేరుగా మూటకట్టి యుత్తరీయపు కొంగున ముడిచినదిగాన త్రోవలో కారిపోకుండ నన్నివాళ్లాగినవి గాని, ఆ మూటకానిచో ద్వారక చేరునాటి కొక్కగింజకూడ మిగిలి యుండెడిది కాదుగదా?

'జీర్ణ వస్త్రంబు కొంగున ముడిచితెచ్చిన యడుకుల ముడియుగని' —

'వసనాచ్చీర బద్ధాన్ ద్విజన్మనః స్వయంజహార కిమిదమితి' కుచేలుడు అడుకుల నర్పించుటకు సిగ్గు పడుచుండుట గుర్తించియే శ్రీకృష్ణుడు స్వయముగా మూటవిప్పి పిడికెడడుకులు భక్షించెను. 'ఇవియ సకలలోకంబులను నన్నును బరితృప్తింబొందింప జాలు'నని ఆరగించి కుతూహలియైనాడు.

'పత్రం పుష్పం ఫలంతోయం యోమేభక్త్యాప్రయచ్ఛతి........................

.........ప్రయతాత్మనః అనినట్లు భగవంతుని సులభముగా తృప్తిపరుప వచ్చును గాని లోపల భక్తి యుండవలయును. పరమాత్మ కర్పించుచున్నాడనను భావముతో సమర్పింపవలయును. నాకు భక్తితో నిచ్చినదానిని నేను మిక్కలి ప్రీతితో భుజింతు నని వ్యాఖ్యానము చేసిన కృష్ణ పరమాత్మ భక్తుని హృదయమును పరీక్షించునేగాని పదార్థ మును గాదని తెలును. కుచేలుడు చేసినది భక్తితో గూడినదేగాని పత్రాదులలో జేరదు. తన్మాత్రముననే తనకు తృప్తికలుగునని తెల్పుటకేగాని యితర పదార్థముల నొల్లనని కాదు. పిడికెడడుకులు స్వీకరించినందులకు ప్రతిఫలముగా మహైశ్వర్యమును ప్రసాదించిన శ్రీకృష్ణుని ఘనత యానాడేకాదు నేటికిని ప్రశంసింపబడుచున్నది.

'అలఘు గుణ ప్రసిద్ధుడగు...తెలిసి కుచేలుడొక్కకొణి దెందడుకుల్త-
న కిచ్చినన్ మహా ఫలదుడు కృష్ణుడత్యధిక భాగ్యము లాతనికీడె భాస్కరా'

అని కవులు వెల్లడించుచునే యుందురు.

'కోరి కుచేలు చేతి యడుకుల్కొడితెండు భుజించినట్లొగిం—'

'అల కుచేలుని చేరెడడుకులు భక్షించి సంపదలొసంగిన సరసగుణుడ'

_డిగితెచ్చిన ముక్కుటడుకులు భక్షించి చెలంగి బాపని ధన్యుఁ జేసినట్లు'
'ఎలమితోడఁ గుచేలునేలినట్లు'
'ధర నహింసాకర్మ ధర్మ ప్రసిద్ధుడై సిద్ధుడై తగు బుధశ్రేణిలోన
ననుచు సహపాటకుఁ గుచేలునరసి యెన్ని యెన్నికలమించు సిరు
లిచ్చియే యేలితౌర చారుతర మందహాస..............................కృష్ణ'
'నిరుపేద సఖుడు భక్తిం
డరుదెంచిన నెరిఁగి ప్రీతి నడుకులు గొని స
త్వరమున సంపద లిడితౌ............... త్రిదశాధీశా!'
'చాలుపుగా దరిద్రదమున సంకట పాటుల నొంది భక్తినీ
పాలికి వచ్చినం బరమ భాగ్యునిఁజేయు కుచేలు రీతిన
న్నేలుము నీకు మొక్కెదను.........మనోహరా!'

ఇట్టి యుదాహరణము లెన్నియేని ప్రాచీన కవులచే ప్రశంసింపబడినవి కుచేల కృష్ణుల పరస్పర భక్త్యనురాగాదుల వెల్లడించుచునే యుండును.

విప్రోత్తముడైన కుచేలు డాశీర్వాదాక్షతలు శిరమున నుంచఁ దగునే గాని ఫలాదులను చేత నుంచుట భావ్యము కాదు. ప్రతి గ్రహణాధికారము లేకపోవుటచేతనే కృష్ణుడు దాతగాని ప్రతిగ్రహీత కాడుగదా? కుచేలుని చేతిక్రింద చేయి యుంచకుండ పైనుంచియే యటుకులను స్వీకరించినాడు. భక్షించినాడు. మరి మిగిలిన యడుకుల సంగతి? మరల నింకొక పిడికెడడుకు లాహారింప చేతఁబట్టినపుడు రుక్మిణి చేయి పట్టుకొని వారించినది. శ్రీకృష్ణుడప్పుడు తన చేతందీసిన యడుకుల నేమిచేసినట్లు? ఆమె యెందులకు వారించి నట్లు? వ్యాసభగవాను డేమియు ననకుండ తప్పుకొనినాడు. ఆ యడుగు జాడలలో నడిచినందున పోతనామాత్యుడుగూడ తలపెట్టలేదు. ఘట్టు ప్రభువు పిడికిటఁ బట్టిన వానిని మరల కుచేలుని కొంగున నుంచి మూటగట్టినట్లు తెల్పినందున సంశయము తీరినది. 'అంత ముకుందుండు రుక్మిణీకాంతా నివారిత కార్యుండై యత్యంత తృప్తుం డగువాడునుంబోలె నాదరంబున నయ్యడుకులతని జీర్ణ వస్త్రంబున గ్రమ్మరముడిచి యా కుచేలుని పంచిన'.

'పిడికెడడుకులపుడు ప్రియమున భక్షించి
యా కుచేలునకు మహామహునకు
సకలలోక విభవ సామ్రాజ్యము లొసంగ
మనసు వెట్టెనట రమాధవుండు
మరియును బిడికెండడుకులు
గిరిధరుడటఁ ప్రేమ నారగించిన యేనిన్
బరమాదరమున నతనికి
జిరకాలము భృత్యుడై వసింపగ వలయున్
కావున పతికి హితంబుగ
నా వెలదుక మరియు నడుకు లాహారింపం
గావలదని యెను భక్తుల
కీ వచ్చును రాదనడు రమేశ్వరుడెందున్'
అని రుక్మిణి వారించుటలో హేతుపూర్వకముగా సమాధానము గ్రాహ్యము,

కృష్ణుడు మూటలోనుండి యొక పిడికెడడుకులు తీసికొనుట, భుజించుట జరిగినది. రెండవ పిడికెడు చేతంబట్టుకొని భుజించునో లేక చెంతనున్న ప్రియురాండ్ర కొసంగునో అంతవరకైన రుక్మిణి కనిపెట్టియుండిన బాగుగా నుండును. తొందర పడినదని నిందింపగలరని యేమో పై రీతిని కృష్ణుని యుదారతను భక్తులయెడ ననురాగమును వెల్లడింపవలసి వచ్చినది. నాటకకర్త మరొక రీతిగా సమర్థించెను.

శ్రీకృష్ణుడు మరల మూటలో నడుకులుంచు సమయముననే కుచేలు నింటనేకాదు సకల గ్రామమున సర్వ సంపదలు కలిగినవి.

'మునుపటి పర్ణ కుటీరము కనక మయంబై యతుల్య కల్యాణంబై

ధనధాన్య సంభరితమై ఘనమై యుండంగ'—

తొంటిపల్లె చేరువకుంజేరగా

అది మిక్కిలి హరికరుణను మొదలి పురంబులకునెల్ల మొదలి పురంబై

పదమలమై బహుభోగాస్పదమై విలసిల్లె సకల సౌభాగ్యములన్.'

కుచేలుడింటి మొగముపట్టి త్రోవలో—

'ఎవ్వ దరిద్రుడు సంపదంధుడై కానక తన్నుఁ జేరడనికాక శ్రీతార్తి

హరుండు......సర్వవస్తు పరిపూర్ణునిగా ననుజేయకుండునే?'

అనుకొనునప్పటికి తనకైశ్వర్యము కలుగునను విశ్వాసము లేకపోవుటయే ఉచితము. ఒక వేళ తన వస్త్రములు మారినను తన గృహ గ్రామాదులు మారియుండునను నభిప్రాయము గలుగుటకు సావకాశము లేదు. కనుకనే యింటికిఁ జేరునప్పుడు కన్పించు పట్టణమును తన పల్లెగా గుర్తించి 'పల్లెయును పట్టణంబయ్యె పద్మనయను

మాయ దెలియంగ శక్యమే మనకు' అనుకొనును.

కలిగిన యైశ్వర్యమునకు సంతసించి యనుభవించుచు సుఖంబుగా నుండవలసియున్నను తనకు మనోవికారంబులు వొడమకుండ వర్తించుచు 'మలిన దేహుండును జీర్ణాంబరుండును నని చిత్తంబున హేయంబుగాఁ బాటింపక.........ప్రతిభవంబున.........అపవర్గ ప్రాప్తినొందె' అని యనును.

కుచేలునకు భవబంధమోచనము వాంచితము. భార్య మూలముగా నేర్పడినది భవబంధము. అది అపత్యశ్రేణి మూలమున మరింత బిగిసినది. శ్రీకృష్ణుడు మూట విప్పుటద్వారా అది ప్రకటితము కావలయును. నోటచెప్పుట తగనిపని. అయినచో సర్వ సంపదల నెందులకిచ్చినట్లు? జీవితములో దరిద్రమునే యనుభవించినప్పుడు దుఃఖానంతరము సుఖముకూడ గలుగునట్లు సంపదకూడ కలుగక తప్పదని తెలిసికొనుట కొరకే. సంపద కలిగిన నెట్టి యానందము కలుగునో మోక్షానంద మెట్టిదో తెలిసికొనుటకు గాదుగాని యీ యానందమనుభవించిన పిమ్మట మోక్షానంద మనుభవించుటయే యభిలషణీయము. తన స్నేహితుడై నందులకు జీవితములో నొక పర్యాయమైన సకల సంపదల ననుభవించి తృప్తినందినచో చూచిన తనకది సంతోషకరముగా నుండునని తలంచి మరల మూటంగట్టెను. 'కామిగాక మోక్షగామి కాడు' గదా?

'పుడమి జలములందుఁ బుట్టిన కమలంబు
లర్కు కిరణములకు నలరినట్లు
దూరదేశగతుల మీరల రాకకే
నెమ్మి గోరుచుందు నెమ్మనమున' అని శ్రీకృష్ణు డాంతర్యమును ధ్వనింపఁ జేయుచు 'పెండ్లియాడినావె పెక్కుగాఁ గొడుకులు

గలిగినారె నీకు గ్రాసవాస
ములకుఁ గొదువపడక కలుగుచున్నవి యేయే

కాలమునను నొక్కగతి మహాత్మ!' అని యెన్నియో ప్రశ్నలడిగినాడు. ఒక్క దానికి సమాధాన మీయలేదు. ఏల జంకెనో? వీని కన్నిటికిని సరియగు సమాధానము తాదెచ్చిన యడుకులే తెల్పునని తలంచి నాడనిపించును. నివ్వరి యడుకులు తారలవలె శుభ్రముగా నుండి మిలమిల లాడుచుండును. అవి నక్షత్రములను జ్ఞప్తికిఁ దేగలవు తన సంతాన మాయశ్వన్యాది నక్షత్రములట్లు సంఖ్యలో సరిపడునని చెప్పదలంచియుం డును. ఈ అడుకులవలె బహు సంతానము కలిగినది. అడుకు గింజలవలె సాగిపోయిన బిడ్డలు బాధపడుచున్నారని తెలియదా? ఏ పండ్లో తెచ్చియిచ్చినచో నింత వివరముగా తన సంతతినిగూర్చి తెలుప వీలుకలిగి యుండెడిది కాదేమో? ఏ ద్రాక్షగుత్తియో, చిట్టీత గెలయో కొంతవరకు సూచింపవచ్చును. తన బహు సంతానమునకు కుచేలుడు విచారించి నట్లు లేదు. కృష్ణుడు మాత్రము విచారించు ననుకొన వీలుకాదు. ఆతనికి మాత్రము సంతానము తక్కువ గనకనా? బహు సంతానము కలిగి లోకములో నెవరేని భాగ్యదూరులై బాధపడునప్పుడు 'పాపం అటుకు గింజలా సాగిపోతున్నాడ'నుట పరిపాటియే గదా?

''పుణ్యా సతీకర ఘటిత పదార్థ భుక్తి చిరపుణ్య సంభవము'' అని కృష్ణపరమాత్మ యడుకుల నెంతగానో పొగడినాడు. 'ఎద్దు కేమి తెలుసురా అడుకుల రుచి' యను సామెత అజ్ఞుల గురించి వాడినదే గదా?

ఈ యడుకుల చరిత్ర మొక యధ్యాయములో దెల్పి దానికి పృథుకోపాఖ్యానమని పేరుంచిన వ్యాసుని హృదయమున నింకెన్ని యభిప్రాయము లిమిడియున్నవో?

పృథుక శబ్దము బిడ్డలను, అడుకులనుగూడ దెల్పును. వ్యుత్పత్తిని బరిశీలించిన 'పృథుత్వాత్—పృథుకః' దంచబడినదై పెద్దదగునది అడుకు. పృథు తురం యథా భవతి తథా కాయతి పృథుకః—కై శబ్దే. అధికముగా మొరపెట్టునది—బిడ్డ. శిశు మాత్రము.

తన బిడ్డలకొరకు భార్య ప్రేరేచిన కృష్ణుని చెంతకేగుటకు సమ్మతించినాడు. చంద్రునకు నూలుపోగన్న సామెతగా కానికేమైనంబట్టుకొనివెళ్లవలయునని అడు కులు పట్టుకొని వెళ్లినాడు. కాన రెండువిధములుగా గూడ పృథుకోపాఖ్యానము అను నామమా అధ్యాయమునకును, శ్రీదామ చరితమని ముందధ్యాయమునకును యుక్తముగానే యున్నది. ఇహపరలోక సౌఖ్య రూపమగునుభయము సమకూర్చిన పృథుకముల మహిమ యే కుచేల చరితకు జీవము.

# కుచేల కథ—భిన్న ప్రక్రియలు.

ప్రాచీనమైన దైనను నవీనమైన దైనను ఉదాత్తమైన యితివృత్తము పలువుర నాకర్షించును. ఉన్నత భావములు ఉదారాశయములు గల కవులా యితివృత్తమును దీసికొనియే గ్రంధరచన సాగింతురు. తమ జన్మ ధన్యమైనదని భావింతురు.

"యదిక్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య చరితం......జగతిక:"

అని శ్రీరామ చరితము నెందరో రచించినను తానుకూడ దానినే వస్తువుగా దీసికొనుటను సమర్థించిన కవి యుత్తమ గుణ ప్రకటనమునకు తగిన నాయకుని విడువలేకపోయియే గదా? లేక అట్టి నాయకుడు మరొకడు లేకపోవుట చేతనేగదా?

శ్రీరామ కృష్ణాద్యవతార పురుషులనే కాదు ధర్మజ హరిశ్చంద్రాదులను గూర్చికూడ పలువురు కవులు పలు ప్రక్రియాభేదములలో కృతుల నిబంధించి దేశమున కుత్తమ ధర్మముల నుప దేశముల నొసంగినారు. విభిన్న ప్రక్రియలలో వివరింపబడుటకు వస్తువులో నొక ప్రత్యేకత యుండవలయును. ప్రజలను పలురీతులుగా నాకర్షించిన యితివృత్తము దేశప్రజల భావములకు మెరుగులను దిద్దుననుట సర్వసమ్మతము. అట్టి యితివృత్తములతో దులదూగు కుచేల చరిత్రము గూర్చిన భిన్నప్రక్రియల నొక పట్టికగా దెల్పుట యత్యంతావశ్యకమగుట ముద్రిత గ్రంధములనుగూర్చిన పట్టిక వివరింపబడినది. అముద్రితమైనవి బహుళ ప్రచారములో నుండినవియునగు నితర ప్రక్రియలుగూడ గలవని నా దృఢవిశ్వాసము.

| వరుస సంఖ్య. | ప్రక్రియా భేదము | గ్రంథ నామము | రచనా రూపము | ప్రకటిత వత్సరము క్రీ. శ. | కవినామము |
|---|---|---|---|---|---|
| 1 | నాటకము | కుచేల చరిత్ర | వచనం. | 1926–27 | కొత్తపల్లి సుందరరామయ్య |
| 2 | ,, | ,, | పద్యం. | 1910 | కూచిభట్ల కుటుంబరావు |
| 3 | ,, | ,, | ,, | 1914 | శృంగారకవి సర్వారాయుడు. |
| 4 | ,, | ,, | ,, | 1910 | మాదిరాజు వెంకటరామదాసు. |
| 5 | ,, | ,, | ,, | 1896 | పి.కృష్ణారావు |
| 6 | ,, | ,, | ,, | 1899 | యన్.బంగారయ్య. |
| 7 | ,, | ,, | ,, | 1907 | మేడేపల్లి నరసయ్య. |
| 8 | ,, | విచిత్రకుచేలము | ,, | 1923 | సత్యవోలు కామేశ్వర రాయ కవి. |
| 9 | ,, | కుచేలాభ్యుదయము | ,, | 1929 | ,, |
| 10 | యక్షగానము | కుచేలోపాఖ్యానము | ,, | — | తిరుమల రాఘవాచారి. |
| 11 | ,, | ,, | ,, | 1917 | మొటపర్తి చినసోమయ్య |
| 12 | ,, | ,, | — | — | వేదాలవేంకటాచార్యులు |
| 13 | ,, | ,, | పాట | 1870 | సుబ్బులింగాచారి. |
| 14 | హరికథ | కుచేలకథ | — | 1910 | బళ్ల సీతారామరాజు |
| 15 | ,, | ,, | — | 1921 | బి.బాలాజీదాసు |
| 16 | ,, | ,, | — | 1915 | పురుషోత్తం అప్పలరాజు. |
| 17 | ,, | ,, | — | — | భానుతేజపు సీతారామరాజుకవి. |
| 18 | ,, | ,, | | 1926–27 | ఆసూరి భావనారాయణాచార్య. |
| 19 | ,, | కుచేలోపాఖ్యానము | — | — | పి.గోపాలదాసు |
| 20 | కథలు | కుచేల చరిత్ర | వచనం | 1905 | చల్లా ఎల్లమందనాయుడు |
| 21 | ,, | కుచేలుని కథలు | ,, | — | ఎ.వి.నరసింహంపంతులు |
| 22 | ,, | ,, | ,, | 1909 | అయ్యగిరి కూర్మనాథ కవి |
| 23 | ,, | కుచేలుడు | ,, | 1921–25 | సి.సూర్యారావు |
| 24 | పాటలు | కుచేలుని కథ పాటలు | పాట | — | వి.శేషగిరిరావు |
| 25 | ,, | ,, | ,, | — | శంభులింగాచారి. |
| 26 | ,, | కుచేల కథాగీతము | ,, | 1926 | రామా అండు కో., |
| 27 | పద్యము | కుచేలుడు | పద్యము | 1909 | పుణుతురుపల్లి సన్యాసిరాజు |
| 28 | ద్విపద | కుచేలుని ద్విపద | ,, | 1912 | మనప్పాకం శ్రీనివాసాచార్యులు. |
| 29 | ప్రబంధము | కుచేలోపాఖ్యానము | ,, | 1888 | ఘట్టుప్రభువు |
| 30 | ,, | ,, | ,, | 1915 | పి.లక్ష్మణకవి. |

# గ్రంథ చరిత్ర—పాఠ నిర్ణయము

ఉత్తమ కావ్యములలో నొక్కటియైన కుచేలోపాఖ్యానము క్రయమున కిప్పుడు లభించుటలేదు. ప్రసిద్ధ గ్రంథాలయములందు దీని ప్రతులొకటి రెండు దొరకును. ఉపలభ్యము లగుచున్న యచ్చుప్రతులలో మొట్టమొదటిది ఘట్టుప్రభు విరచితము—క్రీ.శ 1888లోనిది. తదుపరి తెలుఁగువారి కందించినవారు వావిళ్లవారు, 1911–1915 సంవత్సరములలో టిప్పణ సహితముగ ప్రచురింపగా, రామా అండ్ కో వారు పైవాని వలెనే టిప్పణ సహితముగా క్రీ.శ. 1927 సంవత్సరమున ప్రచురించి ప్రచారములోనికిఁ దెచ్చిరి. పై రెండు ప్రతులను జూచిన పిమ్మట ఉత్తమ పాఠ సంకలనముతో దీనిని ప్రకటించిన బాగుండునని తలంచి, ఆకవినిగూర్చి దేశ కాలాదులగూర్చి వివరముగా దెలిసికొనఁగోరి ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక 50వ సంపుటములో ఆంధ్ర సాహిత్య పరిషత్తువారి చెంత లభ్యములగు సమగ్రా సమగ్రములగు తాటాకు గ్రంథముల సహాయముతోను, ఇతరత్ర లభించు గ్రంథాధారములతోడను శుద్ధములగు పాఠములు దొరికినన్ని వెల్లడింపగోరిక యున్న దను సంకల్పమును దెల్పుకొంటిని. ఆనాటి నుండి తద్విషయమై కృషి సల్పుచుంటిని. మా తండ్రిగారి మాతామహులు క్రీ.శ. 1836 ప్రాంతములో వ్రాసియుంచిన తాళపత్ర గ్రంథము లభించి నన్ను మరింత ప్రోత్సహించినది.

కుచేలోపాఖ్యానము వంటి యుత్తమ కావ్యముల ముద్రితప్రతుల కీనాడు అంజనము వేసి చూడవలసిన పరిస్థితి దాపురించినది. అట్టి దురవస్థను గమనించి ప్రాచీన కావ్యములను పాఠక లోకమునకు పునఃప్రచారముచేయు బాధ్యత ప్రభుత్వముపై నున్నది. 'ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ' వారలవిరళ కృషిసల్పి కొన్ని గ్రంథములను ప్రజాసామాన్యమున కందుబాటులోనికిఁదేఁజూచుట ముదావహము. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పురావస్తు ప్రదర్శనశాలల శాఖ వారు ప్రాచీన గ్రంథములను జనసామాన్యమున కందుబాటులోనుండు రీతిని ప్రకటించు సంకల్పముతో నుండినటుల దెలిసి నాసంకల్పమును క్యూరేటరుగారికి తెలియపరచగా విని నాకేమియుఁ దెలుపకుండ ఏమి చేయుదురో వాచా చెప్పని గుప్తదాతలఁబోలి యీ పనికి నన్ను నియమించినట్లోక మెమోను పంపించినారు. ఈ కార్య నిర్వహణమునకు నన్ను ప్రోత్సాహపరచి, నాకొక బాధ్యత నప్పగించిన శ్రీవారికి నేను కృతజ్ఞుడను. ఆ నియామకముననుసరించి యవిరళకృషి సల్పుచున్నను సరియగు విషయములను సేకరించుటలో ఆలస్యమగుటచేత నెక్కువకాలము పట్టినది. ప్రస్తుత గ్రంథపాఠమును నిర్ణయించునపుడు వావిళ్ల ప్రతిని, రామ అండ్ కో వారి ప్రతినే గాక శక్తి ననుసరించి తాళపత్రగ్రంథముల సహాయముకూడ తీసికొన యత్నించితిని.

# తాళపత్రప్రతుల వివరణము

నేను దీసికొనిన తాళపత్ర గ్రంథములు సప్తసంఖ్యకు పరిమితములు. వానిలో నే కొలది మార్పున్న నున్నదానినున్నట్లు చూపినచో భావిలో నెట్టి యుపయోగమైన నుండవచ్చునేమో యను నుద్దేశ్యముతో వానినట్లే చూపఁదలంచితిని. ఎన్నియో పాఠ భేదములు కానవచ్చుటచేత నీ గ్రంథమును పలువురు ఆదరణ పూర్వకముగా వ్రాసికొని చదువుచుండు వారనియు, నొక ప్రతిని జూచి మరొకరు వ్రాసికొనుట చేతనే గాక లభ్యములైన పుస్తకములలోని పాఠములను యథాతథముగా వ్రాయువారనియు తోచు చున్నది. ఇన్ని పాఠభేదములతో నొప్పు గ్రంథము ప్రాచీనమైనది కాదన లేను. పరామర్శ సౌకర్యమున కాయా గ్రంథములకిచ్చిన యక్షర సంకేతములు. అ. క. చ. ట.త.ప.పా.

(అ) ఆం. సా. ప. (నం. 1402) పరిమాణము. 14″×1″. 7 పంక్తులు, 88 అక్షరములు. 7 పత్రములు. వ్రాత బాగున్నది. వ్రాయస గాని పేరు లేదు. మొదటి ఆశ్వాసములో "ధర్మమొకటె సహాయంబు" వరకే యున్నది. అసంపూర్ణము. మంచిస్థితిలో నున్నది. మొదటి పద్యము వేరొకటి యున్నది.

"శ్రీ కరుణారస సాగర—ప్రాకటలక్ష్మీకళత్ర భవ్య చరిత్రా !
లోకాతీత గుణాశ్రయ గోకుల విస్తారనంద గోపకుమారా"

(క) ఆం. సా. ప. (నం. 3458) పరిమాణము 16.5″× 1.2″. 6 పంక్తులు. 13 పత్రములు. వ్రాత బాగున్నది. వ్రాయసగాని పేరులేదు. రెండవ ఆశ్వాసములో 18వ పద్యము వరకున్నది. అసంపూర్ణము.

(చ) ఆం. సా. ప. (నం. 441) పరిమాణము 11″×1.3″. 8 పంక్తులు, 38 పత్రములు. ఈ కవి యితర రచన యగు సురాభాండేశ్వరముతోఁగలిసియున్నది. సంపూర్ణము. పందిటి గురివిశెట్టి వ్రాసెను. విజయనామ సంవత్సర భాద్రపద భానువారము. శా. శ. 1758. మంచి స్థితిలోనున్నది.

(ట) ఆం. సా. ప. (నం. 3080) పరిమాణము 17.5″×1″. 34 పత్రములున్నవి. కొద్దిగా శిథిలమైనను ప్రతి మంచి స్థితిలోనున్నది. వ్రాత చక్కగా నున్నది. ప్రతి పాతది. వ్రాయసగాని పేరు లేదు. సంపూర్ణము. దశావతార నుతి పద్యవ్యాఖ్యతోఁగలిసి యున్నది.

కొన్ని తాళపత్ర ప్రతుల యంతమందు యీ క్రింది పద్యము లుండుట విశేషము

'ప్రతిజూచి వ్రాశినాడను అతిశ్వభ్రలు వ్రాలు చూడ నన్నియు తప్పున్
యతిగణ ప్రాసము లెరుగను మతిమంతులు తప్పు దిద్ది మన్నించ రయా
యాదృశం పుస్తకం దృష్ట్వా తాదృశంలిఖితం మయా—
అబద్ధంవాసుబద్ధంవామమ దోషోన విద్యతే' అని వ్రాసియుండెను.

" వ్రాలా తప్పులు శ్రభలు చాలంగల వేను నట్టి శబ్దసంగతు లెరుగం
గేలింబెట్టక తిట్టక పోలంగా దీర్చరయ్య బుధజనులారా

గీ॥ వ్రాత తప్పువలన వాచకులలుగక తప్పు గలిగెనేని తగిల యెడల
వలయు నక్షరముల వెలయంగ నిలుపుడి సుకవులయిన వారు సుస్థిరముగ "
అనికూడ వ్రాసినది గలదు.

(త) ఆం. సా. ప. ( నం. 3454 ) పరిమాణము 15″×1.1″- 5 పంక్తులు, 35 పత్రములు. సంపూర్ణముగా నున్నది. కొమర్రాజు వెంకయ్య గారి కొమారుడు మల్లాయ వ్రాసెను. ప్రమాదీచనామ సంవత్సర కార్తీకము ఒక పత్రము లేదు. ప్రతి బాగున్నది. శా. శ.1 741 (5 1/n 11 1/n 1819 క్రీ.శ)

(ప) ఆం. సా. ప. (నం. 3012) పరిమాణము 18″×1.4″ 7 పంక్తులు, 28 పత్రములు. సంపూర్ణముగా నున్నది. మొదటి పత్రము లేదు- చాలశిథిలము. మధ్య కొంత భాగము లేదు. అనంతవరపు కామరాజు వ్రాసెను- ప్రభవ నామ సంవత్సర ఆశ్వయుజము, క్రీ. శ. 18 1/n 10 1/n 1808.

"వ్రాలాశ్రభలు తప్పులు చాలాగలవె శబ్దసంగతులెరుగన్,
గేలింబెట్టక నవ్వక పోలంగా దిద్ధరయ్య" — వ్రాతబాగున్నది.

(పా) పాలంకి నరసయ్యది. పరిమాణము 10″×1″. 6 పంక్తులు, 62 పత్రములు సంపూర్ణముగా మంచి స్థితిలో నున్నది. పాలంకి నరసయ్య వ్రాసెను. మన్మథ నామ సంవత్సరం మార్గశిరము (1836 క్రీ. శ. ) వ్రాత బాగున్నది

మా తండ్రిగారి మాతామహుల యొద్దనుండి నాకు సంక్రమించిన దీ ప్రతి

## గ్రంధస్థ శ్రుతి స్మృత్యాది రూప సంస్కృతసూక్తులు

| | పద్య సంఖ్య |
|---|---|
| గోబ్రాహ్మణేభ్యః శుభమస్తునిత్యమ్ I | 4 |
| లోకాస్సమస్తా స్సుఖినోభవంతు | 4 |
| నమోబ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మణహితాయచ | 4 |
| ( అమోఘా బ్రాహ్మణాశీర్వదా ) | 4 |
| ఆత్మవత్సర్వ భూతాని | 26 |
| స్వదేశం భువనత్రయమ్ | 28 |
| వేదమూలమిదం బ్రాహ్మ్యమ్ | 29 |
| భార్యా సమోనాస్తి శరీర పోషణ | 29 |
| అపుత్రస్య గతిర్నాస్తి | 29 |
| సతతమేకోనివాసః పట్టణంవా వనంవా (పత్తనేనావనేనా) | 29 |
| నద్వైవం కేశవాత్పరమ్ | 29 |
| సర్వేజనాస్సుఖినోభవంతు | 45 |
| సర్వం విష్ణుమయం జగత్ | 54 |
| ఆయురన్నం ప్రయచ్ఛతి | 56 |
| అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్ | 5 |
| వదాన దోషేణ భవేద్దరిద్రః | 5 |

## తెలుగులోనున్న సూక్తులు

ధర్మమె జయము ధరిత్రి నధర్మమె లయము
ఎఱుక పిడికెడు ధనము
అన్నంబునకును ప్రాణమునకు లంకె
రాజు గొట్టగ మొగసాలకు మొఱలుపెట్టు మూఢులు
ఎంత గడించిన కూటికి నెంతటివాడైన గాటికి
నేరిచి బ్రదికినవారలు నేరక చెడినట్టివారు
క్రిందాకు మీదాకు వాసిగాదె
మానవుడొకటి తలంచినఁ దానొకటిఁ దలఁచుఁగాక దైవంబు
అత్తయ నొనరించు పనుల కాఱడిగలదే
పుడమిన్జేయవు చేతులు కుడువదునోరు
తీర్థమును స్వార్థమును
సిరి చెడిపోయి చుట్టములఁ జేరిన లాఘవ మందకుండునే
ముంజేయియు నాడెనేని మోచేయాడున్
చంద్రునకు నూలిపోగన్నసామెత
కొండంత దేవునకు మరి కొండంతయుఁ బత్రియిడెడు కుశలులుగలరె
ఆస దోస మెరుగదనుట నిజము
ఇంటిదీపమనుచు నిగిలించుకొని ముద్దుపెట్టుకొన్న నోరు బిట్టుగాలు
అడవి యామలకము నంబుధి లవణంబుఁ గూడినట్టులు
భూజనంబునేలు రాజుమగండయ్యె గాజు కడియము
ముంజేతి కంకణంబునకు నద్దమేల?
కొండఁ ద్రవ్వియు నెలుకనుగొనుట
గ్రామము క్రొత్తయైనఁ దనకర్మము క్రొత్తయె?
అదృష్టహీనులకు నెచ్చటనైనను గల్గునే సిరుల్
మనసునకు మనసె తార్కాణం

పాలొల్లని పిల్లి గలదె?
గోచి పాతరాయడు దొంగల మిండడు
మీసాల మీది తేనియు
క్రొరగింజ నోరఁగొఱికియు
పావరకాయ చేదెరిగి భక్షణ సేయుట నీతియే
తేనెలో బడిన యీగయుఁ బోలె
నీళ్లనైన ముంచు నిక్కంబుగానను బాలనైన ముంచు
క్షేత్రమెఱిగి విత్తనమును బాత్రమెఱిగి దానమును
బూడిదెలో హోమము వలె, పాడింటికి నిడిన దీపపంక్తియు
తేరుక్రింద ప్రతిమ తెరఁగున సంసార భారమాని
కాకులకుఁ గాని వేములు ఘనతరముగఁ బండెనే మెండెనేమి?

## ప్రాచీనులలో తక్కువగానున్నను జక్కన వాడినవానిని జూచి

దుఃఖితే మనసిసర్వ మసహ్యమ్—(అల్లసాని)
పాపీ చిరాయు' వ న్బెడఁగు నుడుగు—(వసు చరిత్ర)
అభ్యాగత స్వయం విష్ణుః'నా—(జైమిని భారతము)
అహింసా పరమోధర్మ'యన—(విక్రమార్క చరిత్ర)
ధర్మస్యత్వరితాగతి —(యనుపురాణ వచనము)
పరోపకారార్థ మిదం శరీర' మనిన
సర్వం విష్ణుమయం జగత్త'నుట
అవశ్యం పితురాచారమ్మను
శుభస్య శీఘ్ర మనుచు—(మున్నగు సంస్కృత సూక్తులను)—
కడుఁ బేదరికంబు కంటెఁ గష్టము గలదే
దామును పెట్టనిది రిత్త దనకేలబ్బున్
రిత్తకు రిత్త ఫలించునే
చెప్పనేటికి దేవర చిత్తమింక......భాగ్యంబు
శత శతచ్ఛిద్ర జీర్ణ వస్త్రములతోడ' వంటి వెన్నియో యెన్నికకు మించిన
వానిని జూచి ముగ్ధుడై ఘట్టుప్రభువు మించి యుపయోగించెను.

## ముద్రిత ప్రతులు — వ్రాత ప్రతులు

క్రీ.శ. 1915 సంవత్సరములో అచ్చుపడిన వావిళ్లవారి ప్రతియు, క్రీ.శ. 1927 సంవత్సరములో అచ్చుపడిన రామా అండ కో వారి ప్రతియు నాకుఁ దొరకినవి.

మద్రాసులో ప్రస్తుతము మనకు లభ్యములైన తాళపత్ర ప్రతులు, వ్రాత ప్రతుల వివరణము —కుచేలోపాఖ్యానము— వ్రాత ప్రతులు—461 నుండి 468.

1. వికృతినామ సంవత్సర ఫాల్గుణ బహుళ ౧౦ బుధవారము.
   లేఖరి మామిడి వెంకటలింగము (R151) క్రీ.శ. (1771)

2. 464. బ్రౌను దొరవారి సూచి.

"This book contains the Kuchelopakhyanamu, a very popular Telugu poem, and the various readings found in nine manuscripts are here in recorded with a view to the preparation of the new edition since completed'.

C. P. Brown

3. సర్వజిత్తునామ సంవత్సర పుష్యశుద్ధ ౧౨ శనివారము R 811
   నెలకంటిరామయ్య—లోకమెచ్చు వెంకటరాజా ప్రతినిబట్టి వ్రాసినది
   సురాభాండేశ్వరము (R158) (1768 క్రీ.శ.)
   కాళయుక్తి సంవత్సర మార్గశిర శుద్ధ్యలు జయ వారంరోజ్జు (1738 క్రీ.శ.)
   వింజమూరి పుల్లయ్య వ్రాసెను.

   ఈ తాళపత్ర ప్రతుల కాలముల బట్టి పొట్టుప్రభువు క్రీ.శ. 1730–1780 ప్రాంతముల నున్నవాడని నిశ్చయముగ చెప్పవచ్చును అని నిడదవోలు వేంకటరావుగారు వివరించి యున్నారు. వానిలోను పాఠభేదములుండవచ్చును. క్రీ.శ. 1827 ప్రాంతములో నిట్టి యుత్తమ గ్రంథమునుగూర్చి వ్రాసిన బ్రౌనుదొరగారి సంకల్పమును బట్టి కవి ప్రాచీనత, కావ్య గౌరవము, కవితలోని ప్రత్యేకత వేరుగా దెల్పనవసరము లేదనుకొందును.

# కావ్యభేదములు

కావ్య స్వరూపము, కావ్య హేతువు, కావ్య ప్రయోజనమును వివరించిన సంస్కృతాలంకారికులందరు కావ్యమే సకలపురుషార్థసాధనమని నిర్ణయించినారు. అది సత్కావ్య విషయమని వెల్లడించుచు కావ్యభేదములఁగూర్చి కొంత తెల్పియున్నారు. ఇది యొక క్రమ పరిణామమనిగాని, కవుల దృక్పథము మారుచున్నందున ప్రజాదరణమును పొందుటకట్టి విధమవలంబింప వలసివచ్చెననిగాని, తన్మూలమున నట్టి భేదములుదయించెనని గాని తెల్పనీలుకన్పింపదు. ఒక కవి కవితలోనే ఉత్తమ, మధ్యమ అధమ కవిత్వముల లక్షణములు కన్పించు చుండుటచేత ప్రత్యేకాభినివేశముతో గాక యాదృచ్ఛికముగానట్టి భేదములు కల్గినవనలేము. కిరాతార్జునీయ శిశుపాలావధాది కావ్యములు పరికించునపుడు ఆ కవులు చూపిన చిత్ర కవిత్వము పని కట్టుకొనిచేసిన దేయనిపించును. తనకట్టి శబ్దశక్తి కలదని చాటుటకు వ్రాసిన శ్లోకములకర్థము వ్యాఖ్యాన రూపమున వివరించిన గాని తెలియరాదు. ఏకాక్షర నిఘంటువులు,నానార్థ కోశములు సహాయము చేసికొని పదచ్ఛేదము చేసి యర్థమును దెలిసికొనవలయును. ఇది యొక విధమైన క్లిష్ట సమస్యయే. సంస్కృత కవులు చిత్రబంధ కవిత్వాదులు చేసి ప్రజాదరణమును పొందియుందురు. కాని ఆలంకారికులొక కొంత చిన్నచూపు చూచి పైకావ్యములలో వ్యంగ్యాదులు లేనిచో మధ్యమ అధమ కావ్యములలో పరిగణించి రనవలయును

సంస్కృత కవులననుసరించు తెలుగు కవులు కూడ వారివలెనే యధమ కావ్యశ్రేణికిఁజెందు చిత్ర కవిత్వాదులకై ప్రయాసపడినట్లు వారు చెప్పుకొనిన పద్యములు చాటు చున్నవి. అది తమ ప్రతిష్ఠను వెల్లడించుననుకొనుట చేతనే ప్రత్యేకాభిమానముతో బిరుదముగా కూడ వర్ణించుకొని యున్నారు. అట్టి కవిత కవులకు ఘనత చేకూర్చుననుకొనువారు కొందరు, గారడీవాని జాతికిజెందుదురే గాని గౌరవ స్థానములభింపదని కొందరు నందురు. తరువాతి కవులు దానిని తిరస్కరించక గౌరవప్రదముగా నెంచినట్లు భావించిరనవచ్చును. జక్కన తాతపెద్ద యామాత్యుడు ఘటికామాత్రములో శతకము చెప్పగల వాడననినాడు. 'జగత్ప్రాణ నందన కారుణ్యకటాక్షలబ్ధకవితాధారా సుధారాశి సంజనితైకైకదిన ప్రబంధ ఘటికాసదృశ్మత గ్రంధకల్పనా' అనియు 'శతలేఖినీ పద్య సంధానధౌరేయు ఘటికాశత గ్రంధకలనధుర్యు' అనియు మూర్తికవి చెప్పకొనినాడు.

'భ్రమరాంబికావర ప్రభవదివ్య కవిత్వ విద్యా ప్రవీణత వెలసినాడ
ఘటికాశత గ్రంధ ఘటనా సముచిత చాతుర్య మహిమకుఁ జాలినాడ.
ప్రౌఢిమనేకైక పక్షమాసమహాప్రబంధ కల్పనశక్తిఁ బ్రబలినాడ'—ఘట్టు ప్రభువు.

జక్కనకు సుమారు ఏబది సంవత్సరములకు పూర్వమే ఆంధ్ర భాషలో కవుల హమహమికతో నొక్కొక్క క్రొత్త ఫక్కికి మార్గదర్శకులైనట్లు కన్పించుచున్నది. జక్కన తన తాత ఘనతను చాటుచు 'అవధాన కవిత్వ నిపుణుడని' పేర్కొనుటయే గాక అన్ని విధముల అవధానములయందును వితరులనుమించి యవధానములొనరించు

దక్షుడని తెల్పెను. కంకంటిపాపరాజు కాలములో సమకాలీకుడైన హరిభట్టు 'అష్ట ఘంటావధాన విశిష్ట బిరుద' అనినాడు.

'ఎవ్వడేయవధాన మెఱుంగు నయ్యావధానమున వానికించుకముల్లు సూప' అని నాడు. వృత్తకందము, కందవృత్తము, చతుష్కందము మున్నగు గర్భకావ్యవర్గ నిర్మాణ కుశలుడు. ప్రబంధములు లిఖించు ప్రతిభావంతుడు. అక్షరచ్యుతక, మాత్రాచ్యుతక, బంధచ్యుతకములును, నామగోప్య, క్రియా గోప్య, భావగోప్యములుగా పద్యములు చెప్పుటయందు చతురుడని జక్కన తెల్పుటచేత ఆంధ్రభాషలో ఆశు, బంధ, గర్భ, చిత్ర, కవిత్వములను చతుర్విధ కవిత్వములు నేర్చిన కవీశ్వరులుండెడి వారనితోచును.

'ఆశు ప్రబంధబంధాభిజ్ఞ...శుభమూర్తి నామధేయు' అని మూర్తి కవియనగా 'ఆశు మధుర చిత్ర విస్తార కవితా విజృంభణస్తంభిత బాణభవభూతి కాళిదాస ముఖ్య' అని పింగళి సూరన యనినాడు.

'మరియు నాశువు చిత్ర మాధుర్య వాక్య ప్రగల్భనంబున నుతుల్ గాంచినాడ' అని ఘట్టు ప్రభువు దెల్పుకొనినాడు. ఏమైనను ఆశుబంధ గర్భ చిత్రకవిత్వము, ఆశు మధుర చిత్ర విస్తర(=ప్రబంధ) కవిత్వము చెప్పగలుగుట యొక గొప్పశక్తిగా భావింపబడెడిదనవలయును. విస్తరమో—విస్తారమో, విస్తర కవిత్వమన ప్రబంధ కవిత్వము. ఆశు మధుర కవిత్వములవలెనే యీ విస్తర కవితకూడఁదాత్కాలికముగా రసికులనానంద పరుపఁజెప్పనొక విధముగా కవిత్వమే. ఏకైక దిన ప్రబంధ—ఘటి కాసదృశ్శత గ్రంధ కల్పనలకన్న ప్రబంధ కవిత్వము స్థిరముగా నుండెడునని మహాప్రబంధ కవిత్వమునకు బూనుకొనెడివారు. చతుర్విధ కవిత్వములను మాత్రమాశువుగా చెప్పుచుండువారు. ఏకైక దిన ప్రబంధ కల్పన రసవంతమై యుండుననుట సందిగ్ధము. ఆశువుగా చెప్పవానికి స్థిరత యసంభవము. పూత మెరుంగు వంటియే యొక్కకవి దో ప్రసిద్ధి గాంచినదిగాని యెందరెన్ని యాశువులల్లినారో అవన్నియునిలచినవా? ఘటికాశత గ్రంధ కలనాదులు కొన్ని విస్తృతిగలవై యుండునుగాన నట్టి వానికే విస్తరమనియో విస్తారమనియో వ్యవహారముండినను నుండవచ్చును.

వసు చరిత్ర రచనా కాలమున కట్టి తత్కాల చమత్కార జనకములగు చిత్ర కవిత్వ రచన లందాస్థతగ్గి ప్రబంధ రచనాసక్తియధికమైనదన వచ్చును. జక్కన విక్రమార్క చరిత్రములో ఎఱ్ఱననుస్తుతించుచు 'విరచించె శబ్ద వైచిత్రి నరణ్యపర్వమున శేషము, ఆ చిత్ర కవిత్వ వాగ్విభవజృంభితుఁ గొల్చెద భక్తియుక్తితోన్' అని ప్రశంసించెను.

కావ్య మెట్లుండవలయునో కుకవి నిరసములో దెల్పియున్నాడు—

'నవ శబ్దార్థ రసానుబంధ పదవిన్యాస క్రియా భావగా
రవ పాక ధ్వనిరీతి శయ్యలుఁ గవీంద్రశ్రేణి కావ్యాళిజెప్ప'

'నవ నానారస భాస్వరార్థ పదవిన్యాస క్రియాలంక్రియా
శ్రవణానంద కథా సుధామయ మహాసారస్వతాంబోధిలో
నవలీలన్ విహరించు తదుజ్ఞలు'

'కృతి నొక పద్యంబతి మూఢుడైనఁ జిత్రతఁ బ్రతిపాదింపఁడె ఘుణాక్షర న్యాయమునన్' అని ప్రతి పద్యము జోద్యముగా నుండ వలయుననినాడు.

'ప్రతి పద్యమునందు జమత్కృతిగలుగఁ జెప్పనేర్తు' వని చేమకూరను కొని యాడెను. తిక్కన 'ఉభయ కవిమిత్ర' అని పేరొందినాడు. 'అఖిల కవిమిత్ర' బిరుదమును జక్కనవాడగా ఘట్టు ప్రభువు 'సకల కవిమిత్ర, సరస కవిమిత్ర' యని పేర్కొనబడినాడు. ఒక్కొక్క కాలములో నొక్కొక్క విధమునకు ప్రాధాన్యము వచ్చుచుండుట సహజము. ఆయా కాల నిర్ణయమున కిట్టివి కూడ గొంతవరకు తోడ్పడుటకలదు.

## కవితావైశిష్ట్యము

నిఖిలాభ్యుదయములకు కావ్యమే హేతువను ఆదికవి నన్నయ 'సారమతిం గవీంద్రులు ప్రసన్నకథా కలితార్థ యుక్తి .........అక్షర రమ్యత......నానారుచిరార్థ సూక్తి నిధి............తెనుంగునన్ మహాభారత సంహితారచన బంధురుడయ్యె, జగద్ధితంబుగన్' అను పద్యమున తనకొక బిరుదమును దవిలించుకొనెను. దానిని సార్థక పరచుకొను రీతి కవితను వెలయించెను. అక్షర రమ్యత, ప్రసన్నకథా కలితార్థ యుక్తి ప్రకటించెను. ఆతని ననుసరించిన కవులు తమ కవితలోని ప్రత్యేకతను కృతి భర్తచేతగాని, వంశ వర్ణనమునందుగాని బహిర్గత మొనర్చి తమ రచనలకు విశిష్ట స్థానమును సంపాదించుకొనిరి. నవీన గుణసనాథ, చిత్ర కవిత్వ వాగ్విభవజృంభిత నవశబ్దార్థరసానుబంధ.........కావ్యాళి 'జెప్ప' వంటి లలితాంశము లను ప్రకటించిన కవులు తమ కావ్యరచన నా నియమానుకూలముగనే సాగించిరి. సామాన్య విషయములను గాక యసాధారణ విషయములనే వెల్లడించునపుడు విశిష్టత వ్యక్తముకాగలదు. పరిణతభావము, ఉక్తిచమత్కృతి, పదలాలిత్యము, ప్రసన్నత మున్నగు లక్షణములెన్నియో గలసిన వాక్యములు ప్రజల నోట నృత్యముచేయుచు సామెతలుగా చెల్లుబడియగును. అట్టివి గ్రంథమునకు ప్రత్యేకతను గల్గించును. పదబంధము, నుడికారము, పలుకుబడి, లోకోక్తి, సామెత వంటివి ప్రజాదరణకు హేతువులు. త్రికాలాబాధ్యము, నిత్యము, సత్యమునైనయే యుపదేశమునందింపదలచెనో అది ప్రజా సామాన్యమునోట వాడవాడల బహిర్గతమగుచో స్థిరముగా మానవహృదయ ములలో నాటుకొని పోవును. తన్మూలమున ధర్మ ప్రబోధము జరుగుచుండును. సంస్కృతి నిలిచినందున మానవులు దానవులుగా గాక సన్మార్గ ప్రవర్తకులుగా జీవ యాత్ర సాగించు కొందురు.

ఘటుట్ట ప్రభువుకూడ సకల కవి మిత్ర, సరసకవి మిత్రయను బిరుదములను మాత్రమే గాక 'పూర్వకవి ప్రయోగ శబ్దానుబంధబంధుర' యను విశేషణమును గూడ వాడుకొనెను. కాని ప్రాచీనులైన తెలుగు కవుల పేరెత్తనైనలేదు. 'తేట తెలుగున నతుల మృదుల సరస మాధుర్య వాక్యముల్ సంఘటించి— కవుల కరుణా విశేషంబు కలుగు కతన' అని కవుల కరుణకు పాత్రునిగావెల్లడించుట కొంత వరకు ప్రాచీన కవులపై తనకు గల గౌరవము ప్రకటితమైనది.

భ్రమరాంబికా వరప్రభవదివ్య కవిత్వ — మున్నగు పద్యమున 'సత్కవీశ్వరకరుణా ప్రసాదవశుడ' అని పేర్కొనుట సముచితముగానేయున్నది. భ్రమరాంబాకర కవితోద్యమ విలసద్వర్ణసముదయాంకిత జిహ్వాసుమహితుడ' నని భ్రమరాంబ కృపకు పాత్రుడైన కవిగాన కవిత్వములో దైవశక్తియేగాని నా సామర్థ్యముకాదని పోతన రీతి తెల్పుట ప్రశంసా పాత్రము.

'అవని సురభామినియొ బోలెనర్ధరాత్రి స్వప్నమున వచ్చి కరుణా ప్రసాదమునను గవిత నాకు నొసంగు శ్రీ కంఠ సాధ్వి 'భ్రమర' విను తింతు లలితవాక్ప్రౌఢిమమున' 'భ్రమరాప్రసాద వాక్యము లమితములుగమెరయుఁగాక యధిపుల సభలన్'

"ఏఁ ప్రబంధమురచింపనెదనుబూను నపుడె సాక్షాత్కరించి చిత్తాంబుజమున భ్రమర నిలిచి సృజించు సద్భూషణముల నస్మదీయ ప్రసంగమెందైనగలదే"
'అంబా ప్రసాద మహిమ విడంబింపగ కలవె యతి సుధావిస్ఫురణల్' మున్నగు పద్య భాగములలో భ్రమరాంబికా వరప్రభవ దివ్య కవిత్వ విద్యా ప్రవీణుడుగా వెల్లిడించుకొనిన యీతని కవితలోని విశిష్టత సర్వత్ర చూడగలము. కుకవి నిరసన సందర్భమున జక్కన 'ప్రతిపద్యము చోద్యముగా గృతిచెప్పిన నొప్పుగాక కృతినొక పద్యం బతి మూఢుడైన జిత్రతప్రతిపాదింపడె ఘుణాక్షరన్యాయమునన్' అని తెల్పుచు శారదా దయావిధేయుడైనందున 'స్వాభావిక నవకవితా ప్రాభవముల నుభయభాష ప్రౌఢిమన్‌జెప్పన్ భూభువనంబున సరిలేరా భారతినీవు దక్క నన్నయ జక్క' అని కృతి భర్తచే ననిపించుకొనినందున 'చక్కననీవైదుష్యము మున్నగు' పద్య ప్రశంసకు పాత్రుడైనట్లుగనే ఘట్ట ప్రభువుకూడ భ్రమరాంబా కరుణకు బాత్రుడై రచించిన కవిత్వముగాన ప్రజల స్తుతికి పాత్రమయ్యెననుటసత్యము. శ్రుతి స్మృత్యాదుల నుండు సూక్తులనేగాక లోకోక్తులను సమయానుకూలముగా నుపయోగించి తనకవితకు విశిష్టతను కల్గించుకొనెను. ప్రజావాణితో కలసి శాశ్వతముద్రవైచునని గ్రంథములో బహుళముగా నున్నవి. 'తినబోయి రుచియడుగుట' యెందులకు.?

'కల్పవృక్షమునకుఁ గదిసికాయడిగిన చందమునను శౌరి సమ్ముఖమునఁ జేరి తుచ్ఛమైన సిరివేఁడి కొననయ్యె నాసదోసమెఱుఁగ దనుట నిజము' 1–119

'ఇంటిదీపమనుచు నిగిలించుకొని ముద్దుపెట్టుకొన్న నోరు బిట్టుగాలు నృపుల సమ్ముఖంబు నెనరు లెంచుచుఁజను వాడు మిగులఁబరిభవంబునొందు' 2–33

'తరణిరాక కలరు సరసిజంబును బోలెఁ
జంద్రురాక కెలమి సంతసిల్లు
ధరఁజకోర మట్లు ధారుణీసురనీదు
రాక కలరెవింత లేక శౌరి' 2–61

'పెన్నిధానంబుఁ బొడఁగను పేదవోలె
దప్పిగొని నీరు గనిన బీదయును బోలె
వఱదఁబోవుచుఁ దరిఁగన్న పిరికివోలె
హర్షమును బొందెమిగుల నయ్యవని సురుఁడు' 2–66

'ఉప్పునీటిలోన నుంచిన కరణిఁ గ
ర్పూరము వీతి పోత్రు నొఱసినట్లు
వారిరాశిఁ బడిన వడగండ్ల కైవడి
శౌరియందు మనము సంఘటించె' 2–73

'అఖిల రాజ్యమేలు హరిసఖుండయ్యునా
చెనఁటి భూసురుఁడు కుచేలుఁడయ్యె
భూజనంబునేలు రాజుమగండయ్యు
గాజుకడియమనెడి గతిపెలంగ' 2–110

'ఎంత దవ్వుల నుండి యో యేగుదెంచి
కడెడు మెతుకుల కై యింత కష్ట పడెడుఁ
గటకటా ! యమ్మహీసురాగ్రణి విధంబు
కొండ ద్రవ్వియు నెలుకను గొనుటయయ్యె' 2–112.

'ఈ లోకంబున రాజ్యము
లేలన్ గల్గినను జ్ఞులు నెంత విరక్తుం
డేల విసర్జన సేయును
బాలొల్లని పిల్లిగలదే పరికింపంగన్ 3–18

'మ్రాకులోని చేవమాడ్కిఁ బూసలలోని
దారమట్ల శిలల తతులలోని
లోహము విధముననులోకంబు జీవుల
లోననందు నెందుఁగానరావు' 3 – 39

'తరువునఁబుట్టిన యనలము
తెరఁగున దధిఁబొడముఘృతము తీరున మదిలో
నరయఁగ యోగీశ్వరులకు
నరగునఁబొడసూపుదువునిజముగ ముకుందా' 3 – 40

'సకలదుఃఖములకు జననస్థలములైన
యిహసుఖంబు లిచ్చయింప దాత్మ
పరమపదము నీదుపాదపంకజములఁ
జేర్చుకొనుము నన్ను శ్రీనివాస' 3 – 76

'కాకులకు గాని వేములు ఘనతరముగఁ
బండెనే మెండెనే' మన్న పగిది నతిధి
బాంధవులకు గాని సంపదలు నరుల
కుండెనేమియు మరియు లేకుండెనేమి' 3 – 01

సంస్కృత శ్లోకములను తన కవితగా దలపింపజేయు రీతి తెనుగులో రచించెను

'పరగఁగను ఋణాను బంధ రూపంబులు పసులు సుతులు హితులు భామినులున సంతతంబు వీరి సంయోగములకు వియోగములకు జింత నొందఁదగదు 1–64

శ్లో: ఋణానుబంధ రూపేణ పశుపత్ని సుతాదయః
ఋణ క్షయే క్షయం యాన్తి కాత్ర పరివేదనా? ॥

'ఆత్మ బుద్ధియె కడ సుఖంబన్నటికిని జెలఁగిగురు బుద్ధి కొంత విశేషమరయు బరుల బుద్ధి వినాశంబు పరఁగఁజేయ స్త్రీల బుద్ధులు ప్రళయమురిత్త గింప, 1–115

శ్లో : ఆత్మ బుద్ధి స్సుఖంచైన గుర బుద్ధిర్విశేషతః
పరబుద్ధిర్వినాశాయ స్త్రీబుద్ధిః ప్రళయంకరీ ॥

" ఈతని కవిత్వ మంతగా నిర్దుష్టమయినదియు, ప్రౌఢమయినదియుగాక పోయినను, మంచి లోకోక్తులతోను, న్యాయములతోను నిండి యుండి ద్రాక్షా పాకమును జదువువారి కింపుగా నుండును." అని కందుకూరి వారు తమయుద్దేశ మును వెల్లడించిరి. " ఈతని కవిత్వము నందచ్చటచ్చట గొన్ని దోషములున్నను శైలి మృదువై పెక్కు సంస్కృత లోకోక్తులును, ఆంధ్ర లోకోక్తులును గలిగి చదువరులకు మనోహరంబై యున్నది" అని వావిళ్లవారు పీఠికలో వ్యక్త పరచి యున్నారు. వీరు దోషములుగా నెంచునవి సహజముగా కవిచే చేయబడినవా లేక వేరేదైన ప్రమాదజనితములాయని సంశయము కల్గుటకు మార్గ దర్శకులు రామా అండ్ కోవారు.

" ఈ గ్రంథమున గొలది ఛందోవ్యాకరణాది లోపములు గన్పట్టుచున్నవి. అవి గ్రంథ కర్త లోపములు కావనియుఁదర్వాతి వారా ప్రతిని వ్రాసికొనుటలో దొరలిన నెరసులనియు నమ్ముచున్నారము" అని స్థూలముగాననినారు. ఇన్ని ప్రమాదములున్నవనిన నాగ్రంథకర్త ఛందోవ్యాకరణాది జ్ఞానమునకు కట్టు వడక సహజ ధోరణిలో రచించెననుటకన్న నాతని కాలములో నట్టి ప్రయోగములను సమ్మతించు నాచారముండెడిదనిన సరిపోవును గదా? శబ్ద ప్రయోగములు కూడ వింతగానున్నవి.

## ఛందోవ్యాకరణాదికము

గోదావరి తరంగముల వలె పొంగి పొరలివచ్చు భావ పరంపరను ప్రకటింప దొరకొనిన కవి లోకము, స్వేచ్ఛగా ముందునకు సాగకుండ బంధించు శృంఖలల వంటివి ఛందస్సు, వ్యాకరణములని, వాని నుండి విముక్తి నందిననే కవులుత్తమ రచనలను దాత్తముగ సాగింప గలరని కొందరి తలంపు. ఆ దిగ్బంధము నుండి విడివడిన కవులనే "నిరంకుశాః కవయః" అను వాక్యము రక్షించు చున్నది. అనగా ఛందస్సు వ్యాకరణములొక్క త్రోవ చూపగా ఆ గట్టుల మధ్యనేయిమిడి, ఆ ప్రాత నియమములకు కట్టువడి తమ వ్యక్తిత్వమును చంపుకొని, యతిప్రాసలకై మతిపోగొట్టుకొని, వాని కొరకై మారుమూల పదములను, అర్థ రహితపదము లను వాడి పద్యరచన సాగించుటయా ? హృదయములో నుండి పెల్లుబికివచ్చు భావావేశయుక్త రచనను విశృంఖలముగా వ్యక్తీకరించుటయా? ఏదియో యొక నిర్ణయము కావలయును. వేద కాలము నుండి వేలకొలది సంవత్సరములలోని కవులెవ్వరు నిట్టి భావమును వెల్లడింపక పోవుటలో వారంధపరంపరగా పయనించి నారనవలయును. లేక వారికిట్టి యూహయే పొడమలేదనవలసి యుండును. వ్యాకరణ జ్ఞానము ఛందస్సునకు కళ్లెము వంటిది. ఛందస్సును పాటింప వలయునేగాని ఛందో భంగము చేయరాదు. దాని కొరకే 'అపిమాషం మషంకుర్యా ఛందోభంగం నకారయేత్త'ను వాక్యము వెల్వడినది. 'కిసాలయంకిసలయంకిసలం కిసం' వంటి పదజాలము కవుల రక్షణ కొరకే. త్ర్యంబక శబ్దమును 'త్రియంబక' అని వాడినందుననే కాళిదాసును నిరంకుశుడనినారు. వ్యాకరణ ఛందో నియ మముల నెరుంగక కవి రచన సాగింపవచ్చును. అది కూడ శ్రుతికింపైయున్న ప్పుడు ఛందస్సునకు కట్టుబడుచునే యుండును. వ్యాకరణ దోషములు దొర్ల

వచ్చును. లాలి పాటలు జోల పాటలు మొదలగు జానపద సాహిత్యములనను సరించి, శ్రుతి సుఖముగ సాగుచునే యుండునుగదా ?

యతి ప్రాసలు గణములు కూడ లక్ష్యింపక రచన చేసి యానందించువారి కన్న నియమములకు కట్టువడి రచనల సాగించువారే సర్వ కాలము శాశ్వత ముద్ర వైచు కవిత్వమును నిల్పగలరనుట ప్రసిద్ధాంశము. ఏ ఒకటి రెండు తావులలో అనాలోచితముగా ఏవేని నెరసులు దొరలినచో నంతమాత్రమున నాతని నిరంకుశుడన నక్కర లేదు. తెలియక చేసిన తప్పు అనుట కన్న ఆ తరుణమున ఆ పదమే ఆతనికి నచ్చినదని తలంప వచ్చును. అలాగని ఎవరికి నచ్చిన పదములు వారు వాడుచూ పయనించిన శబ్దజాలము పెరుగును గాని మూలపదము స్వరూపమే మారిపోవచ్చును. నిఘంటువు లెప్పటికప్పుడు నూతన పదములను సేకరించుకొని, పూర్వపద స్వరూపమును గూడ వివరించుచుండవలసి యుండును. ఉదా : వలవదు, అను పదము వల్వదు, వలాదు వలదు, వల్దు, వద్దు గా మారి ఒద్దుగా ప్రయోగించుట గమనింతుము 'మాకొద్దీ తెల్ల దొర తనము' అని వాడిన కవి నిరంకుశుడా ? భావమును స్ఫురింపజేయుటకు తగినందున కొన్ని పదములిట్లే మారుచుండును.

ఛందో వ్యాకరణ జ్ఞానము కలిగియు నియమ రహితముగ కవిత్వముచెప్పిన వారే నియమ సహిత కవితలనల్లి లోకుల మెప్పులనధికముగానందుట గమనార్హము. కమ్మెచ్చున పెట్టి లాగిన బంగారు తీగకును దాగలి మీద పెట్టి సాగకొట్టిన తీగకు నెట్టి భేదముండునో అట్టి భేదము కనబడును. సామాన్యునకా భేదము గోచరము కాకపోవచ్చును.

ఘట్టు ప్రభువు రచనలలోని విశేషముల చూపకున్న నేదో ఒక లోపముగా తట్టినందున కొన్నిటిని వివరింపక తప్పని సరియైనది.

## యతి ప్రాసలు

మూడు నాల్గు తావులందు యతి తప్పినట్లున్నది. అది లేఖరుల ప్రమాదమో కవి చేసినదియో ?

"అంబా ప్రసాదమహిమవి
డంబింపక కలవెయతి సుధావిస్ఫురణల్" 1–11

'మనకుంబెక్కు పిరుల్ ఘటించుఁగడు సమ్మానించు గాదేనిత !
ద్వన జాతాక్షుని పాద పద్మముల—ప్రేమంజూచినంజాలదే' — 1.47.

"ఎన్ని తనువులో తలిదండ్రు లెందఱైరో
వశముగాదటు తెలియ జీవులకు నెల్ల" 1–68

"పాసగదటు తెలియంగ జీవులకునెల్ల"—అని పాదమున్నది
"రోవశము గాదు తెలియని జీవులకును' అని ప్రాస యతితో నున్నది
"వశముగాదట తెలియజీవాళికెందు' అని కూడనున్నదట.

అట్లే 'తద్వనజాతాక్షుని పాద పద్మముల దేవన్ జూచినంజాలదే, యనియు 'తద్వనజాతాక్షుని పాద పద్మముల సేవల్ జేసినంజాలదే' యనియు పాదములం

కన్పించుచున్నవి. మొదటి దాని విషయమే గుర్తింప వలయును. మధురగతి రగడలో 'అలకాపురమునకన్న రహించెను.' అనుచోటయతి అప్పకవ్యాదులంగీక రించినదే. ఈ రగడ రచన కూడ, కవి ప్రాచీనుడనును.

రచించునది వ్యాకరణ గ్రంథమయ్యును ఛందో విషయమును గూడస్పృశించుటలో నన్నయ చిన్నయాదులు ఛందస్సునకు, ముఖ్యముగా యతిప్రాసలకు ప్రముఖ స్థాన మిచ్చినారనక తప్పదు. సంస్కృత కవులు శబ్దాలంకారములకు మోజు పడినట్లు ప్రాస విషయమై తెలుఁగు కవులు మొగ్గుచూపియున్నారు.

1''పాదంబునంబ్రథమ ద్వితీయాక్షరములు వళిప్రాసంబులు నాఁబడు''.
''యవలలు లఘ్వలఘులు మైత్రింబోరయు రేఫంబులు పొరయవు.''

ఇవి రేఫలు, ఇవి శకట రేఫలు అని లాక్షిణికులు వర్గీకరించి సూత్రిం పకున్నను రేఫఱకారములకు యతిప్రాస మైత్రి కూడదని నిరూపించుట మాత్రము వారి దృష్టిలో ముఖ్యాతి ముఖ్యము. అట్లే సూరికూడపై సూత్రముల మూలమున ఏ శబ్దములందలివి రేఫములోయెందలివి శకట రేఫములో వివేచించి నిరూపింపకపోయిననూ, రేఫఱకారము లకు మాత్రము మైత్రి చెల్లదని స్పష్టముగా వచించియున్నాడు.

అప్పకవి ప్రాస విషయములో గొంత వరకు నియమములను సడలించిన వాడయ్యు రేఫఱ కారములకుఁజెల్లదనినాడు. దానిననుసరించి రేఫఱకారములకు ప్రాస వేసిన ప్రాస వైరమని పేర్కొనినాడు.

పాదమున ప్రథమ ద్వితీయాచ్చుల నడుమ నుండు వర్ణము గాని, వర్ణ సముదాయము గాని ప్రాసము. ప్రాస పూర్వాక్షరమునకు లఘుత్వ గురుత్వములు తుల్యములై యుండుట ముఖ్యము.

ఖండా ఖండ ప్రాసము సంయుతా సంయుత ప్రాసము, వికల్ప ప్రాసము, ఉభయ ప్రాసము, అనునాసిక ప్రాసము, ప్రాసమైత్రి ప్రాసము, స్వవర్గజ ప్రాసము, ఋ ప్రాసము, అభేద ప్రాసమని తెల్పుచూ రేఫఱకారములకు చెల్లదు. రెంటికి వేసినచో ప్రాస వైరమనుట గుర్తింపనివాడా ఘట్ట ప్రభువు ? పోతనాదులు కొందరట్లు చేసి యున్నందున తానుకూడ నా ప్రాసమును వాడియుండెను. ఏదో ఒకటి రెండు తావులందు గాక పలుతావుల నున్నందున నాతని యభిప్రాయమున రేఫఱ కారముల భిన్నములనుటయే తోచును.

ఉదా : తరుణీ ! పూర్వభవంబున
గురిమీఱఁగ జేసినంత కుడుతురు పిదపన్
నరులీ జన్మంబునఁ గడు
దురటిల్లఁగనేల — — 1—54

2. తరుణులఁ బుత్రుల మిత్రుల
మరువక పోషించువాఁడు మరణంబైనన్
మరియుంచరు తమవారని
కరుణ యొకించుకయు లేక కాలుతురు తుదన్ 1— 72

3. గుఱుతుగ వినియుభిమన్యుని
   వరతనయుఁడు శుకునిఁజూచి వాంఛలునిగుడన్
   బరికింపగ నెట్లయ్యెడుఁ
   దరువాతి మహాకథా విధానంబనినన్ 1–122

రేఫఅకార ప్రాసము పలుతావులలో నున్నది. తెలిసివేసినదే కాని తెలియక కాదు.

శ, స ప్రాసము — సహజములు గాక ఆదేశముగా వచ్చిన షకారణకారములకు సకారనకారములు ప్రాస చెల్లును. ఉభయ ప్రాసమని పేర్కొని విషమ, అసమ — ప్రణతి, వినతియుదాహరించుట చేత సకారషకారములకు ప్రాసమైత్రి చెల్లు చున్నందున శ, స ప్రాసము మాత్రమేల చెల్లకూడదని తలంచియుండును. ఆకాశము— ఆకసముగా, ఆశ — ఆసగా మారుచున్నందున శ, సల సంబంధమును బట్టి వాడి నాడనవలయును. విచిత్ర రామాయణకర్త వంటి వారనేకులు వాడి యుండుట కేది యో హేతువుండవలయును.

ఉదా : ఆశీర్వాదంబులు మీ
కోసుజన శ్రేష్ఠులార యుత్తములారా !
వాసిగ శ్రీవల్లభునకు
దాసులరై నార లెంత ధన్యులొ జగతిన్ 2–16

ద,ధ, ప్రాసము—దీనిని స్వవర్గజ ప్రాసమనినారు — " కాదనక ......బోధన"
థ, ధ ప్రాసము — సధనులకడకు అధనా......యని

ఉదా : అది యెఱిఁగియు నీరీతిని
బదపడి యాయూరి యూరి పథముల వెంటన్
బెదరక వచ్చితి నేటికి
సధనులమె ప్రయాణములకు శక్తులమెతగన్ 1–116

సంయుతా సంయుత ప్రాసము :—

ప్రాసముగా నున్న సంయుక్త వర్ణము కొసను రేఫలకారములున్నచో అవి అంతట మరావక్కరలేదు. తండ్రి — వెండి, బండ్లు, — దండు వంటివి. కాని

'చాలంజింతిలు చుందువు
దాళక నామదిని నీదు దర్శనమునకున్
బాల్య స్నేహవియోగము
లేలాగుననైన దుఃఖ హేతువులుగదా ! 2–81

ఇందు రెండవ పాదమున అభేద ప్రాసమున్నను మూడవ పాదమున ప్రాసము తప్పినదనవలసి వచ్చును.

"బాల స్నేహ వియోగముల"ని పాఠములున్నందున యుక్తమగును. ప్రాస విషయములో నెన్నియో వివరింప వలసియున్నను ఒక్కటి మాత్రము తప్పక తెల్పుట విధి.

" ధారుణిలోన ననాథుల
కే రీతినినైన శ్రీరమేశ్వరుడే యా
ధారమగు 'దుర్బలస్యబ
లంరాజా'యనెడు మాటలను నిలవినవే ?        1–76

నాల్గవ పాదములో ప్రాస పద్ధతి విచార్యము. ఇట్టిది పొరపాటున సాహసము. రమణీయము వంటి గ్రంథములో నిట్టి ప్రయోగము నీరీతిగనే చూపించుటచేత వారు కూడ గుర్తింపలేదనగలమా ? ఆలోపమెట్లు తటస్థించినదో అనుకరణ పద్ధతిలో వివరింతును.

" దుర్బలస్యబ లో రాజాయంనెడు మాటలోన యెరుగవే " యని పాఠమున్నది.

## అనుకరణము

వాగనుశాసనుడగు నన్నయ భట్టారకుడు మొదలు చిన్నయ సూరి వరకు గల కవులనేకులు సంస్కృత పదములను గాని, సంస్కృత వాక్యములను గానితెనుగున ననుకరించునపుడు కలుగు సంధులను నిర్దేశించుచు సూరి ఐదు సూత్రములను రచించెను. అప్పకవ్యాదులకన్న ప్రత్యేకత చూపెను. పదాంత మందలి విసర్గ లోపము, నమ శబ్దము తుది అకారమున కోత్వముతో, లోక: వంటి శబ్దములకు కూడ నోత్వము చెప్పెను. హలంతములలో తుది హల్లునకు ద్విత్వముతో, అహమాదులమకారమునకు ద్విరుక్తి విభాషయనెను. ఉకారాంత నామములకు వుగాగమంబు విధించెను. ఈ సూత్రానుసారముగనే యనుకరణము ప్రాచీనులు సాగించినట్లు ప్రయోగములున్నవి.

"అనుకృతిని నిడుదకుంగుఱుచయగునని యొకండు పలికెనదినిరాకరంబు" అని తెల్పుచు " దుర్బలస్య బలంరాజాయనవినవే" యని యుదాహరణముగా జూపినాఁడు. హ్రస్వముగా జూపవీలుకాని ప్రయోగములు పరికింపుడు.

" ఏయెడ ననదలమొరవా
లాయము వినవలయు 'దుర్బలస్యబలంరా
జా' యనవినవే ధరణీ
నాయకులకు నార్త రక్షణంబులె క్రతువుల్" మనుచరిత్రము 4–74

" నీయెడ మముబోంట్లకు నే
లాయే సంశయము ' దుర్బలస్యబలంరా
జా' యని పలుకు విశిష్ట
న్యాయము గలుగుట మదార్తి హరియింపఁదగున్" జైమినిభారతము 7–214

" నాయనదతనము మాన్పికు
లాయము విడిపించి ' దుర్బలస్యబలంరా

జా' యనువాక్యము నిక్కము
సేయఁగదేయనిన గూబక్షితిపతికనియెన్ ". ఉత్తర రామాయణము 7-227

ఇన్ని ప్రయోగములుండగా ప్రహస్వ దృష్టి చూపుట యప్పకవికి దగియుండదు. ఈ ప్రయోగమును పరికించి, ఘట్టు ప్రభువు వాడిన విధము పరిశీలించినచో ప్రాస స్థానములోనికి "అం" తెచ్చినందున ఎన్నో రీతుల సంశయములుదయించి యున్నవి. సఖండాఖండ ప్రాసమున్నదని సబిందు నిర్బిందు ప్రాసముగా నంగీకరింతురా? ఐనచో "పాండవ మధ్యముండనికి..............తోడుగ" వంటి ప్రాసలను గూడ వాడుకొన వచ్చునా ? అనుకరణము చేయునపుడు తెలుగు నియమములనుల్లంఘించిన స్థల మొక్కటియున్నను విడువఁ గూడదు. డెబ్బది వరకునున్న యనుకరణముల నేరెండు మూడు తావులలోనో కొలది ఉల్లంఘనము జరిగినట్లు పాఠ భేదములుండుట గమనార్హము.

"లోకాస్సమస్తాస్సుఖినోభవంతు"ను చు—ఉకారసంధి— క్రియా వాచకము కదా? ఇట్టి చోట్లను వుగాగమమురాకుండుటకే సూత్రంబున నామంబునకు అని నిర్దేశించెను. 'ఉదంత నామంబునక నుకరణము నందు వుగాగమంబగు బా. సం. 54. ఈ సూత్రానుసారముగనే "పుడమిఁబాపీచిరాయువ'న్నెడగునుడుగు ". వసు చరిత్రకారునిది," అభ్యాగతస్స్వయం విష్ణువు,' నా వినబడు" జైమిని భారత కర్తది లక్ష్య భూతమైనవి. కావుననే ఘట్టు ప్రభువు రచనలో గూడ "మున్నె 'యర్థాతురాణాంనగురుర్నబంధు,వనెడి వాక్యంబు తోడుగాగ" కుచేల—3.43, "సన్నాహంబున నిత్యం సన్నిహితో మృత్యు 'వనెడి చదువులు". 3.82, వుగాగమ ఘటిత రూపములే సాధువులు. ' అభ్యాగతస్స్వయం విష్ణువ నగయని" పాండురంగ మహాత్యము లో నున్నది. రెండవ ఆశ్వాసములో "యభ్యాగ తస్స్వయం విష్ణు" యనెడు మాట విని ప్రియమున" అను చోటను 'నగురుర్నబంధు' యనెడి వాక్యంబు" అను చోట నిత్యం సన్నిహితో మృత్యు యనెడి చదువులు అను చోటను వుగాగమరహిత రూపములు ప్రమాద పతితములు. 'గ్రామో నాస్తికుతస్సీమ' యనెడి చోట ప్రహస్వత్వము విచారణీయము." 'పశుభిస్సమానో,' యని 'జ్ఞానా దేవమోక్షో' యనువంటిని, 'గతానుగతి కోలోకో' వలె సమర్థ నీయములు.'

"కొంగుబట్టీడ్చిన", 'పవ్వళించున్న' వంటిక్వార్ధేకార సంధులు. "ఇచ్చకు వచ్చిన వరము లిప్పుడేమైనన్ ఇచ్చెదవేడుమనిన " వంటి విసంధులు కన్పించుచున్నవి అది సమర్థనీయములైనను, కాకున్నను వ్యాకరణ జ్ఞానము లేక ప్రయోగమొనర్చిన కవికాడని మాత్రము తెల్పవచ్చును.

ఒక్కొక్క విషయమును విమర్శించుకొనుచు వెళ్ళిన నెంతయో యంశము బయలు పడుట సత్యమయ్యును గ్రంథస్థమైన మాధుర్యము నాస్వాదింప తలంపు గల పాఠకుల కు విఘ్నము గల్గించుటకు జంకి విరమింతును.

ఇట్టిది వ్రాయుటకు నన్ను ప్రోత్సహించిన సర్వులకు కృతజ్ఞుడను. ఎందరివో. భావములు నా యీ వ్యాసమునకు చేయూత నిచ్చినందున ఆ రచయితలకు ధన్యవాదముల

ఈ విషయమును సావధానముగా విని నా కృషిని మెచ్చుకొనిన పండిత ప్రకాండుల నామములను గూడ పేర్కొన లేక పోవుట నా యసమర్థతకు నిదర్శనము. ఈ మహాకవి గ్రంథములను పునర్ముద్రితము చేయుట, అముద్రితములను వెలికి తీయుట యొక యజ్ఞముగా భావించి యందులో నేనొక ఋత్విక్కుగా నుండు భాగ్యము కల్గి నందులకు సంతసించుచుందును.

## కతిపయ శబ్దార్థములు—వివరణము

| పద్యసంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 1. | చెలఁగి | ఉత్సహించి, ఒప్పి |
| 2. | వెసన్ | శీఘ్రముగా, తగినట్లు |
| 3. | మానక | వదలక, విడువక |
| 8. | సుకృతులు | మంచికావ్యములు, గ్రంథములు, పనులు |
| | జోడించు | రచించు, కల్పించు |
| 9. | మెఱయు | ప్రకాశించు, శోభిల్లు |
| 10. | ఎద | చిత్తము |
| | సృజించు | పుట్టించు |
| 11. | డంబము | స్థితికిమించిన భాషణము |
| | విడంబింపక | ఎక్కువగా క్రమ్ముకొనక, అతిశయింపక |
| 21. | స్తోమంబు | సమూహము |
| | ఆమోదము | సంతోషము |
| 22. | నెరయు | పూర్ణము, అధికము |
| | పట్టణము | పత్తనము, ప్రోలు |
| 23. | సదనంబు | భవనము |
| | మయము | ప్రాచుర్యార్థము |
| | మచ్చికలు | చనవు |
| | కట్టందములు | మిక్కిలి సొబగు |
| | నెట్టన | అనివార్యము |
| | నయము | అందమైన, రమ్యము |
| | కవగూడు | జతగాకూడు |
| | చెనకెడు | జయించునట్టి, ఎదురుకొను, ఔపమ్యము |
| | ఇమ్మల | ప్రీతి, సంతోషము, ఇష్టము |
| | పొడవగు | మూర్తీభవించు |
| | బోటులు | స్త్రీలు |
| | గరిమ | గొప్పతనము, శ్రేష్ఠత |

| పద్యసంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 24 | పట్టు | విశాలము, స్థానము |
| 27 | వరిటినాఁడు | వరుటు — కృశించు, చిక్కిపోవు ( అన్య— దేశ్యము ? ) నిరాహారుడైనాడు. |
| | పరిచ్ఛద | ఆచ్ఛాదనము, బట్ట |
| | రమణ | రాణ, ఆసక్తి, ఒప్పిదము, ప్రేమము, ప్రీతి, ఆనందము, అందము, ప్రసిద్ధి, విధము |
| 29 | మొదలు | శ్రుతి |
| 31 | దొడ్డతనము | గొప్పతనము |
| 33 | విసువక | కష్టమనక, తూర్పారబట్టక |
| | కసవులు | తాలుధాన్యము |
| 34 | దూసరొడ్లు | దూసర వడ్లు, దూసరి — తృణవిశేషము, బహు — ధాన్యము, వన్యము వడ్లు అను దానికి అపరూపము ' ఒడ్లు ' — (నివ్వరి ధాన్యపు గింజలు) |
| 35 | మట్టుపెట్టు | సమాధానప ఱచు, చంపు. |
| 36 | గోము | సౌఖ్యము, సౌకుమార్యము, వికాసము గారాబము, విధము, రీతి, గౌరవము, గర్వము, ముద్దుగా కోరెడు కోరిక. |
| 37 | అడ్డంబు | తాకట్టు, అధీనము |
| | మాఱొడ్డు | ఎదురు చెప్పు |
| | ఒడ్డారము | అలక్ష్యము, వక్రముగా మాటలాడుట |
| | ఎలమి | వికాసము, సంతోషము |
| 38 | ఒనరన్ | కలుగు, ఒప్పు, ఇంపగు, రుచించు, పొసగు, సరిపడు |
| | ఉచిత వృత్తి | యుక్తము, తగినది, పరిచితము. |
| 39 | పురుడునకు | వంతునకు, పోలిక, సామ్యము, మాదిరి, ఉపమ, సావాసము. |
| | కుస్తరించు | పద్దుకొనును, లాలించు, బుజ్జగించు ఓదార్చు |

| పద్యసంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 39 | ప్రామిడి | క్రూరత, అజ్ఞానము, కోపము ? |
| | కోరగింప | బలవంతపెట్ట, ఏడ్వ, (స.క్రి.) బాధింప |
| 40 | దూఱు | నిందించు, దూషించు, తిట్టు. |
| | పోరామిని | శ్రమతోడ, చెలిమి, స్నేహము |
| 41 | పోరాడు | పెనుగులాడు, పోరు. |
| | కదిసి | చెంతకుఁజేరి, కలియు, కూడు, సమీపించు. |
| 42 | అనీకము | సమూహము |
| | కుదియంగఁబట్టు | బిగియఁబట్టు, కుదియఁబట్టు. |
| | తగులు | సక్తమగు, ఆసక్తినొందు |
| 43 | కక్కుర్తిమాట | లోభము, ఆశ—కక్కు—ఱితి—అశ్రద్ధ; లోభము. |
| 45 | ఎడల్లు | వికలమగు, |
| | నొగిలె | నొచ్చు, బాధ నొందు,నొప్పిచెందు,వాడు, నల్లగు |
| 46 | మిన్నక | అనాయాసముగా, సులభముగా. |
| | గుఱుతుమాట | ప్రసిద్ధిగల మాట, లోకోక్తి, నానుడి,సామెత. |
| 47 | ఘటించు | ఘటిల్లఁజేయు, ఘటిల్లు—కలుగు. |
| | సాధ్యుండు | సాధుపు సాధుః—సాధకుఁడనుకొనుట. |
| 48 | త్రాణ | శక్తి, బలము, సత్తువ. |
| | మృష | అసత్యము, అవ్యయము, కల్ల. |
| 49 | నెరవు | పూర్తి, సమృద్ధి. |
| | పెల్లున | విస్తారము చేత |
| | పొరయు | పొందు. |
| 50 | తర్కించు | విమర్శించు, నిర్ణయించు. |
| | వెడలింపు | పోయఁజేయు, తొలగించు |
| | చూఱలువుచ్చు | పోఁజేయు, చెడఁగొట్టు, పోఁగొట్టు; నశించు. |
| 51 | గుఱి | లక్ష్యము, విశ్వాసము, నమ్మక; గుఱుత, దృష్టాంతము, నిదర్శనము. |

| పద్యసంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 53 | గుఱివీరగ | సరిగ, పరిమితి, హద్దు. |
| | దురటిల్లగ | దురపిల్లగ, శోకించు, దుఃఖించు, పరితపించు. |
| | తోయంబు | పరివారము, ఆప్తవర్గము, బంధువులు, మిత్రులు, సమయము, విధము, రీతి. |
| 54 | నిర్వాణుండు. | మోక్ష స్వరూపి, ముక్తినొందినవాడు. |
| 55 | భుక్తి | భోజనము, అనుభవము. |
| 56 | ఆతతము | ఎల్లప్పుడు, విరివియైనది. |
| 59 | మురియుదురు | సంతోషింతురు, ఉప్పొంగుదురు. |
| | మరులు | పిచ్చి ప్రేమ, వలపు, అజ్ఞానము, |
| | పెరిమ(మె) | ప్రేమ, అనురాగము, వలపు. |
| 62 | వెక్కరులు | వికారము గలవారు, " కడఁగి పేరడవులఁగా యపండేరి కుడిచి వర్తించు వెక్కరు తాప సులకు", మూఢులు, తెలివిలేని వారు. |
| 63 | ఈల్గిరి | నీల్గు, మరణించు, చచ్చు. |
| | నాటు | గ్రుచ్చు. |
| 70 | ఒనరించి | కావించు, చేయు. |
| | కృతము | కృత్యము, పని. |
| | ఒగి | యథా సంఖ్యము, క్రమము, చక్కగా, లెస్సగా (వాక్యాలంకారము) |
| | నయము | అందము, పొలుపు, నేర్పు. |
| | ఇమ్ము | సుఖము. |
| 71 | సడలవిడుచు | జారవిడుచు, వదలు. |
| 73 | వేసట | శ్రమము, అలసట, బాధ, అలయిక. |
| 74 | భిన్నుడు. | పగులఁగొట్టబడినవాడు, శిథిలమైనవాడు. |
| 75 | వగ | దుఃఖము, శోకము, సంతాపము |
| | పొగులు | కుములు, ఉడుకు, బాధపడు |
| | మొగసాల | నగరిలోని వాకిటి చావడి. |
| | మొఱ | ఆర్తధ్వని. |

| పద్య సంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 79 | శీరిన | చచ్చినయెడల, నశించిన యెడల. |
| 83 | వారక | అవశ్యము, ఊరక, ఉడుగక. |
| 86 | బలువు | అధికము, మిక్కుటము, గాఢము |
| | హలికుడు | కర్షకుడు. |
| | వెదవెట్టక | నాటు వేయక, నాటక. |
| 87 | తారసిల్లు | సంభవించు, వచ్చు. |
| | భుక్తము | అనుభవింపబడినది. |
| 90 | అలమట | దురవస్థ, కష్టము, బాధ, అలసట, చింత. |
| | ఆఱడి | నింద,హాని, భంగము, అపవాదము,అపకీర్తి. |
| 91 | వావిరి | క్రమము. |
| 92 | ఇరవు | స్థానము, యుక్త స్థానము, ఇల్లు, బస. |
| 95 | మొల్లము | విస్తారము, అధికము, హెచ్చు. |
| | మొనసిన | మొనయు ప్రత్యక్షమగు, గోచరించు. |
| 96 | మెఱయు | ఒప్పు, ప్రకాశించు. |
| 98 | తావలము | ఉనికిపట్టు, ఆధారము, స్థలము. సాధారణము. |
| 99 | సంతరించి | పోషించి, కాపాడి. |
| 100 | ఉగ్గడించి | ప్రకటించు, తెలుపు, చెప్పు. |
| 103 | సంగతి | న్యాయము. |
| | రిత్త | ఊరక, శూన్యము, నిష్కారణము. |
| 104 | గరిమ | గొప్పతనము, గౌరవము, పెద్దరికము. |
| 107 | విహితులు | హితవరులు, హితము చెప్పువారు. |
| 108 | రంజిలి | సంతసముచెంది. |
| | అంజలి | యాచించు. |
| | కొంజక | సంశయింపక, సందేహింపక. |
| 110 | కొండికలము | అల్పులము, ప్రమాణవయోభాగ్యాదుల. తక్కువ. |
| | దండి | హెచ్చు. |
| | ఇడు | ఇచ్చు. |

| పద్య సంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 111 | పరిదానంబు | వస్త్రవులమాఱుపు, పరిధానము, ధోవతి |
| | | కట్టుబట్ట. |
| | ఉరువు | ఎక్కువ. |
| 112 | వెరవు | ఉపాయము. |
| | విదితము | న్యాయము. |
| 113 | నెరవుగ | శుద్ధముగ, చక్కగ |
| 115 | చెలంగి | ఉత్సహించి. |
| 116 | పదపడి | మఱియు. |
| 117 | పొడగాన్పు | దర్శనము. |
| | పడికాఁపు | పంచనుకాచియుండుట. |
| | బడుగులు | చిక్కినవారు ( బీదలు ) సన్నగనున్నవారు |
| 118 | చిరికినైన | లేశమైనను లక్ష్యముచేయు. |
| 119 | కదిసి | సమీపించి. |
| 120 | రోయుచు | రోతపడుచు, అసహ్యపడుచు. |
| | గొంటువడి | దిట్టవడి, కఠీనతవహించి. |
| | బెండువడి | డస్సి, నిస్సారపడి. |
| | గుండంబుల | లోతుభాగము, నిప్పులగుంటలు. |
| | తట్టువడి | దూరమునడచుటచేత డస్సి, అలసి. |
| 122 | గుఱుతుగ | శ్రద్ధతో, బాగుగా. |
| | నిగుడన్ | వ్యాపింపన్. |

## ద్వితీయాశ్వాసము

| పద్య సంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 6 | ఆకాంక్ష | కోరిక |
| | ఒదిఁగి | తొలఁగి |
| 7 | వగుడాకు | ఎండిపోయిన జొన్న మొ॥ వాని ఆకు |
| | | వరుగాకు, ఎండుసారుపుట్టాకు. |
| 8 | గములు | సమూహములు, కూటములు. |
| | ఎలమి | వికాసము, సంతోషము. |
| | ఏణీమద | కస్తూరి. |

| పద్య సంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 9 | తనివి | తృప్తి. |
| 10 | తుటుములు | గుంపులు. |
| | కడుమేలు | మిక్కిలి మదము. |
| | మెఱయించు | మొఱయించు. |
| 11 | పొచ్చము | తక్కువ, కొఱంత. |
| 15 | ఎలమి | సంతోషము. |
| | ఎరివిగట్టిన | విలక్షణము, వికృతము, విపరీతము. |
| | తిరులు | జడలు. |
| | లావెడలి | సామర్థ్యము వికలమయి. |
| | అనువు | అవకాశము, ఉపాయము. |
| 24 | నిర్వాణము | మోక్షము. |
| 28 | ఎనయరు | సరిపోరు, పోలరు. |
| 30 | పృశించెదవు | ప్రశ్నించెదవు, సంభాషణ. |
| 32 | జోకలు | సౌందర్యము, అందము, ఒప్పు. |
| 33 | నెనరులు | ప్రేమలు, మున్నుచేసిన యుపకారములు. |
| 34 | అగ్గలము | హెచ్చు. |
| | ఎడలిన | వికలమయిన. |
| 35 | నయము | మృదుత్వము. |
| 39 | మనవులు | విన్నపములు. |
| 41 | నిర్వాణులు | విరక్తులు. |
| 47 | తిరిపెంబు | బిచ్చము. |
| 55 | మసలి | ఆలసించి. |
| 56 | ఒనగూడి | చేరి, ఒడఁగూడి. |
| 63 | పెలవు | ఆజ్ఞ, ఉపయోగము. |
| 65 | కాలాంజి | తమ్మపడిగ. |
| | బాగంబు | వక్కపొడి. |
| 67 | ముష్వంబు | తిన్నదనము. |

| పద్య సంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 68 | భేల | తెలియనివాఁడు. |
| 72 | మట్టుపఱచి | అడఁగఁజేసి. |
| 75 | ప్రసంగంబు | ప్రస్తావము, విషయవిస్తరము |
| | సంగతంబులు | సమాచారములు, చేరికలు. |
| 77 | అఱిముఱి | సంభ్రమము. |
| 82 | కొదవ | కొఱఁత, తక్కువ. |
| 83 | గహ్వరమున | గోప్యముగా. |
| | పంపు | ఆజ్ఞ. |
| 86 | నడి | అపకీర్తి, అన్యాయము. |
| 89 | తెరలి | బయలుదేరి. |
| 91 | దుడ్డెలు | బాలురు. |
| | జడ్డన | కష్టము, బాధ. |
| | ఒడ్డెన | ఒడ్డైన— విశాలమైన, పెద్దదైన. |
| | దొడ్డన | ఆధిక్యము. |
| 103 | ఊరడించి | తేర్చి, ఆశ్వాసించి. |
| 108 | బడుగులు | తక్కువ వారు, దరిద్రులు. |
| 109 | తిరియు | బిచ్చమెత్తు. |
| | ఇల్లె (తమిళ) | ఇల్ల—నాస్తి వాచకము, లేదు. |
| 110 | చెనఁటి | పేద. |
| 112 | ప్రామిత | ప్రామిక—అపేక్ష, కోరిక. |
| 116 | నొగిలి | వికలమయి. |
| | బలువు | మిక్కిలి అధికము. |
| | ఎలమి | సంతోషము, వికాసము. |
| 121 | కట్టిడి | క్రూరుడు. |
| | తొట్టును | సంభవించును. |
| 122 | అలరి | సంతోషించి. |
| | తనివి | తృప్తి, ఆపోశనట. |

| పద్య సంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|

## తృతీయాశ్వాసము.

| పద్య సంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 3 | మసలక | ఆలస్యము చేయక. |
| 5 | కంచుమించు | అగోచరము. |
| | దువాళించు | వేగమున అంతమేరయు సమముగాపారెడి అశ్వధార. |
| 10 | ఉప్పతిలు | పుట్టు, ఉత్పత్తియగు. |
| 11 | వరిటినగొకిబికి | (వరట—పేడయెండిన చెక్క.?) |
| | మేను | ముడతలు బడ్డ శరీరము |
| 16 | కదియింపక | కదియఁజేయక=కదియు—దగ్గరవచ్చు,చేర్చు,చేర |
| 17 | సవిధిన్ | సవిధము—ఒకేవిధమైనవి |
| 19 | తట్టిన | ప్రాప్తించిన. |
| 20 | పస్తు | ఉపవాసము, నిట. |
| 22 | ఒరయు | చిక్కుకొను, సక్తమగు, అంటుకొను. |
| 27 | జాళువాగిండి | బంగారపు జారీ. |
| | గరిమ | గొప్పతనము. |
| 29 | పైదలి | ఆడుది. |
| 31 | కొమ్మలు | కాంతలు. |
| | అలరించి | అలరఁజేసి. |
| | కలపములు | పరిమళ ద్రవ్యములనుజేర్చి కలపిన చందనములు. |
| 32 | బాగాలు | బాగలు, వక్కపొడి. |
| | అడరఁజేసి | కలుగఁజేసి, వర్ధిలఁజేసి. |
| 37 | ఎలమి | వికాసము. |
| 40 | సరగున | వేగమున, |
| 46 | సంతరించిన | సేకరించిన. |
| 47 | పిక్కచదరు | పిక్కచెదరు—భయము, బెదరు. |
| 48 | లొగ్గి | లోఁకువగు, లోఁగు. |
| | అలమటించు. | చింతించు. |

| పద్య సంఖ్య | శబ్దము | అర్థము |
|---|---|---|
| 52 | కొఱఁత | తక్కువ. |
| 53 | లయంబు | నాశము. |
| 55 | బెత్తుగ | గౌరవము. |
| 57 | మిన్నతి | ప్రగల్భ వచనము, డంబము. |
| 59 | కాఱించు | బాధించు. |
| 65 | ప్రెళ్లు | పడు. |
| 66 | భ్రమసి | భ్రమించి, భ్రాంతి చెంది. |
| | పొగులు | పరితపించు. |
| 67 | అట్టు | అల్లరి. |
| 68 | అలరి | సంతోషించి. |
| 72 | పిచ్చుగుంటు | అంగ వైకల్యము గలవాడు. |
| 74 | కాణాచి | చిరకాలముండు స్థలము. |
| 75 | దురటిల్లు | దుఃఖించు, చింతపడు. |
| 77 | కుదియించు | మరలించు. |
| 79 | లేములు | దారిద్ర్యములు. |
| 84 | అస్తావ్యస్తములు | హెచ్చుతగ్గులు, మంచిచెడ్డ లెఱుంగ కుండుట |
| 87 | పఱపు | ప్రయోగించు. |
| 90 | ఇరవు | స్థిరము, స్థానము. |
| 94 | వెచ్చము | వ్యయము. |
| | తిరిసిన | యాచించిన. |
| 97 | ఎడపక | ఎడఁబాయక, తొలఁగక. |
| 103 | పొదివికొని | క్రమ్ముకుని. |
| 104 | బైసిమాలిన | సిగ్గు లేని. |
| 108 | కరణి | విధము, |

# శ్రీ మద్భాగవత సంగ్రహము—నారాయణీయము

కేరళదేశమున దక్షిణ మలబారు నీలానది (భారత పూజానది) ఉత్తరతీరమున తిరునావాయి అనుగ్రామముగలదు. అందు ఉపరినవ అనుగ్రామము పేరు ఇంటి పేరుగాగల నంబూద్రి బ్రాహ్మణ కుటుంబమున క్రీ.శ. 1559—60లో జన్మించిన వారు మేల్పుత్తూరి నారాయణ భట్టాద్రి. 88 సంవత్సరములు జీవించెను. తనకు వచ్చిన పక్షవాత వ్యాధిని విముక్తి చేయ గురువాయూరు పురేశుని స్తుతించుచు భాగవతకధను సంగ్రహముగ శతదశకములలో రచించి రోగశాంతిని బొందుటయే గాక ముక్తిని గూడ బొందెనని యభియుక్తోక్తి. ఈ కవి కవితాసారస్వతము : నారాయణీయము, శ్రీపాద సప్తతి, గురువాయూరుపురేశస్తోత్రము, చంపూప్రబంధములు నానారాజ ప్రశస్తులు.

శాస్త్రరచనలు : మానమేయోదయము, మానపరిచ్ఛేదము (మీమాంస) ప్రక్రియా సర్వస్వము—వ్యాకరణశాస్త్ర గ్రంధము.

## నారాయణీయము కుచేలానుగ్రహము—87వ దశకము

కుచేలనామాభవతస్సతీర్ధ్యతాం
గతస్స సాందీపని మందిరేద్విజః
త్వదేకరాగేణ ధనాదినిస్పృహో
దినాని నిన్యే ప్రశమీ గృహాశ్రమీ ॥ (1)

సమాన శీలాపి తదీయవల్లభా
తధైవనో చిత్తజయం సమేయుషీ
కదాచిదూచే బత వృత్తిలబ్ధయే
రమాపతిః కింనసఖా నిషేవ్యతే॥ (2)

ఇతీరితోయం ప్రియయాక్షుధార్తయా
జుగుప్సమానోऽపిధనే మదావహే
తదాత్వదాలోకనకౌతుకాద్యయౌ
వహన్ పటాంతే పృధుకాను పాయనమ్ ॥ (3)

గతోऽయ మాశ్చర్యమయీం భవత్పురో
గృహేషు శైబ్యా భవనం సమేయివాన్
ప్రవిశ్య వైకుంఠమివాప నిర్వృతా
తవాతి సంభావన యాతు కింపునః ॥ (4)

ప్రపూజితం తం ప్రియయాచ వీజితం
కరేగృహీత్వా కధయః పురాకృతమ్
యదింధనార్థం గురుదారచోదితై
రపర్తు వర్షం తదమర్షి కాననే॥ (5)



779—10

ప్రతపాజు షోటస్మాత్ పృథుకం బలాదధ
ప్రగృహ్యముష్టౌ సకృదాశితేత్వయా
కృతం కృతం నన్వియతేతి సంభ్రమా
ద్రమాకిలో పేత్య కరం రురోధతే ॥ (6)

భక్తేషు భక్తేన సమానితస్త్వయా
పురీం వసన్నేక నిశాం మహాసుఖమ్
బతాపరేద్యుర్ద్విణం వినాయయౌ
విచిత్ర రూపస్తవ ఖల్వనుగ్రహః (7)

యదిహ్యయాచిష్య మదాస్య దచ్యుతో
వదామభార్యాం కిమితి వ్రజన్నసౌ
త్వదుక్తి లీలాస్మిత మగ్నధీఃపున:
క్రమాదపశ్యన్ మణిదీప్రమాలయమ్ ॥ (8)

కింమార్గ విభ్రంశ ఇతిభ్రమన్క్షణం
గృహంప్రవిష్ట స్సదధర్మ వల్లభామ్
సఖిపరీతాం మణిహేమభూషితాం
బుబోధచ త్వత్కరుణాం మహాద్భుతామ్ ॥ (9)

సరత్నశాలాసు వసన్నపిస్వయం
సమున్నమద్భక్తిభరోऽమృతంయయౌ
త్వమ్ వమాపూరిత భక్తవాంఛితో
మరుత్పురాధీశ హరస్వ మే గదాన్ ॥ (10)

## సుదాముని కథ-మహ రాష్ట్రమున

సాందీపుని యాశ్రమములో శ్రీకృష్ణుడు, వానియన్న బలరాముడు వారితో విద్య నభ్యసించు సుదాముడనువాడును నివసించుచుండిరి. అడవికి పోయి కట్టెలు తీసుకొని రమ్మని శ్రీకృష్ణుడును, బలరాముడును బంపబడిరి. సాందీపుని భార్య సుదాముని కూడ యదేపని మీద ముగ్గురి కొరకు శనగలు యిచ్చి పంపెను. కృష్ణుడు సుదాముని యడవిలో గలసియిట్లనెను. "దాదా, నాకు నీళ్లు కావలెను. నాకు దాహము వేయుచున్నది.". సుదాముడిట్లు జవాబిచ్చెను. "ఉత్త కడుపులోనికి నీరు త్రాగ కూడదు. కనుక కొంత తడువు యాగుట మంచిదనెను". గాని తన వద్ద శనగలున్నవని యువి కొంచెము తినుమని యనలేదు. శ్రీకృష్ణుడు యలసి పోవుటచే సుదాముని తొడపయి తలబెట్టుకొని గుఱు పెట్టుచు నిద్రపోయెను. ఇది కనిపెట్టి శనగలు తీసి తినుట ప్రారంభించెను. హటాత్తుగా శ్రీకృష్ణుడిట్లనియె "దాదా యేమి తినుచుంటివి? ఎక్కడనుంచి యీశబ్దము వచ్చుచున్నది?" సుదాముడు యిట్లనెను. "తినుటకు ఏమియున్నది? నేను చలితో వణుకుచున్నాను. నా పండ్లు కొరుకుకొను చుంటిని. నేను విష్ణు సహస్రనామమునుగూడ సరిగ యుచ్చరించలేకున్నాను" ఇది విని సర్వజ్ఞుడగు శ్రీకృష్ణుడిట్లు చెప్పెను." నే నొక స్వప్నమును గంటిని. అందులో ఒకడు యింకొకరివస్తువులను దినుట చూచితిని."

దీనిని గురించి యడుగగా "యేమున్నది తినుటకు మన్నా ?" అనెను. అనగా తినుటకు యేమిలేదని భావము. రెండవవాడు "తథాస్తు" యనెను "దాదా ఇది యొక స్వప్నము. నాకివ్వకుండ నీవేమితినవని నాకు తెలియును. స్వప్న ప్రభావము చే నీవేమితినుచుంటివని యడిగితిని". శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడనిగాని, వాని లీలలు గాని, తెలిసియున్నచో యట్లు చేయకుండెడివాడు. కాబట్టి వాడుచేసిన దానిని వాడే యనుభవింప వలసి వచ్చెను. శ్రీ కృష్ణుని ప్రియ స్నేహితుడయినప్పటికి వాని వుత్తర కాలమంతయు గర్భ దారిద్ర్యముచే బాధపడవలసివచ్చెను. కొన్నాళ్లకు భార్య కష్టము చేసి సంపాదించిన ఒకపిడికెడు అటుకులు సమర్పించగనే శ్రీకృష్ణుడు సంతసించి ఒక బంగారు పట్టణమును యనుభవించుటకు యిచ్చెను. ఎవరికయితే దగ్గరున్నవారి కియ్యకుండ తిను యలవాటుండునో వారు దీనిని జ్ఞప్తియందుంచుకొనవలెను. శ్రుతి కూడ దీనినే నొక్కి చెప్పచున్నది. మొదట భగవంతునికి యర్పించి వారు విడిచి పెట్టిన పిమ్మట దానిని మనము యనుభవించవలెను". [శ్రీ సాయిబాబా జీవిత చరిత్రమునుండి.]

మహారాష్ట్ర దేశములో సిరీతిగా (కుచేలకథ) సుదాముని కథ ప్రచారములోనున్నది గాన సుదామకుచేల శబ్దములొకవ్యక్తినే తెల్పును.

# కుచేలోపాఖ్యానము

## ప్రథమాశ్వాసము,

### పీఠిక

శ్రీమద్వ్ర[1]జాంగనా చిత్త [2]చిత్రాంబర
చౌర్య[3] చాతుర్య విచక్షణుండు
తాపస భామినీ దత్త విశిష్టాన్న[4]
బహుమధురా పూప భక్షణుండు
సకల గోపక వధూ[5] సముదయాకర్షణ
[6]మతవేణు నాదాభి[7] 'మంత్రకుండు
[8]దేనుఖురాగ్ర ప్రదీపితా చలరేణు
కోమలారుణ నిజ[9] కుంతలుండు

తే॥ [10]ధరవిభేదన మాయావిధ ప్రశస్త
ఘోర పాషాణవర్ష విదారణుండు
మదన[11] గోపాలకృష్ణ రమాధవుండు
చెలఁగి జగములనెల్ల రక్షించుగాత 1.

శా॥ భూలోకంబున దేవకీరమణికిన్ బుట్టె[12]న్నెసన్నందగో
పాల[13]శ్రేష్ఠ నకున్ యశోదకు [14]జగత్ప్రఖ్యాతిగా మోహపుం
బాలుండై విహరించు నిర్మల పరబ్రహ్మంబు [15]గొండంచువే
చాలంజాల [16]నొసంగు భూజనులకున్ [17]సర్వంకష్టైశ్వర్యముల్ 2.

కం॥ మావక [18]మూఁపును వీఁపును
మానిమల కొసంగు వేల్పు మన్మథసుఖవి
ద్యానిపుణుడు హరి జగతీ[19]
మానవులఁ జిరాయురర్థ [20]మానములఁజేయున్. 3.

సీ॥ ప్రతిదివసంబు 'గోబ్రాహ్మణేభ్యశ్శుభ[21]
మస్తు నిత్య'మ్మని యార్యులాడఁ
గారుణ్యమునను' లోకాస్సమస్తాస్సుఖి
[22]నోభవంత'నుచు మౌనులువచింప

---

1 శ్రీమద్వ్రజాంగనా (క) (త) శ్రీమద్వ్ర జాంగనా (అ) 2 చిత్తచిత్రాంబర (పా) 3 శౌర్య (అ) 4 విశిష్టాంగ (క) 5 సముదాయ కర్షణ (పా) 6 మదవేణు (క) (త) 7 మంత్రికుండు (అ) మంత్రికుండు (చ) (త) 8 దేనుకులాగ్ర(త) 9 కుండలుండు (అ) 10 భువనలీలా వినోదుండు భూప్రశస్త (త) 11 గోపాలు (క) దేనుఖురాధూత 12 మరిన్ (అ) 13 శ్రేణునకున్ (క) 14 కునుమ్మేల్ప ఖ్యాతిగా (త) ప్రఖ్యాతియో (అ) 15 రమ్యంబునన్ (చ) 16 శ్రీలు (చ) 17 సాదృశ్య మాధుర్యముల్ (చ) 18 మూపున వీపున (క) రేపును మాపును (చ) 19 జగతిన్ (ట) 20 మాన్యుల (ట) చిరాయుయోగ్యమానుల (చ) 21 భవతనియార్యులు పరగనాడ (క) భవతు నిత్యంబని ప్రజ్ఞులనఁగ (చ) 22 భవతని పెద్ద లేర్పడగఁ బలుక (చ) తనుచు యెనులు వేదతతి వచింప (పా)

'ధృతినమో బ్రహ్మణ్య దేవాయ గోబ్రాహ్మ
ణహితాయ చ'యని యామ్నాయులనఁగ
గణుతింపఁగా 'నమోఘా బ్రాహ్మణాశీర్వ
దా'యని పెద్దలందఱును బలుక

తే॥ ఆ మహావచనము లెతథ్యములు గాఁగ
శౌరియత్యను [1]కంపాను సారమునను
సకల ధేనువులను విప్రసంతతులను
శ్రీకరంబుగ నభివృద్ధిఁ జేయుఁగాత. 4.

వ॥ అని మరియుఁ జతుర్దశ భువన పరిపాలకుండును, యశోదా నందనుండును, దేవకీ వసుదేవ కుమారుండును, బూతనా ప్రాణాపహారుండును, దావానల భక్షణుండును, ద్రౌపదీమాన రక్షణుండును, వ్రజసుందరీ మనోరంజనుండును, గాళియగర్వ భంజనుండును, గపటమానవ క్రీడా ప్రమోదుండును, వేణునాద వినోదుండును, జరాసంధ శిశుపాల సాల్వాది దుష్టనరనాయక మదవిదారణుండును, జాణూరమల్ల వినాశకారణుండును, విప్రాంగనా మానస సరోరుహ హంసుండును, గంసవిధ్వంసుండును, గోప సుందరీ వస్త్ర తస్కరుండును, సకల ప్రభావిజిత శతకోటి భాస్కరుండును, సమస్త దిగంత విశ్రాంత ప్రభావుండును, మహాను భావుండునైన శ్రీకృష్ణదేవునిం బ్రశంసించి మఱియును 5.

తే॥ అవని సురభామిని యుఁబోలె నర్ధ[2]రాత్రి
స్వప్నమున వచ్చి కరుణాప్రసాదమునను
గవిత[3]నాకు నొసంగు శ్రీకంఠసాధ్వి
భ్రమర వినుతింతు వా[4]క్ప్రౌఢిమమును మెఱయ. 6

తే॥ [5]వ్యాసవాల్మీకి మల్హణ వామదేవ
భట్టబాణ భారవి శివభద్రమాఘ
బాణ భవభూతి బిల్హణ పవనతనయ
[6]కాళిదాసాదులగు మహాకవులఁదలఁతు. 7

కం॥ ఒకమాటఁ బలుక [7]లేరట
చకితమనస్కులనుగాక చక్కఁగ సభలన్
సకలార్థ సాధనములగు
[8]సుకృతులు కుకవులకుఁ దరమె జోడింపంగన్. 8.

---

1 కంపాప్రసాదమునను (అ) శౌరియతులిత మహిమ (చ) 2 అద్దమరెయి (నా) 3 కవిత యొసఁగెడు శ్రీ కరకంఠుసాధ్వి (చ) 4 లలితవాక్ప్రౌఢిమమున (అ) 5 వ్యాసవాల్మీకులును మహా (క)— శివభద్ర వామదేవు భారతీదేవి నామది ప్రస్తుతింతు (చ) 6 కాళి దాసమయూరాది కవుల (చ) 7 బలుకరాదట (అ) (ప) ఒకమాట బలుకువేళల చకితమనస్కుడగుగాక (చ) 8 సుకృతులకును గుకవులీడు జోడనఁ దగునే (చ) సుకవుల (త)

కం॥ కుమతులు విరచించు ప్రబం
ధములు ప్రసిద్ధంబులగునె తద్జ్ఞులు మెచ్చన్
[1]భ్రమరా ప్రసాద వాక్యము
అమితములుగ మెఱయుఁగాక యధిపుల సభలన్ 9.

తే॥ [2]ఏఁ ప్రబంధంబు రచియింపనెదనుబూను
నపుడె సాక్షాత్కరించి చిత్తాంబుజమున
భ్రమరనిలిచిసృజించు [3]సద్భూషణముల
[4]నస్మదీయ ప్రసంగ మెందైనఁగలదె ! 10.

కం॥ [5]డంబము గల కవులు కవి
త్వంబులఁ బూనుదురు రిత్తదమ[6]చేనగునే
యంబా ప్రసాద మహిమ వి
డంబింపక కలవె యతి సుధా విస్ఫురణల్ 11.

సీ॥ భ్రమరాంబికా వర[7] ప్రభవ దివ్య కవిత్వ
విద్యా ప్రవీణత వెలసినాఁడ
ఘటికాశత గ్రంధ ఘటనా సముంచిత
చాతుర్య మహిమకుఁ జాలినాఁడఁ
ప్రౌఢిమనేకైక పక్షమాస మహా ప్ర
బంధ కల్పన శక్తిఁ బ్రబలినాఁడ
మరియు [8]నాశువు చిత్ర మాధుర్య వాక్య ప్ర
గల్భనంబునను[9]తుల్ గాంచినాఁడ

గీ॥ శ్రీకుధర మల్లికార్జున శ్రీ పదాబ్జ
మత్తభృంగాయమాన సన్మానసుండ
సత్కవీశ్వర కరుణ ప్రసాదవశుఁడ
ఘట్టు ప్రభు నామధేయ విఖ్యాతయశుఁడ. 12.

కం॥ [10] నరులకు నంకితములుగా
నరకృతులొనరింప మిగుల వాంఛ[11]లు లేమిన్
[12]గరుణారస పూరితుఁడగు
హరికి సమర్పింతు[13] సము దితానందమునన్. 13

---

1. భ్రమర ప్రసాద వాక్యమహిమ తోడను......నెల్లెడ సభలన్, అవనిభుసభలన్(చ) 2. ఈ ప్రబంధము (చ) 3. సద్భావమునను (చు) 4. అస్మదీయ ప్రభావమెందైన (చ) అస్మదీయ కవిత్వ (క) (త) 5. డంబకముల (అ) డంబకమున (ట) డంబికమున కవిత్వంబును (ట) 6. యింత తమచేనగునే (ట) 7. వరప్రభను (అ) 8. నాశువిచిత్ర (ట) 9. శృతుల్ (క) 10. నరవరులకు...వాంఛలు దీరన్, హరికి సమర్పించెదను చిదానందమునన్ (చ) 11. వాంఛవొడమినన్ (క) వాంఛవొడమెన్ (అ) వాంఛవొడమికిం 12. గరుణామృతపూరితుఁడగు (అ) 13.సముచితానందమునన్ (వా)

# షష్ఠ్యంతములు

కం॥ భూసుర వనితాదత్త వి[1]
భాసుర పక్వాన్న భక్ష్య పానానుభవో
ల్లాస మనస్కున కనుపమ
రాసక్రీడావిలాస రమణీయునకున్ 14.

కం॥ బాణాసుర కరలతికా
[2]క్షీణలవిత్రునకు రూపజిత మదనునకున్
చాణూరమల్ల రజక
ప్రాణాపహరునకుం గంస బలమథ[3]నునకున్ 15.

కం॥ నంద యశోదాది[4]ప్రియ
నందనునకు శమిత దుష్టనరనాథునకున్
బృందారక[5]వరమాయా
సందర్భ శిలాప్రవర్ష సంహారునకున్ 16

కం॥ వరధేను వత్స గోపక[6]
పరివృతునకు వేణునాద పరిపూర్ణునకున్
బరమునకును[7]ఛత్రీకృత
గురుతరశైలునకు మదన గోపాలునకున్ 17

కం॥ కరుణాకరునకు యమునా
పరిరంభణ వివిధసౌఖ్య పరితోషునకున్
సరసునకు సత్యభామా
పరిణయకేళీ[8]విలాస[9]భవ్యాత్మునకున్ 18

కం॥ గతదోషున కస్ఖలిత
వ్రతశీలున కఖిల[10]గోపవనితాసురతా
ద్భుతకేళీలోలునకా
శ్రితజన వరిష్ణునకును శ్రీకృష్ణునకున్ 19

వ॥ సమర్పణంబు[11]గా నాయొనర్పంబూనిన కుచేలోపాఖ్యానంబు
నకుం[12]గథాక్రమంబెట్టిదనిన. 20

---

1. విభాసిత(చ) 2. క్షీణిలవిత్రునకు (క) 3. బలమర్దనునకున్ (ప) 4. యశోదాత్రిప్రియ (అ)5. బృందారక పరిమాయా (ట) 6. గోపిక (చ) 7. పాండవ నుత గురుతర (త) 8. కేళీవిలోల (అ) 9. భావ్యాత్మునకున్ (త) 10. ఘోషవనితా సురతామృత (అ) 11. సమర్పకంబుగా (ప) 12. కథాప్రారంభం (త)

## కథా ప్రారంభము

కం॥ శ్రీమ ద్భాగవతార్థ
స్తోమంబులు దెలుపునెడల శుకయోగీంద్రుం
డామోదమునఁ బరీక్షి
ద్భూవిభునకనియె వాక్ప్రభుత్వము మెఱయన్.

## పురవర్ణనము

కం॥ నెరయు[1] ప్రసిద్ధము మధురా
పురము సమీపమునఁ[2] బంటపాలంతికి[3] రత్నా
భరణంబై విలసిల్లు ను
వరనాథయవంతి పట్టణ[4] శ్రేష్ఠ మిలన్. **22**

మధురగతి రగడ—

అదిగడు[5] నున్నత మయ్యెడి కోటలు
సదనంబగు[6] నచ్చపుఁబూఁదోఁటలు
[7]మాణిక్యంబుల మయమగు వేదులు
నాణెములగు తిన్నని బహువీధులు
కడు నైష్ఠికతలు గలిగిన యాజులు
పు[8]డమిని ధర్మ[9]ముఁబూనిన రాజులు
భర్మవినిర్మిత బహుసౌధంబులు
నిర్మల మణిమందిర యూథంబులు
పచ్చలు[10]గూర్చిన బలుతోరణములు
మచ్చి[11]క లెసఁగెడి మదవారణములు
కట్టుంద[12]ములుగఁగట్టిన తేరులు
నెట్టన సాములు నేర్చిన శూరులు
నవరత్నంబులనయమగు మేడలు
కవగూడిన పటి[13]కంబుల గోడలు
పటుతరగేహ ప్రాసాదంబులు
స్ఫుటతర భేరీ[14]పుట నాదంబులు
వేలుపుఁజేడెల వెలఁగొను వేశ్యలు
శ్రీలంగు బేరునిఁ జె[15]నఁకెడు వైశ్యలు
విమ్ముల[16] బొడవగు నిల హోమంబులు
కమ్మని కృష్ణాగరు ధూమ[17]ంబులు
నిరుపమ మాగధ నిజగానంబులు

---

1ధరణి ప్రసిద్ధము (క)వరయ ప్రసిద్ధము (చ) 2 దంటపాలతికి (క) పుడమి (అ) నేలపాలతికి(చ 3 పాలతి శిరస్థ (త) పట్టణ విశేషమిలన్ (వ) 4 విశేషమునన్ (క) విశేషంబున్ (త) 5 మిక్కిలి విరళంబగు (అ) పొడవై తగు కోటల 6 సదనంబుల (అ) 7 మాణిక్యంబగు మయమగు (చ) 8. పుడమికి (క) 9. ధర్మవు (చ) 10 దీర్చిన (క) 11 మచ్చిగ (అ) 12 కట్టాయితముగ (చ) 13 స్ఫటికంబుల (త) 14 భేరీపటనాదంబుల (వ) 15 జెనగెడు (త) 16 యిమ్ముల పొగలెగయొడు హోమంబుల (చ) యెమ్ముల భోగుల యినహోమం బుల(త) యిమ్ముల ప్రోగులయిన (వ)17ధూపంబుల

[1]గరిమ వహించిన ఘనయానంబులు
విమలోదకముల వెలసిన బావులు
[2]సమచతురములగు చల్లని[3]తావులు
మహిత బలంబుల మ[4]హి సామంతులు
బహు విద్యల నేర్పగు ధీమంతులు
[5]ద్యూతాదులకును [6]దోడగు తంత్రులు
[7]నీతులు పతులకు నేర్పెడు మంత్రులు
నంగడిఁ బుష్పములమ్మెడి బోటులు
సంగతి గల విటజనముల నీటులు
గలిగి ధరిత్రిని ఘనత [8]వహించెను
[9]నలకాపురమున కన్నరహించెను 23

తే॥ అమ్మహాపట్టణంబున కనతి దూర
మైన [10]ఘోరాటవీ మధ్య మహాద్రి శిఖర
దివ్య దేశంబునను సన్నుతింప మిగుల
బట్టునైనది [11]తాపసి పల్లెగలదు. 24

## కుచేల మహాముని మహిమ

కం॥ అందుఁగుచేలుండను ముని
[12]నందను ఁడొక్కరుఁడు దినదినము హరిసేవా
నందంబున సకలేంద్రియ
[13]బృందములఁబరి త్యజించి పేర్మి వహించున్. 25

తే॥ "ఆత్మవత్సర్వ భూతాని" [14]యనెడు పలుకు
సత్యముగ నా మహాముని చక్రవర్తి
సకల[15] జనము నిజప్రాణ [16]సమముగాగఁ
దలఁచు [17]శాంతియు దమమును దయయుఁగలిగి 26

సీ॥ ఒ[18]నర సాందీపని యొద్దఁగృష్ణుని గూడి
[19]చదివినాడు సమస్త శాస్త్రములను
జఠరాగ్నినెల ను జల్లార్చి మిక్కిలి
[20]వరటినాఁడు మహోపవాసములను
[21]జలనమొందక నిజ స్వాంతంబు బిగఁబట్టి
[22]పంచేంద్రియములడఁగించినాఁడు
[23]స్నాన సంధ్యాద్యనుష్ఠాన కర్మంబుల
గావించినాఁడు దీర్ఘవ్రతములు

---

1 గరిమె (క) 2 సమచదరము (ట) 3 తావ్రుల (అ) 4 మనుసామంతులు 5 దొరకొను తంత్రుల (ట) దోడగు తంత్రుల (ట) 6 ద్యూతాదు (అ) 7 నీతులు మతులను (వ) 8 వహించును (ట) 9 అలకా పురమోయనరహి మించును (క) 10 ఘోరాట విద్రుమావిలశిఖర (చ) 11 తాపసి పల్లెయనగ (చ) 12 నందనుఁడొక్కడును భక్తిహరి పదసేవా (చ) 13 మండలములు పరిత్యజించి(చ) 14యనెడి పలుకు (క) యనెటి పలుకు(అ) 15 సకలజనుల(క) 16 సఖులుగాగ (చ) సములుగాగ (అ) 17 శాంతంబు శమమునుదమముగలిగి (అ) 18 వనర సాందీపుని వద్ద (అ) 19 చదివినాడొగి సర్వశాస్త్రములును (చ) 20 వరపి (క) జరపినాడు (చ) 21 బరపినాడు (త) చలనమొందని (త) 22 బంధించినాఁడు పంచేంద్రియములు (అ) యుమిడించినాడు పంచేంద్రియముల (క) (ట) యుమితించినాడు (చ) 23 స్నానజపాద్యనుష్ఠాన (క)

గీ|| శత సహ్రస [1]పరిచ్ఛేద సంఘటితపు
రాణ జీర్ణోత్తరీయంబు రమణ దాల్చి
మౌనులు కుచేలుఁడీమహా మహుఁడనంగఁ
బేరుగొన్నాఁడు దిక్కులు పిక్కటిల్ల 27

కం|| అవనీ నాధ 'స్వదేశం
భువనత్రయ' మనెడి మాట పొందువడ మహా
వివిధారణ్యంబులు నిజ
[2]భవనములుగ నుండు భేద [3]భావములేమిన్ 28

సీ|| మొదలనెప్పుడు 'వేదమూల మిదం [4]బ్రాహ్మ్య'
[5]మనఁగఁ బ్రదయా ధర్మ మభ్యసించె
నరయ 'భార్యా సమోనాస్తి [6]శరీరపో
షణ' యననొక పుణ్య సతి వరించె
ధృతి 'నపుత్రస్యగతిర్నాస్తి' యని యెడి
[7]కతన నందనులఁబెక్కండ్రఁగనియె
'సతతమేకో నివాసః పట్టణంవావ
నంవా, యనంగఁ గానలనె [8]యుండె

ఆ|| నతిశయంబు గాఁగ స్మృతి[9] 'నదైవంకేశ
వాత్పర 'మ్మనఁగను వారి జాక్షు
పాద పంకజములు బహు సమారాధన
మాచరించె నా మహా మహుండు. 29

కం|| ఆ ముని నిజ భార్యజన
స్తోమంబులు పొగడఁదగిన సుం[10]దర సుగుణో
ద్దామత నాయమనందఱు
వామాక్షి యనంగ దనరు వసుధాధీశ 30

## కుచేలుడిరువది యేడ్వురు సుతులబడయుట

తే|| ఆ పతివ్రత పెనిమిటి ననుసరించి
[11]సులభముగ నిర్వదేడ్గుర సుతులఁగనియె
బేదతనమునకే కాదెపెక్కు[12]రైన
బిడ్డలనొ[13]సంగు విధి యెంత దొడ్డతనము 31

---

1 మహాచ్ఛిద్ర సంఘటితవసన పురాణోత్తరీయంబు చాలదాల్చి (క) పదభేద...జన్మోత్తరీయంబు (చ) శతసహ్రస పరిక్షిత సంఘటిత పురాణ జీర్ణోత్తరీయంబు చలువుమెరయ (అ) 2 భువనములుగనుండు భేదబుద్ధియు లేమిన్ (పా) 3 భేదభావన (త) 4 మిదం బ్రహ్మ (ట) 5 మనినయాయర్ధమె భ్యసించె (చ) 6 శరీరతోషణ (అ) (చ) 7 కతను (క) 8 యుండు(ట) 9 శృతి (అ) 10 సుందరి (అ)11 సులభమున నిర్వదేడ్గు రు(అ) 12 పెక్కులైన(అ) 13 నొసంగుట యిదెంత గొడ్డతనము(క)

కడు సంతతి నెరయుటకై
కొడుకులఁ గలిగించెఁగాక కోమలికిని[1]సీ
పుడమిని దద్ద్విహ్మణుఁడే
[2]యెడలను భోగేచ్ఛ సేయఁడింతుల యందున్ 32

కం॥ విసువక యడవుల రాలిన
కసవుల ధాన్యములఁ దనకు [3]గ్రాసంబులుగా
వసుదేవ సుతుని గొలుచుచుఁ
బసిబిడ్డలు నాలు[4] నతడుఁ బ్రదుకు నరేంద్రా. 33

చ॥ పిడికెడు దూసరొడ్లు[5] కడుఁ బేర్మిదినంబును నేఱి[6]తెచ్చి యా
పడఁతికి దద్విభుండొసఁ[7]గ బ్రాహ్మణియున్ బచనంబు చేసియే
ర్పడ మఱియంతలో నతిథి భాగము దీసిలతాంగి భర్తకుం
గుడువఁగఁబెట్టి భుక్తి[8]గొను కోమలి[9] సంతతిదాను బంక్తులన్ 34

తే॥ జగతి నా విప్రవరుఁడ యాచకుఁడు గాన
నింటిలోపల ధాన్యంబు లెపుడు లేవు
కోమలికిఁబూట పూటకుఁ గుడు[11]వఁగూటి
బిడ్డలను నేగలిని మట్టు పెట్టవచ్చు 35

## దారిద్ర్యముచేఁ బీడితుఁడవుట

సీ॥ సన్నంపు నారలాచ్ఛాదించుటయె కాని
తా[12]డుగఁగోకలు లేవు బుడుతలకును
పసినాఁడు గట్టిన పాల పూసలె గాని
పెట్ట సొమ్ములు లేవు బిడ్డలకును
బిడికెఁడు బియ్యంబు పేద[13]గంజియెకాని
త్రాగఁబాలును లేవు తనయులకును
దట్టంబులైన పత్ర పుటంబులెగాని
కుడువఁగిన్నెలు లేవు కొడుకులకును

తే॥ నిరుగు పొరుగున వారల[14] యిండ్లనెల్ల
వివిధ మార్గంబులను సిరుల్వ్యిట్టిపీఁగఁ
గుడిచి కట్టెడు శిశువుల [15]గోములరసి
తల్లి [16]యెట్లోర్చుఁ దన పేదతనమునకును. 36

కం॥ బిడ్డల పేదరి కంబున
కడ్డంబై [17]పెంచుకొనుచు నధిపునకును [18]మా
ఱొడ్డక [19]సద్గుణ గావున
నొడ్డారము సేయుకెలిమి నుండె నృ[20]పాలా. 37

---

1 కిసిసీ (చ) 2 యెడలన్ (అ) 3 గ్రాసము గాగం (త) 4 నాలుతాను (త) 5 దూసవడ్లు (క) 6 నేరితెచ్చియా (త) 7 తద్విభుండొసఁగు (ప) 8 కాంతుఁడుదాను వంతులన్ (క) భక్తిగొను...... వంతులన్ (త) 9 కోమలి సంతులు దాను బంతులన్ (చ) 10 ఇంటిలోనను (ట) 11 కుడుపు గూటి (చ) కుడువగూడు (అ) 12 పొడుగ కోకలు (ట) వాదుగ (ప) 13 గంజియు (క) 14 వాకిండ్లనెల్ల (చ) 15 గోవులరసి (త) 16 యెటులోర్చు (ప) 17 తడ్డుకొనుచు (అ) తెంచ కొనుచు (త) తెచ్చుకొనుచు(క) 18 మారొడ్డని (క) 19 సద్గుణి(అ) 20 యుండు నృపాలా (ట) (అ)

ఆ. గలిమి [1]గలుగు పట్లఁ గాంతునకును బ్రియం
బొనరఁజేయవచ్చును చిత్తవృత్తిఁ
బేదతనమునందుఁ బెనిమిటి మనసురాఁ
[2]దిరుగనేర్చునది యె గరిత యనఘ 38

సీ. పొరుగు పిల్లలతో[3]డి పురుడున కేమైన
నాటలకిమ్మన్న నాలసించుఁ
బప్పు బెల్లములకై బ్ర[4]తిమాలి యేడ్చుచుఁ
గొంగుఁబట్టీడ్చునఁ గుస్తరించుఁ
బాలు వెన్నలకుఁగాఁ బ్రామిడివడిఁబోరఁ
జన్నిచ్చి కౌఁగిట సంగ్రహించుఁ
బోగులుంగరము లీఁపూఁటఁ గావలెనన్న
మాపురేపని పలుమాఱుఁబొంకుఁ

తే. గలిమిలేము లెఱుంగక గడు[5]సువగల
[6]బిడ్డలింపైన వస్తువులడ్డు లేక
[7]కొంటె తనమునఁ దెమ్మంచుఁ గోరగింపఁ
[8]దలి యేమియు ననలేక తల్లడించు 39

కం!! ఈ రీతిని శిశు[9]వులు దనుఁ
బోరాడిన మగని [10]దూఱఁబోవక పలుమా
రారామామణి దినములు
పోరామిని [11]గడపు సాటిబోటులు మెచ్చన్. 40

## భార్యపతిని కృష్ణుని యొద్దకుఁ బోవేడుట

వ!! ఇట్లత్యంత ఘోరంబయిన దారిద్ర్య చింతాభరంబున సంసార పారావారంబు దరియింపంజాలక, సుతులతోఁ బోరాడుచుం దత్కాంతారత్నంబు [12]సతత దయాస్వాంతుండును, సకల సద్గుణ వంతుండును నయిన తన కాంతునింగదిసి యేకాంతంబున నిట్లనియె. 41

---

1 కలిమి గలిగినట్టి కాంతలకును బ్రియం (క) 2 దిరిగినదియె గరితయనఘచరిత (చ) గరితెయనగా (త) 3 తోటిపురుడుననేమైన యాకటికిడుచున్న (క) తోడిపురుడున కిమ్మెన(ట)4 బ్రామిడి పడిపోర (క) భ్రమవడి పోరిన (చ) బ్రామిడి వడిపోరు (ట) బ్రామికవడిపోక (త)5 గడుపువగల (ట) 6 దుడ్డెలింపైన వస్తువుల్ తోడనాదిగి గాడతనమున (క) దుడ్డలింపైన వస్తువుల్ దొడగమెడిగి (చ) దుడ్డెలిమ్మెన వస్తువుల్ తోడుతోడ (ట) 7 గొడ్డతనమున తెమ్మని గోరగింప (ట) గొట్టుతనమున (ప) 8 తల్లి నేమియు (ట) 9 శిశువులతో పోరాడుచు మొగని (చ) 10 దూరబోకను (ట) దూరబోవదటంచున్ (ప) 11 గడిపె(క) 12అనంతదయా.

సీ॥ జిహ్వాత్వగాది సుస్థిర తరదుష్టేంద్రి
1యానీకములు దియంగఁ బట్టి
మదమత్సరములు కామంబు లోభంబను
గురుతరాంతర్వి పక్షుల నడంచి
స్నానంబు సంధ్యయు జపము హోమంబును
మొదలైన సత్కర్మములు గ్రహించి
2పర్ణతోయానిల భక్షణంబులు చేసి
కాననంబున నెల్ల కాలముండి

తే॥ 3తనువు నిజశల్య శక్తి మాత్రముగ నిల్పి
శ్రీహరి ధ్యానమెప్పుడుఁ జేయుచుండు
నతిశయంబుగ 4దార సుతాదులందుఁ
5దగుల నేరదు నీదుడెందము మహాత్మ. 42

తే॥ స్వామి మీరెన్నటికి నయాచకుల రగుట
యాచకులు గాక యుండుట నాత్మఁదెలియు
6నైనఁగక్కుర్తి మాటదా నాడుకొనెద
నరయు మీ మన్ననలఁగుచేలాగ్రగణ్య. 43

కం॥ యాదవ వల్లభుఁడును 7మీ
రాది స్నేహితులటంచు నందఱు దెలుపన్
మోదమున 8విందునెపుడా
శ్రీదయితుని సమ్ముఖంబుఁజేరి మహాత్మా 44

తే॥ చిన్న9వాండ్రకునేమైన సిరులు వేఁడి
తెచ్చి రక్షించుకొనుము 10నా దేహమెడల
నాగిలె 'సర్వేజనాస్సుఖినో భవ11ంత'
నియెడి వాక్యంబు తలపోయు నిర్మలాత్మ. 45

తే॥ పూర్వసఖుడైన 12యాదవ పుంగవుండు
మిమ్ముఁ13బొడగన్న సిరులెల్ల మిన్నకొసఁగు
14నెఱుక పిడికెఁడు ధనమన్న15గుఱుతుమాట
16తథ్యమౌగాదె యెందైనఁ దాపసేంద్ర. 46

---

(చ) 1యనికరములగుది (అ) నదియంగశబట్టి (త) గురుతరంబుగ వాని గుదియ బట్టి (క) 2 పర్ణశిలాతోయ (క) 3 తనువు నిజచర్మశల్యమాత్ర (క) నిజచర్మమస్థి మాత్రమున (అ) 4 దారాసుతాదులందు (అ) 5 తగులనియ్యవు (అ)6 నాగ్రహింపకుడ వనీసురాగ్రగణ్య (క) నరయమీ వారలము (చ) నీ వాక్యముష్ఠింప చాగ్రగణ్య (ట). 7 మీరాదిని స్నేహితులరగుట (క) మీరాదిన (అ) 8 సుముఖమునకు (క) 9 చిన్నవాళ్లకు (క) 10 మా దేహమెంతొ నాగిలె (చ) నా దేహమెడలనాగిలె (ప)11 ననెడు వాక్యంబుతల వోయు మార్యవర్యా (చ) 12 యాయదుపుంగవుండు (ట) 13 తన్ను గనినను నిష్టముల్ (చ) 14 నెరికె (త) 15 గురుతువినగ (చ) 16 తథ్యమే (క) నిథ్యమిది విందునెంతైన........

మ॥ ఘనుడా కంస విభంజనుండు 1 త్రిజగత్కాంతుండు మోదంబునన్
మనకుం జెక్కు సిరుల్ ఘటించుఁ గడు సమ్మానించుఁగా దేనిత
ద్వనజాతాక్షుని పాదపద్మములఁ బ్రేమ 2 ంజూచినం జా 3 లదే
చనుఁడీయిప్పుడు భోగమోక ములకున్ సాధ్యుండు కృష్ణుండిలన్ 47

కం॥ ప్రాణలు చె 4 డనెమ్మేనుల
క్షీణించిరి బువ్వలేక చెడిబుడుతలుపో
రాణికు 'అన్న 5 ంబునకుమ
ప్రాణములకు లంకె'' యనెడి పలుకులు మృషలే. 48

కం॥ నెరవు 6 గ నాఁకటి పెల్లున
సుర సుర ప్రుక్కెద 7 రు మన శిశువులంజూడన్
8 దురితము దారిద్ర్యంబుల ఁ
9 బొరయక మను చున్న వారె 10 పుణ్యులు జగతిన్ 49

సీ॥ రూపింప నిర్మల రూపంబు వెడలించు
రక్తమాంసముల భారములడంచు
నుద్యోగములకున్నై 11 యూహ సేరఁగనీదు
మగల కింతులకునుఁబగలు సేయు
బహుళంబులై నలో 12 భంబులు త్పాదించు
సూనృతవాక్యంబుసూఱఁబుచ్చు ఁ
జాల దురాశా విచారంబు గల్పించు
మానంబు 13 చెడ బతిమాలిపించు

తే॥ నసదృశానందవనమున 14 కగ్నికీల
యతిశయా 15 క్రాంతచింతావిహరణభూమి
భూరి దుఃఖంబులకునెల్ల ఁ బుట్టినిల్లు
ప్రజలకును లేమికంటె ఁ బాపంబు గలదె. 50

మ॥ సరసీజాక్షుని కూర్మిభక్తుఁడవు సంసారాబ్ధి కిన్నావయై
దరిఁజేర్పంగుఱియై నవాఁడు మురవిధ్వంసుడు నిన్ 16 బోవఁడే
వరమృష్టాన్నసువస్త్ర పీడితులమై వర్తింపఁగానేల శ్రీ
హరి సేవించిన వారికిం గలవె త్రోయన్‌రాని దారిద్ర్యముల్. 51

---

1 త్రిజగద్ధన్యుండు (క) 2 సేవల్ జేసినం (క) 3 టేవవ్ చాలునే (ట) (చ) 4 చెడె (క) 5 అన్నములకు (ట) 6 నెరవుర (క) నిరవగు (చ) నెరవుగ (అ) 7 జొక్కెదరు (ప) 8 దురితపు దారిద్ర్యంబువ (క) బురయక (చ) దురితము దారిద్రంబును బొరయక (ట) 9 మనమున 10 పుణ్యుడు (చ) 11 యూహదూరంబగు (క) యూహరూపగనీదు (చ) 12 లోభములు సంపాదించు (ట) 13 మానంబువెడ (క) 14 రసముల కగ్నికీల (క) 15 శ్రాంతచింతావిహార (ట) 16 ఈ రీతినిన్ వరమృష్టాన్నము (క) వస్త్రపీడితులమై (చ)

వ॥ అనినవవ్వా[1]ధూరత్నంబునకుఁ గుచేలుండిట్లనియె. 52

## అర్ధానికిఁ గుచేఁలుడు బదులు సెప్పుట

కం॥ తరుణి పూర్వభవంబున
గుఱి మీఱఁగఁ జేసినంతకుడుతురు పిదపన్
నరులీజన్మంబునఁగడు
[2]దురటిల్లఁగనేల యిట్టి [3]తోయంబులకున్. 53

శా॥ గర్వాంధ్యంబున మత్తుఁడెంతయు వృధాకాంక్షన్ బ్రవర్తి[4]ంచుగా
కుర్విన్ దాను స్వతంత్రుఁడే మనుపఁగర్మోపేతు[5]లౌ జీవులన్
నిర్వాణుండగు [6] శౌరి కర్త జగముల్ నిర్మింప రక్షింపఁగా
'సర్వం విష్ణుమయంజగత్త్' నెడు శాస్త్రంబుల్ నిరర్ధంబులే 54

ఆ॥ ధనముగూర్చవలెనె తనయులకును భుక్తి[7]
లిడెడువాఁడు శ్రీరమే[8]శ్వరుండు
మృగసవి[9]మూహములకు మేపు నీళ్లెవ్వఁడు
[10]వెట్టి ప్రోచు నెలమి [11]నట్టడవుల. 55

తే॥ రాతిలోఁ గప్పకాహారమాతతముగ
నిడెడు దైవంబు మర్త్యులకేలమాను?
బ్రతికినన్నాళ్లు నన్ను[12]ంబు పట్టె[13]డిడక
'ఆయురన్నంప్రయచ్ఛతి'యనగవినవె. 56

కం॥ ఓ వనిత నీకు[14]మారులఁ
బోఁగవలెననుచు సారెఁ బొగిలెదవు మదిన్
నీవెవ్వత నేనెవ్వఁడు
[15]శ్రీవరదుఁడు కర్త సకల జీవులకెల్లన్. 57

వ॥ కావున 'అవశ్యమనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభ'మ్మను కతంబున బూర్వజన్మంబునం జేసిన పుణ్య పాప ఫలంబులు వెంబడి నీజీవుల నంటియుండి సుఖదుఃఖంబులనుభవింపజేయు 'నదానదోషేణభవేద్దరిద్ర' మనియును 'ధనంప్రకర్షేణ కరోతి పుణ్య' మ్మనియును బలుక సుకృతంబుల వలన నైశ్వర్యంబును, దుష్కృతంబులవలన లేమియు నరులకుఁ బ్రాప్తించునది యెట్లనిన, విప్రకరార్పితంబైన విత్తంబు పదపదంబునకు బాధేయంబని పెద్దలు పలుకుదురు. 'క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి' యనుమాటలు

1 యాబాలారత్నంబు (అ) ఆపుణ్యసాధ్వికి (ట) 2 దురుటిల్లగ (ట) దురపిల్లగనేలె (ప) 3 తుచ్ఛంబులకున్ (ట) 4 ప్రవర్తింపగా (ట) 5 కర్మోపేతుడౌ జీవులన్ (త) కర్మాపేతులౌ (ప) 6 శౌరియుంజగముల (ప) 7 భుక్తులిడెడు వాడు చతుర్భుజుండు (క) 8 తనయులకని భక్తినిడెడి వారికి డడె—యీశ్వరుండు (చ) 9 సమాజములకు 10 పెట్టిపోదురెలమి (ట) 11 నెట్టడవుల (అ) 12 నశనంబు (అ) 13 పట్టెడిడిన (త) 14 నీ కొమారులు (ట) 15 శ్రీవరదుడె (క)

తేఁటపడం దత్కర్మానుభవంబులు దీరిన నూర్ధ్వలోకంబున నుండి యధోలోకంబునంబడి 'జ్యోతిష్టోమేన స్వర్గ కామోయజేత' యను మాటలం దెలుపంబడు నుత్తమ ధర్మంబునకు మరలి తమ తమ జన్మాంతర కృత కర్మంబులాధరంబులుగాఁ బర్ణ కీటకంబులంబో లెదనువు లెత్తుదురు. 'జాతస్య మరణం ధ్రువం' అన శరీర ధారులకుఁ బుట్టినప్పుడే చావు నిత్యంబు. పృధివ్యప్తేజోవాయ్వాకాశమయంబులైన యీదేహంబు లొకరి సొమ్ములు గావు. దైవ యోగంబున నుండుఁ బోవునట్టి దుర్దశలు మర్త్యులకుఁ బరిహరింప నెవ్వరు సమర్థులని చెప్పి వెండియు నిట్లనియె. 58

కం॥ మురి[1]యుదు రెవ్వరి బిడ్డలు
మరులింతియ కాక సుతులు మరి యతి[2] హితులే
[3]పెరిమెను బుట్టిన పుత్రులు
పెరుగఁగ శ్రుతులను శ్రుతులు పెక్కులు వినవే 59

శా॥ చిత్రంబెవ్వఁగఁ జిన్ననాఁడెతనయుల్ శిక్షా[4]నుగుణ్యుల్ తుదన్
బాత్రుర్గారతి దండ కార్యములకుంబ్రా[5]యంపు వారైన ని
ద్ధాత్రింజుట్టములట్లు చూడవలదాతంద్రుల్తనూజాతులన్
'పుత్రంమిత్రవదాచరే'త్తనుచునే ప్రొద్దున్ శ్రు[6]తుల్పాటఁగన్ 60

ఆ॥ సుతులమీఁది ప్రీతి చుట్టాలపై ప్రేమ
మిగుల నిందు ముఖులమీఁది వలపు
ధనము మీఁది యాస ధాన్యంబు పై తృష్ణ
యతిశయంబు[7]వలవ దాత్మయందు 61

కం॥ ఎక్కడి సుతులెక్కడి సతు
లెక్కడి సంపదలు మాయలిన్నియుధర్మం
బొక్కటి నిజ[8]మని యెఱుఁగని
[9]పెక్కురులకు సుకృతి భోగ విభవముగలదే. 62

కం॥ ఎందరకుఁ బుట్టి పెరిగిరో
యెందరుకును సంభవించి యీాలి రో [10]మఱియుం
కెందఱికును జన్నింతురో
నందనులని [11]మిగులఁ బ్రేమనాటఁ గనేలా 63

ఆ॥ పరగ[12]ఁ గను ఋణాను బంధ రూపంబులు
పసు[13]లు సుతులు హితులు భామినులును
సంతతంబువీరి సంయోగములవి
యోగములకు ఁ జింతనొందఁదగదు. 64

---

1 మరణంబయ్యెడుకు వేళల మరులింతియె కాక సుతులు మానకహితులే, తిరముగ పుట్టిన పుత్రులు పెరగఁగ శ్రుతులగు మాటపెక్కులుగలవె (చ) 2 మతినతిహితులై (క) 3 ప్రియమున పుట్టిన పుత్రులు మరి శ్రుతులగుట (ట) 4 శిక్షా (ట) 5 ప్రాయంబు (క) 6 స్మృతుల్ (త) 7 వలవదవని యందు (చ) వలువ దధికమగును (క) 8 బెక్కడి నిజమని (ప) 9 పెక్కిరులకు (ట) యెక్కురులకు (చ) సుతులును భామినులు (ట) 10 మరియున్నెందరు జనియింతురొ (క) 11 మిగుల ప్రియము (చ) 12 పరమమగు (ప) 13 పశువులురాసుతులును భామినులును (ట)

కం॥ ఇతడు దరిద్రుండగు నితఁ
డతులిత సంపదలఁ బొదలునని వ్రాసిన యా
శతధృతియ మోఘలిఖితము
నితరులకును దీర్పఁ [1]దరమె యిందును నందున్. 65

కం॥ శ్రీవని తావిభుడొక్కఁడె
దైవము చర్చింప సకల తంత్రంబుల'కే
కోవిష్ణు మహద్భూతం'
నావినఁ దగినదియె కాదె నానాస్మృతులన్— 66

ఆ॥ సమయ[2] మెఱుఁగడు హరి సమయించు నాత్మల
ధరణి నొకనినైన మరువఁ డతని
భటులు[3]నట్టి వారెయట 'యథారాజా త
థా ప్రజా' యనంగ ధరణి[4]వినవె. 67

తే॥ తానుజేసిన కర్మంబు తానెయనుభ
[5]వింపవలయును బుట్టి తద్విధము మగుడ
నెన్నితనువులొ తలిదండ్రు లెందరైరొ
[6]వశము గాదటు దెలియ జీవులకు నెల్ల. 68

ఆ॥ చచ్చెఁ జచ్చెననుచుఁ జాలఁజింతింతురు
పుట్టెఁబుట్టెననుచు భూమి ప్రజలు
సంతసింతు రెలమి సకల జీవులకును
జావు పుట్టు వొక్క సమము గాదె. 69

సీ॥ మాతృగర్భముఁ జొచ్చి మానవుండష్ట[7]మా
సంబులు సుజ్ఞానశాలి యగుచుఁ
గృతమొనరించి దుష్కృతములఁ బొందిత
నేక నరకములందింకనైన
నుదయించినపుడె యొందొక బుద్ధి లొగిమాని
నయమునఁ దగిన పుణ్యములొనర్చి
చేరెదహరినంచుఁ జింతించి నవమాస
ములు నిండయోని నిమ్ముగ జనించి

తే॥ విష్ణుమాయావశంబున వివశుఁడగుచుఁ
దొంటిబుద్ధులు చెడియంతఁ[8] దోడుతోడ
ననుభవించును సుఖదుఃఖమందుఁబూర్వ
[9]జన్మకర్మవశమున నిచ్చలు లతాంగి. 70

---

1 దీర్పనగునె (చ) 2 సమయమెరిగి యముఁడు (త) 3 వారలట(త) 4 వినమె (ట)
5 వించుపాలియును తద్విధినిమగుడ (క) 6 రోవశముగాదు తెలియనిజీవులకును (ట)
7 మాసంబున (అ) అష్టవామాసంబు సుజ్ఞాన మానుడగుచు (అ) 8 తోడుతోడ ననుభవించుచుండును
సుఖదుఃఖ విధులు పూర్వ (అ) 9. జన్మముల కర్మఫలము(చ)

తే॥ [1]జీర్ణ కంచుకమును విసర్జించునట్టి
సర్పమును బోలె దేహంబు సడలవిడిచి
[2]పోయి, జీవుండు మరియొక్క బొందిఁజొచ్చు
నే [3]శరీరంబులకు భుక్తులిడఁగవలయు. 71

కం॥ తరుణులఁ బుత్రుల మిత్రుల
మఱువక [4]పోషించువాఁడు మరణంబైనన్
మఱియుంచరు తమవారిని
కరుణయొకించుకయు లేక [5]కాలుతురుతుదన్. 72

తే॥ [6]మోసమున వంటకట్టెల మోపు పగిది
వేసటను బ్రాణి దేహంబు విడిచిపోవుఁ
[7]దమకు వచ్చిన మోహంబు[8] తనువులింత
దాఁచుకొనరాదె వెడలించు [9]దాఁకఁదడవు. 73

కం॥ ఎన్నాళ్లకైన [10]మర్త్యుఁడు
భిన్నుండగుఁ దానయెంత పెరిగిననైనన్
మున్నెస్మృతుల్ 'యదృష్టం
తన్నష్ట'మ్మనెడు మాట తథ్యముగాఁగన్ 74

కం॥ [11]వగఁబొగులు దీనజనముల
ఖగగమనుఁడు ప్రోవకున్న గతి[12]యెవ్వరిలన్
మగువ విను రాజు గొట్టఁగ
[13]మొగసాలకు మొఱలువెట్టు మూఢులుగలరే. 75

కం॥ ధారుణిలోన వనాథుల
కేరీతినినైన శ్రీరమేశ్వరుఁడే యా
ధారమగు 'దుర్బలస్య బ
[14]లంరాజా' యనెడు మాటలను నిలవినవే. 76

తే॥ అత్తమామలు తలిదండ్రు లన్నదమ్ము
లాలుబిడ్డలు దేహంబు లస్థిరములు
సర్వములు[15]వ్యర్థములు మృతి సమయమునకు
ధర్మమొకటె సహాయంబు తథ్యమబల. 77

కం॥ కాంతలు మేనులు పతమని
పంతులతోఁ గూర్తురఖిల [16]వస్తువుల నరుల్
ఎంత గడించినఁ గూటికి
నెంతటి వాఁడైనఁగాటి కిందునిభాస్యా 78

---

1 జీర్ణవరకంచుకము (ట) 2 పోయిప్రాణంబు (ప) 3 నీశరీరంబునకు (అ) 4 పోషించువారు (చ) మరువక పోషించి తాను మరణంబైతే (అ) 5 కాల్తురు వానిన్ (చ) కాల్చుదురు (ప) 6 మోసమున వట్టికట్టెల (అ) చెట్టుకట్టెల (చ) 7 తమకు వచ్చిన దేహంబు తడవ (చ) తమకు ఇచ్చిన (ట) 8 తనువులింతె (క) 9 దనుకతడవు (ట) 10 జీవము భిన్నంబగుగాక (చ) (క) 11 వగబొగులు (చ) 12 యెవ్వరొకో (చ) 13 మొగసాలతో (చ) మొగసాలెకు (ట) 14 లో రాజాయనెడి మాటలోన యెరుగవే (క) లోరాజా యనెడి మాటలొవర-యెరుగవె (త) లోరాజా యనెడి మాటల అనరొ వినవే (ప) 15 వ్యర్థమను మృత సమయమునను (చ) 16 వస్తువులను దానెంత ఘటించిన (అ)

కII [1]తిరిన వేల్పుల వెజ్జులఁ
గోరఁగ[2]శేర్లై రి దంౘ్రడు గుజనుల పరులన్
నేరిచి బ్రదికిన వారలు
నేరక చెడినట్టివారు నిజముగఁ గలరే. 79

తేII [3]చచ్చిపోయిన వారికై చాలవగల
దుఃఖ పడుదురు[4]మఱునాఁడు దొడరిచనరొ
తాము బ్రదుకుటకేది తథ్యంబు తడవ
వనిత[5]కిందాకు మీఁదాకు వాసిగాదె. 80

కII పాత్రాపాత్రత లెఱుఁగక
ధాత్రిని యాచించి ధనము[6]దాఁచఁగనేలా
శాత్రవుఁడు ధనము[7]'మాతా
పుత్రవిరోధాయ'యనుచుఁ బూర్వులు వలుకన్. 81

కII పూనుకొని తన ప్రయత్నము
లే నిజములు[8]దైవ ఘటనలిల లేకున్నన్
మానవుఁ డొకటి దలంచినఁ
దానొక్కటి[9]దలఁచుఁగాక దైవంబబలా. 82

కII కోరిననురావు[10] మనమున
గోరక యుండినను బోవు[11]గుఱు తెఱిగి సిరుల్
పూరుషుల కర్మ[12]ఫలముల
వారకయవి తమకుఁ[13]దామె వచ్చున్ బోవున్. 83

కII మన తనయు లేమి సేసిరొ
మునుపటి[14] జన్మమున నంతమురహరుఁడొసఁగున్
వినుతథ్యంబీభవమున
వనితా నీకింత చింత వలవదు సుమ్మీ 84

వII అని సర్వంబునకు సర్వేశ్వరుండు గలండు. ప్రజల రక్షింపనేన సమర్థుండనే యని విరక్తుండై పలికిన నతని చిత్తంబు మెత్తంజేయం జాలక వెచ్చ నూర్చుచు నచ్చెలువ వెండియునిట్లనియె. 85

---

1 తీరున (ప) తివిరిన (అ) 2 లేమ్మైతి వంౘ్రడు (ట) కోరగదేర్లైతి రంౘ్రడు కుజనులు పరులుం(త) 3 చచ్చిపొయ్యెడి (క) చచ్చిపొయ్యెటి (త) చచ్చిపోయెననుచు (ప) 4 మరువాడు దోషమనక (ట) నాడు తోడ్తోడజనక (త) తోడుచనక (ప) 5 కిందెకు మీదెకు వాసిగాదె (ట) కిందేకు మిందేకు(అ) 6 దాచగనగునే (ప) దాచగదగునే (అ) 7 శాత్రవము ధనము (ప) శాత్రవునధముడు (ట), 8 దైవఘటన లీలలు (ట) 9 తలచుమాట తథ్యంబు (ప) 10 మనముల (అ) 11 గురుతర సిరులా (అ) గురుతుగ సిరులా (ట) ఫలమున (త) 13 తమ్ముదామె (ట) 14 కర్మమున (ట)

**ఇటుల విరక్తుండై పలుకుకుచేలునకు భార్య బదులు సెప్పుట**

కII బలువుగ సత్కర్మంబులు
దలచి యొనర్పకయ ఫలము దైవంబిడునే
[1]హలికుండదనెఱిఁగి విత్తన
మి[2]లవెద వెట్టకయె పండునే[3]ధాన్యంబుల్. 86

ఆII [4]మనుజుడెల్ల[5]ప్రొద్దు మానక సేయంగ
[6]దైవయత్నమొకటితారసిల్లు
గాక యూరకున్న[7]గలదె భుక్తమునకు
దైవ మానుషములు దగసమములు. 87

తేII వరఁగ నట్టింట నుండి నా[8]భాగ్యమనిన
దైవమెక్కడ ఁగొనిదెచ్చి తనకునిచ్చుఁ
జేయఁ దగిన ప్రయత్నముల్ సేయఁ జేయ
నధిప[9]యుట మీఁద వారి[10]భాగ్యంబు కొలఁది. 88

ఆII దేవుఁడిచ్చునటంచు దిన దినయత్నముల్
[11]సేయకున్న నేల సిరులు గల్గుఁ
బళ్లెరముల విడిన పంచ భక్ష్యాన్నముల్
కుడువకున్న నెట్లు కడుపు నిండు. 89

కంII [12]ఇత్తఱిఁ దాసేవింపక
హత్తిన కర్మములు దైవమల[13] మటలిడునే
యెత్తెఱిఁగినరుఁ[14]డొనర్పక
[15]యత్తయు నొనరించు పనులకారడి గలదే. 90

కంII కావున మనుజుఁడు సేయక
[16]దేవుండీయంగ లేఁడు [17]తెగియేమియు నా
నావిధ ధాన్యములుండిన
వావిరి వండక యె రిత్తవంటకమగునే. 91

---

1 హలికుడెదనెరిగివిత్తిన (ట) 2 వెదపెట్టకనె (అ) (త) 3 సస్యంబుల్ (అ) 4 మనుజుడట్లు వనులు (త) 5 డెల్లవనులు 6 దైవఘటనమొకటి (వ) 7 గలవె (ట) 8 నాభాగ్యమనుచు (వ) 9 ఆటమీదఫలము (త) 10 భాగ్యంబులబ్బుకొలది (వ) 11 మరచియున్న (అ) 12 ఎత్తరిదాసేవింపగ (త) ఇత రిదాసేవింపను (ట) 13 మలమట- నిడునే (వ) 14 వరుడొనరింపక (వ) 15 అత్తయ పేయుటయు పనులు వారడిగలదే (క) 16 దైవంబియ్యంగలేడు తగనేమియు (త) 17 తెగియేమైనా (వ)

మ॥ [1]ఇరవౌ నక్రముచే మహాసురునిచే నేనుంగు ప్రహ్లాదుఁడుం
బరితాపించుచు వేఁడఁగా ఁగద పరబ్రహ్మంబు వేంచేసెని
ట్లురు సంపూర్ణ దరిద్రులన్ మనలఁ గుయ్యోయన్న రక్షించు శ్రీ
హరినిష్కాములకేల యిచ్చు బహుళంబైనట్టి యైశ్వర్యముల్ 92

కం॥ భావింపఁగ సత్పురుషుల
భావంబెట్లట్ల తోఁచుఁ బరమేశ్వరుఁడున్
వారిరి [2]శ్రుతి వచనము 'య
ద్భావం తద్భవతి' యనెడి పలుకులు వినరే 93

కం॥ అడుగక యుండినఁ [3]దగువర
మిడునే నిష్కారణంబ యీశ్వరుఁడైనం
బుడమిన్జే యవు చేతులు
కుడువదు నోరనెడు మాటకును దప్పగునే 94

కం॥ తొల్లిటి మునులు తపంబులు
మొల్లముగాఁజేసి శౌరి [4]మొనసిన పిదపన్
[5]సల్లలి తంబుగ వేఁడరె
యుల్లములకుఁ బ్రియములైన యుచితార్థంబుల్ 95

తే॥ మీరు కృష్ణుని మెఱయ నమ్మిన మహాత్మ
లతిశయంబుగ నిష్కాములైననేమి
ప్రజల[6] రక్షించుటెల్లను బరమ ధర్మ
మధిపయాచించు సుకృతాత్ముడైన హరిని 96

తే॥ దైవమవు నీవు [7]రక్షింప దాతవీవు
మాకునే యర్థమును నీవ[8]లోకమునకు
'అన్యథా శరణం నాస్తి'[9] యనెడు పలుకు
తథ్యమయ్యెను మీయందు ఁదాపసేంద్ర 97

క॥ [10]దైవంబె నీకు శ్రీహరి
దావలముగ నీవు మాకు [11]దైవమ వనిలో
భావింపఁగ నిట్లగుటకు
నేవిధముననైన నన్యమెఱుఁగ మధీశా 98

ఆ॥ సకల భువనములను సంరక్షణము సేయ
నీశ్వరుండె కర్త యెంచి చూడ
మమ్ము [12]సంతసించి మన్నింప రక్షింపఁ
గర్తవీవు సకల [13]కార్యములకు 99

---

1 ఇరువై (అ) 2 స్మృతివచనము (త) 3 దగవర (త) 4 మొనసినయంతన్ (అ) 5 సల్లలితంబుగలేరె (క) 6 రక్షించు కర్మంబు పరమధర్మ (త) 7 రక్షించుదాతవీవు (త) 8 లోకములను (క) 9 యనెడి మాట (త) 10 దైవంబునీకు 11 దైవమనిలలో (ప) 12 సంతరింప (ట) 13 కార్యములను (క)

వ॥ అనియనేక ప్రకారంబుల నీతి వచనంబులు గ్గడించి, తొల్లిటి వారునడుచు క్రమంబు ఁదెలిపి, ప్రజా రక్షణంబు పరమ ధర్మంబని ప్రార్థించిన. 100

## కుచేలుఁడు కృష్ణుని యొద్దకు బోవనియ్యకొనుట

కం॥ 'ఆనందో బ్రహ్మ' యనెడు
మానిత వచనంబు దలఁచి మానుషమున
మ్మానిని మృదువచనములకు
మౌనీంద్రుఁడు సమ్మతించె మానసవీధిన్. 101

తే॥ ఎట్టకేలకు ఁదత్కార్యమియ్యకొనుచుఁ
గాంచనాంబరు నెలమి సేవించుటయును
బ్రజల [2]రక్షించుటయు మంచి పని ఘటిల్లె
తీర్థమును స్వార్థము నటంచు [3]ఁదెలిసియపుడు 102

## కుచేలుఁడు గొంపోవఁగానుక నరయుట

ఉ॥ భామినితోడనిట్లని యోఁబద్మదళాక్షుని గానఁ బోయెదన్
గోమలి బల్దరిద్రులము కొంచుఁజనన్ మనకెద్ది వస్తువా
స్వామికిష్టమైన యది సంగతి యే చనరిత్త చేతులన్
[4]భూమి పులొద్దకున్ సతుల పొందులకున్ గురులున్న చోటికిన్ 103

చం॥ [5]గరిమ సమస్త వస్తువులు గల్గినవారరుదేరఁజాలఁబె
ద్దఱికముఁజేసి పంపుదురు తండ్రి, సుతుండను జన్ముఁడైన
ల్పరిభవమాచరింపుదురు భామిని పేదఱికంబు దోఁచినన్
సిరిచెడిపోయి చుట్టముల ఁజేరిన లాఘవమందకుండునే 104

తే॥ తద్జ్ఞులు 'నతిపరిచయాదవజ్ఞత' యన
నాది 'సంతతగమనాదనాదరో భ[6]
వతి 'యనంగ నహీనార్ధ వాక్యనిచయ
ములను బురుషుండు పరిభవంబున వసించు 105

కం॥ సధనులకడకు దరిద్రుం
డథవాపో[7]రాని పట్ల నరిగిన యెడనే
విధమునఁ గైకొని చనవలె
[8]నధికములగు వస్తువులు సితాంబోజముఖీ 106

---

1 మార్దవమొప్పన్ మానినిసంభాషణలను (ప) 2 రక్షించుటకు (ట) మదినియుప్పొంగెయిది మంచిపనిఘటిల్లె (ప) 3 తెలివినపుడు (క) తెలిసి నపుడు (ప) 4 భూవిభులొద్దకున్ (క) 5 కలిమి (క) గరిమె (అ) 6 భవతి యనఁగపారెహిత్తుల భవనములకును జనెడు పురుషుండు (అ) 7 పోరాదువారి కాత్మచెలంగ (క) 8 అధికసువస్తువుల నికిపి తాంభోజముఃఖీ (ట)

తే॥ ఎట్టకేలకు [1]విహితుల యిండ్ల కేఁగి
పెరిమెదానూరకుండుట [2]పెద్దతనము
గలదె యడుకుట కంటెబల్ఫులకఁదనము
'[3]యాచనాంతం హిగౌరవ'మ్మనవ ధూటి 107

కం॥ రంజిలి తామును మున్నుగ
నంజిలి పడకిచ్చెనేని నయముగ వారున్
[4]గొంజక నిత్తురు క్రమ్మఱ
ముంజేయియు నాడెనేని మోఁచేయాడున్. 108

తే॥ కావున సమస్త సామ్రాజ్య కర్తయైన
యిందిరాధీశునకుఁ గాను కీఁగవలయుఁ
'జంద్రునకు నూలిపో' గన్న [5]సామెతగను
గానవేమైన మనశక్తి గల కొలంది 109

కం॥ [6]కొండికలము [7]మనకెంతటి
దండి గలుగు నధిక వస్తుతతి హరికొసఁగన్
గొండంత దేవునకు మఱి
కొండంతయుఁ [8]బత్రియిడెడు కుశలులు గలరే 110

మ॥ పరఁగన్ సర్వ నదీనదాంబువులకున్ బట్టైన వారాశికిన్
బరితుష్టంబులె మంచు బిందువులు సంపన్నాఢ్యుడౌ శౌరికిన్
బరిధానంబొక లాభమేయయిన [9]నిప్పాటిన్నిరర్థంబుగా
[10]నురువౌ భక్తి యనంగఁ [11]జొప్పడు ఁగదాయూహింప నిద్ధాత్రిలోన్ 111

కం॥ అది గావునఁగార్యార్థము
మదనగురుని కడకునిపుడు [12]మనమూరకపో
విదితముగాదే వెరవన
ముదితయుఁ [13]దనవిభునివాక్యములకు నలరుచున్ 112

కం॥ వెరవుగఁ గొన్ని దినంబులు
[14] నిరతంబుగ నుపవసించి నివ్వరి యడుకుల్
[15] దొరకినయట్లు వధూమణి
వరుని కుచేలమున ముడిచి పనిచినయంతన్ 113

---

1 హితవర్లయిండ్లకేగి (అ) యతడార్తయిండ్లకేగి (క) 2 పెద్దరికము (అ) 3 అనుచుతెలియగ వలదెభావముధూటి (ప) 4 కొంజకయిత్తురు (అ) 5 సామిత (ప) సామితి (అ) సామతె (ట) 6 కొండికులము (ట) 7 మనమెంతటి (అ) 8 పత్తిరిడెడు (ట) ప్రతిడెట్టి గా (క) 9 వివేదింపగా (క) 10 నుడుతాభక్తి (ప) 11 జెప్పెడు (క) 12 మనమూరకె (ట) మనవూరకె (అ) 13 తనవుగనివాక్య (క) తనమొగని (ట) తద్విభునివాక్య (అ) 14 దొరకినయన్ని (క) దొరకినయెల్ల (అ) 15 బిరుసుకుచేలమున (అ) సరుసుకుచేలమునముడిచి పని వినుమనినన్ (క)

## కుచేలుఁడడుకులఁగొనిపోవుట

కం॥ ధరణీసురుఁ డాదినమున
హరిసేవార్థంబు గదలి యతి దూరముగా
గిరులును కానలు నదులును
బురములు గ్రామములు [1]గడచిపోవుచు మదిలోన్ 114

తే॥ ఆత్మబుద్ధియె[2]కడు సుఖంబన్నిటికిని
జెలఁగి గురు బుద్ధి కొంత విశేషమరయఁ
బరుల బుద్ధి వినాశంబు పరఁగఁజేయు
స్త్రీల బుద్ధులు ప్రళయముల్చిత్తగింప 115

కం॥ అది యెఱిఁగియు [4]నీరీతిని
బదపడి యాయూరి యూరి పథముల వెంటన్
[5]బెదరక వచ్చితి నేటికి
[6]పథములమె ప్రయాణములకు శక్తులమె తగన్. 116

కం॥ పుడమి విభులెందఱెందఱో
[7]పొడ గాన్పులు లేక ద్వార భూముల యందున్
బడి కాఁ పులు పడియుండఁగ
బడుగులకేలబ్బుఁ గంసభంజను సేవల్ 117

ఉ॥ ద్వారక యెంతదవ్వొకడు దారుణమైన మహా సముద్రమే
తీరున దాటుదందు వసుదేవ తనూజుని [8]దివ్య మందిర
ద్వారము లెట్లు సొత్తును వృధా సనుదెంచితిఁగంసవైరినన్
జీరికినై [9]వనుంగొనునె చిత్తమునం గరుణించియుత్తఱిన్. 118

ఆ॥ కల్పవృక్షమునకు[10] గదిసి కాయడిగిన
చందమునను శౌరి సమ్ముఖమునఁ
జేరి తుచ్ఛమైన సిరిఁవేడికొన నయ్యొ
నాన [11]దోస మెఱుఁగదనుట నిజము. 119

వ॥ అని డోలాయ మానమానసుండై యమ్మౌనివర్యుండు తనమానినిచేసిన యుపాయంబునకు రోయుచు, నూరూరి తెరువు లెరుంగక, యెడ నెడల నెదురైన జనుల నడుగుచు, నెడారులైన దుర్గమస్థలంబుల మార్గంబులు గడచి, యరణ్యంబులు సొచ్చి, నడుచుచుంగంటకంబులు పాదంబులు నాఁటినందీయనేరక గొంటువడి కుంటుచుఁ జండతరములైన వేసవియెండల బెండువడి తరుషండంబుల నీడల నిలుచుచు నిరాహారుండై వివిధసమయంబుల బురంబులోపలికరిగి, జనంబుల సందడింబడనొల్లక,గుడి

---

1 నడచిపోవుచు (ట) 2 సుఖంబగు నన్నిటికిని (క) 3 విశేషపదము (క) 4 నీరీతిన (ట) 5 బ్రిదుకుల వచ్చితి (క) బ్రదివినవచ్చినవేటికి (ట) 6 సదయులకు (అ) సదలములె (క) పదములవె (ట) 7 పొడగనువులు (ట) 8 దివ్యకాంచన (త) 9 గన్గొనునె (వ) 10 కదళికాయడిగిన (అ) 11 ఆనదోష (అ)

గుండంబుల పంచల నొదిగి లజ్జించుచు, మున్ను మున్నుగా లేచి నడచుచు, ముందరి యోజనంబులెన్నుచుఁ బెక్కుదాటిన దినంబులు లెక్కపెట్టుచుఁ దట్టుపడి యల్లనల్లన జనియెను. 120

వ॥ అని చెప్పిన— 121

కం॥ గుఱుతుగవిని యభిమన్యుని
వరతనయుఁడు శుకునిఁ జూచి వాంఛలు నిగుడన్
[1]బరికింపఁగనెట్లయ్యెడుఁ
దరువాతి మహాకథావిధానంబనినన్ 122

## ఆశ్వాసాంతము

మ॥ కురువంశాంబుధిడ బాగ్ని హరి యక్రూ[2]ంబరీషాది
[3]సత్పురుషానీక శరణ్య గోపకనిజాంభోజేక్షణా మన్మథా
పరిహాసీకృత పద్మ సంభవ దృఢ ప్రజ్ఞానముల్లాస శ్రీ
తరుణీ నేత్ర చకోర శీతకర దైత్య ధ్వంస కంసాంతకా. 123

కం॥ కాలయవన సాళువ శిశు
పాల జరాసంధ కంస [4]బలభంజనకు
బ్జాలల నాది మనోహర
మాలాకార[5]ప్రసూనమాల్యా భరణా 124

తోటకము॥ కరిపోషణ నిర్జిత [6]కంజభవా
[7]మురళీరవ గాన విమోహరవా
వరవర్ణిత యాదవ [8]వంశభవా
[9]గురు ధైర్యసురక్షిత గోపధవా 125

గద్య॥ ఇది శ్రీమద్భ్రమరాంబికావర ప్రసాద లబ్ధ సరస కవితా ధురంధర [10]సకల కవిమిత్ర యల్లనామాత్య పుత్ర సకల సద్గుణ విధేయ గట్టు ప్రభు నామధేయ ప్రణీతంబైన కుచేలోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు ప్రథమాశ్వాసము సమాప్తము.

---

1 బరికింపఁగనిట్లనియెను(ట) 2 బరీషార్జునాద్యురుకారుణ్యపయోధి గోపికనిజాంభోజేక్షణా మన్మథత్ (ప) 3 పురుషావేక (అ) 4 బలిభంజన (త) 5 ప్రసాదమాల్యాభరణా (అ) 6 కంజధరా (క) 7 మురహార వగధరముక్తభవా (ప) 8 వంశధరా (క) 9 గురువర్యసురక్షిత గోపగవా (క) 10 సకలసుకవిమిత్ర (ట) సరసకవిమిత్ర (అ)

# ద్వితీయాశ్వాసము

శ్రీ రుక్మిణీ మనోహర
కారుణ్య సుధా సముద్ర! కంసమథన! య
క్రూరాంబరీష సుజనా
క్రూరచిదానంద! కృష్ణ! గోప! ముకుందా!

వ॥ దేవ యవధరింపు మని పరీక్షిన్నరేంద్రునకు శుకయోగీంద్రుండిట్లనియె [1]అంత శ్రీ హరి చరణస్మరణ శీలుం[2]డగు కుచేలుండట్లరుగుచు 2

కం॥ కనుగొనియె మీనకర్కట
[3]కనదురగవిముఖ్య జీవగర్వోల్లాసిన్
ఘన కల్లోల విభాసిన్
వనరాశిన్ ద్రీవలవణ వారి [4]విలాసిన్ 3

వ॥ కాంచి తదీయ మహిమా[5]భిరామతకు మనంబున వెఱఁగు పడి, యాజ[6]లధి కర్ణధారకునింద్రార్థించి కడచి యచ్చట. 4

మ॥ [7]బలసంరంభముతో సువర్ణఘటిత ప్రాసాదయూథంబుతో
బలభద్రాదిక యాదవ [8]ప్రభులతో భద్రేభ [9]యూథంబుతోఁ
గల కంఠీ నిచయంబుతో బహుతురంగ శ్రేణితో సంతతో
[10]జ్జ్వలమై యొప్పెడు ద్వారకానగర మొప్పంజూచి హర్షిం[11]చుచున్. 5

కం॥ [12]వాఁకిటి కావలివారలఁ[13]
గైకొని యాశీర్వదించి కదలికుచేలుం
డాకాంక్షఁ [14]జొచ్చి జనముల
[15]మూకల సందడిఁ యొదిగి[16] మూగిన యంతన్ 6

గీ॥ గాలిఁబోయెడు వరు[17]గాకుగతి గరంబు
తూలఁబోయెడి[18] నేమ్మేని తోడఁ జనుచు
విప్రవర్యుండు కన్ను[19]ల విందుగాఁగ
వీక్షణముచేసె రుక్మిణీ విభుని పురము 7

---

1 అనంతచరణస్మరణ (ప) 2 శీలుండగుచు (ట) 3 ఘనదురగ (ట) కనుదురుగవి (ప) ప్రముఖ జీవగర్వోల్లాసిన్ (త) 4 వారివిభాసిన్ (అ) 5 మహనీయవిభవా (ట) 6 జలధిగడచుటకు (ట) 7 బలుసంరంభము (ట) 8 ప్రభలతో (ట) 9 భద్రేభజాలంబుతో (అ) 10 మోజా (క) 11హర్షింపుచున్ (అ) (ట) 12 వాకిట (క) 13 వారిని (ప) 14 ఆకాంక్షఁజూచి (ట) ఆకాంక్షఁజొచ్చె (అ) 15 సందడికి (త) 16యులతన్ (క) 17 గాలిఁబోయిన వగుడాకు (క) వగడాకు (త) 18 నెమ్మది (క) నెమ్మేను (ప) 19 వీనులవిందు (క)

సీ : ఎందుఁ[1]జూచినను రాకేందు బింబాస్యల
గములు నటించు రంగస్థలంబు
లెచ్చోటికేఁగిన నెలమి నేణీమద
కాశ్మీర సిక్త శృంగాటకంబు
లేగృహంబరసిన హేమ నిర్మిత రత్న
భూషణోజ్జ్వలలైన పుణ్య సాధ్వు
లేవాడఁ జొచ్చిన నిక్కు రంభాస్తంభ
భూరి పల్లవ గుచ్ఛ తోరణంబు.

గీ ॥ లెచటఁ [2]జూచినఁ గేళీమహీధరములు
నెందుఁబోయినఁ దురగ భద్రేభ [3]ఘటలు
ప్రస్తుతింపఁగ శక్యమే బ్రహ్మకైనఁ
దన్మహారాజధాని సౌందర్యమహిమ. 8

గీ ॥ ఏమిచెప్పదునిఁక నా మహీసురునకుఁ
ద్రోవ నడచిన బడలిక ల్దూరమయ్యె
దప్పి యాకలియును మానెఁ దాపముడిగి
[4]తనివి సంధిల్లె దత్పురీ దర్శనమున 9

వ॥ మఱియు నతండు శృంగారంబులుగాఁ బ్రతి గృహాంగణంబుల యందుఁ బెట్టిన గట్టి ముత్తియంబుల రంగవల్లులను గనుంగొనుచు, నెడనెడలందు[5]టుములు గట్టి దేవకి పట్టిని పాడగనఁ[6]గదలు పుడమి విభుల సందడింబడి యొదిగిలంబడుచుఁ [7]గిడు మేలు గలిగి మదకీలాలంబులు దొఱఁగవిడిచి యాలానంబులం గట్టువడక పట్టణంబునందిరుగు మదశుం[8]డాలంబులకు వెఱచి యుఱుకుచు గేహంబుల వెడల దిగిచి సాహిణుల మోహరించి యదల్చుచు గిలుకలు గదల్చి తగువారు[9] కోలలు వైచి న వీధి వీధుల జగన్మోహనంబుగా నటించు వాహనంబుల మోహరంబులఁ జూచుచుఁ జేడియలతోడఁ గృష్ణుండు క్రీడించు తెరంగులు వాడ వాడల మేడ మేడల గోడల వ్రాసిన చిత్ర రూపంబులకు విచిత్రంబు నొందుచు, వెండియు ముకుందుండు కంస జరాసంధ శిశుపాల సాళ్వ యవనాదుల జయించిన మంచి మంచి గీతంబులు వినుచుఁ బంచమస్వరంబులచే మొఱయించు విపంచీ నాదం బుల వీనుల నాలకించుచు, నంచె [10]లంచెల రాయంచల వలె విహరించు చంచలాక్షుల నిరీక్షించుచు, భేరీ మృదంగ [11]శంఖ కాహళ నాదంబులకు బ్రమోదించుచు జని చని యతి దూరంబున శౌరి మందిర ద్వారంబుఁ గనియె నప్పుడు.

---

1 ఎందెందుజూచిన యిందుబింబాస్య (క) 2 ఎచట దలచినకేళీ(త) 3 భద్రేభఘటము (త) 4 తనవి(అ) తనువు (క) 5 గములుగట్టి (ప) గుములుగట్టి (క) 6 పాడగానక కదలు (ట) 7 గేలుమేలుదలకీ లాలంబుదొరుగవిడంబడి (క) 8 శుండాలజాలంబులకు (క) 9 వారుకోలవై చివిడిచి (త) 10 రాయంచలంబడి విహరించు (త) 11 శంఖకాహళమురజాది (త)

ఉ॥ [1]అచ్చటి వారణంబులు హయంబులు [2]భృత్యులు శౌరిఁ గానఁగా
వచ్చిన రాజ సంఘములు వారిజ నేత్రల తండ తండముల్
పెచ్చు పెరింగియుండె [3]ఁదలపెన్ తలజొచ్చిన యట్ల దొడ్డగాఁ
[4]బొచ్చెములేక పై నిసుకపోసిన రాలనియంత సందడిన్. 11

గీ॥ అట్టి బలుదొడ్డ సందడి నటు[5]గమించి
సూచి యొక్కింతయును జొరఁ జోటులేక
యెట్టకేలకుఁ బెనుగొందు వీఁగి యీఁగి
చేరె నా రాజ[6]మందిర సీమయందు. 12

కం॥ తిరుమణి తిరుచూర్ణ గదా
ధరులను ఘన శంఖచక్ర [7]ధారణులను శ్రీ
కరలాంఛన ఘన కనకాం
బరులను దద్ద్వార దేశపాలుర గనియెన్. 13

గీ॥ కాంచి వైకుంఠ దివ్యలోకమున నున్న
జయ విజయు లొక్కొ వీరు [8]నిస్సంశయముగఁ
గాకయుండిన మా[9]యయ్యగారులైన
వైష్ణవోత్తము లెవ్వరు వసుధ ననుచు 14

సీ॥ [10]ఎలమి నూకలు గట్ట నెడ మించుకయు లేక
చినిగిన కడు ప్రాత చేలతోడఁ
బెనఁగొన్న యాకటి పెల్లనఁ గడు డస్సి
మిక్కిలి కృశమైన మేనితోడ
గక్క కేశంబులు గడ్డంబు [11]మీసము
వెరివిగట్టిన బలు తిరులతోడ
మానని దీర్ఘమై మార్గ ఖేదంబునఁ
బ్రకటితంబగు బడలికలతోడ

గీ॥ దాహమొద[12]విన వదన పద్మంబుతోడ
లావెడలి[13]వేలు పడిన శల్యములతోడ
జనుల కెవ్వరికిని జూడననువుగాక
యెదుట నిలుచుండి వారల కిట్టులనియె. 15

కం॥ ఆశీర్వాదంబులు మీ
కోనుజన శ్రేష్ఠులార! యుత్తములారా!
వాసిగ శ్రీవల్లభునకు
దాసులరై [14]నార లెంత ధన్యులొ జగతిన్. 16

---

1 అచ్చట (అ) 2 హయంబులుడిగ్గియు (అ) 3 తలపేను తల న్వెసఁజొచ్చునట్లుగా (ట) తలపేను వెసన్దలి (క) 4 యొచ్చము (ట) 5 నధిగమించి (త) 6 రాచమందిర (త) రాజుమందిరా (ప) 7 ధారిణులను (ప) ధారుణులను (ప) చక్రధారుల (త) 8 వీరల సంశయముగ (ట) లనువారలసంశయముగ (త) వీరనుసంశయమున (ప) 9 యీయలంకారులైన (క,ట) 10 వెడమి నూకలు (వ) చెలమి (త) 11 మీసంబు (ప) 12 యేరుపడిన (అ) (త) 13 ననవులేక (త) జూడనడ్డలేక (ప) 14 నెంతధన్యులు (త)

గీ॥ శౌరి సామీప్య [1]పదములు సంగ్రహించి
విష్ణు సాయుజ్యములచేత వెలసినారు
బ్రహ్మ నారదులైన మీపాటివారు
గారు శ్రీహరి పాద కైంకర్యములను. 17

గీ॥ మిమ్ముఁగనుగొన్న యప్పుడే మిగుల హరిని
జూచినటువలెనయ్యెనా [2]చూడ్కులకును
నెంత పుణ్యంబు[3]చేసితిరీభవమున
సకల కార్యంబు లిఁక మాకు సఫల మగును. 18

ఆ॥ చిన్ని ప్రాయముననుశ్రీకృష్ణుడుఁను నేను
గూడి యాడి [4]చదువుకొన్నవార
మెఱుఁగు [4]మున్ను నన్ను నీశ్వరుఁడు గుచేలుఁ
డనెడి [5]పేరివాఁడ నవని సురుఁడ 19

గీ॥ కర్ణధారకు వలనఁ జక్కఁగఁ బయోధి
దాఁటి తీరంబుఁ జేరు చందమున మీయ
పార కరుణా విశేష [6]మాధారముగను
శౌరిఁగని యెద నాపదల్ చాలఁగడచి 20

కం॥ నే వచ్చిన యీ రాకలు
దేవకి నందనునకిపుడె తెలుపఁగ వలయున్
మీవంటి [7]ఘనుల వలనను
శ్రీ వల్లభు సముఖమునకుఁ జేరఁగవచ్చున్. 21

వ॥ అని ద్వారపాలకులం బ్రార్థించు ధరణీ [8]బృందారకుని వికృతరూపంబుఁ
గనుఁగొని తత్ప్రాఙ్గణంబుల నున్న జనంబులు పరిహాసంబునకు నిట్లనిరి. 22

గీ॥ సకల సామ్రాజ్య విభుఁడైన శౌరియేడఁ
గాసు చేయని వృద్ధ మర్కటమువంటి
నీచ బాపడ నీవేడ [9]నిన్నుఁ జూడ
నతనిఁ జూడఁగఁ గరిమశకాంతరంబు 23

కం॥ గర్వాంధు లిప్పుడెక్కడి
[10]నిర్వాణముల [11]వనిపతుల నీతులు [12]"దుష్ట
స్సర్వత్ర పూజ్యతే" యన
నుర్విన్ [13]బూటకులుగాని యొప్పరు నృపతుల్ 24

---

1 సామీప్యసదవులు (త) 2 మాచూడ్కులకును (ట) 3 చేసితినీభవమున (ప) 4 చదువుకొనినవార (త) 5 డనెటిపేరువాడ (త) వెర్రివాడ (ప) 6 ఆధారమగును (ప) 7 ఘనులకెల్లను (త) 8 భూసురుని వికారంబు (ప) వికారాకారంబు (అ) 9 నిన్నుజూడు మతని జూడుము (త) 10 నిర్వాహకు (ట) 11 అవనిపులకు (త) 12. డంభస్సర్వత్రపూజయేత్తనుచు (ట) దంభస్సర్వత్ర (ప) 13 బూటకులగాని (త)

ఆ॥ చిన్ననాఁడు నీవు చేసిన యుష్టంబు
మఱవకున్న వాఁడె మాధవుండు?
[1]సిరిగల తనితోడఁ జెలిమి వర్ధిల్లఁగాక
పేదవారి మీఁదఁ బ్రేమ గలదె? 25

చ॥ ఎఱుఁగరు [2]దొడ్డ కొంచెమును నెంతటి [3]మిత్రులనైన నాత్మమం
దిరములు [4]చేరనీరు కడుతెంపునఁజేసిన మేలు లప్పుడే
మఱతురు, తండ్రి నన్నలఁ గుమారులఁ ద్రుంతురు రాజ్యకాంక్షచేఁ
గరుణ యొకింతలేని [5]మహికాంక్షుల రాజుల నమ్మవచ్చునే? 26

కం॥ సత్య విహీనులు నిత్యా
నిత్య వివేక [6]రహితులవనీ [7]పతులు మహా
హత్యాది కర్మ దుర్మదు
లత్యుగ్రులు నృపులుసూఁడ [8]నాసక్తులిలన్ 27

కం॥ తనవారి నెఱుఁగ రెవ్వరి
[9]నెనయరు వాక్యములు కడు విహీనస్వరముల్
[10]విని చెవుడుమగ [11]ని గ్రుడ్డియు
జననాథుల కెల్ల [12]నివియు సహజ గుణంబుల్ 28

ఆ॥ మోదమునను 'వస్త్రముఖ్యంత్వలంకార'
మనెడు నీతి వాక్య మరయ మంచి
కోకలయిన లేవు కువల [13]యాధీశుల
కొలువు కూటములను [14]మెలఁగు టెట్లు? 29

ఆ॥ [15]కండ మెండు లేదు కాయంబు ననుజూడ
వస్త్రహీనుఁ డవుసువస్తువులగు
[16]భూషణములు లేవు [17]భూమి భర్తల నెట్టు
లవని సుర [18]పృశించెదవు క్రమమున 30

కం॥ కుల హీనత [19]హీనతయగు
నిల జనులకు వస్త్ర హైన్యమే హీనతగాఁ
గలుగ వలెన్ శుభ్రములగు
వలువలు పరిపాటి నెంత వారికినైనన్ 31

---

1 సిరుల వానితోప (త) చెలిమి వర్తిలు (ఆ) సిరియగలుగువారి చెలిమి వర్ధిలు(త) 2 దొడ్డకొంచెములు (వ) 3 యిష్టులనైన (అ) 4 చార్గనీరు (అ) చేరనీని (త) 5 బలుకష్టులు (వ) 6 రహితులవివేకులును (అ) 7 నీచకులు (త) 8 నూతనాసక్తు (ట) 9 నెనయింపరు వాక్యముల హీనస్వరముల్ (త) 10 విను (ట) 11 కను (ట) 12 కివియువిగుల సహజ (ట) కనిగుట్టును (త) 13 ముఖ్యంతలంకార (అ) వాక్యమమరమంచి (ట) కువలయాధీశ్వరు (వ) 14 సెలగుటెట్లు (అ) 15 కండయేమిలేదు (వ) 16 భూషణములు నాస్తి (ట) 17 భూమి భర్తలకెట్లు అవనిసురదిసించదయ్యనీవు (ట) 18 దృశించెదవు గ్రమమున (త) 19 హీనంబున (ట) హీనంబగు (వ)

కం॥ కోకలు డబ్బులు సొమ్ములు
[1]జోకలు గల యట్టి నరులఁ జూచిన [2]సభకున్
గైకొని యిటు రమ్మందురు
చీ కొట్టుదురంద[3]ఱును గుచేలుండైనన్ 32

ఆ॥ ఇంటి దీపమనుచు [4]నిగిలించుకొని [5]ముద్దు
పెట్టుకొన్న నోరు బిట్టుగాలు
నృపుల సమ్ముఖంబు నెనరు [6]లెంచుచుఁజను
వాఁడు మిగులఁబరి [7]భవంబు నొందు. 33

సీ॥ [8]ధరణి 'శరీర మాద్యంఖలు ధర్మసా
ధన' మను నీతి శాస్త్రంబు దలఁచి
తనువు పోషణ చేసికొని యర్ధమార్జించి
యతిథి పూజలు దేవతార్చనములు
స్నానంబు సంధ్యయు జపము హోమంబును
గావించి పుణ్య మగ్గలము గాఁగ
[9]కూడఁబెట్టక కల కొద్ది యందరితోడ
ననుభవింపఁగ వలె ననుదినంబు

గీ॥ వ్రతములంచును వివిధోపవాసములను
దారసుత మిత్రభృత్యులు [10]తాను వగల
దోలు [11]నస్థులు వ్రేలాడఁదూలి తూలి
దేహ మెడలిననేమి [12]సాధింపఁగలరు? 34

చం॥ నయముగ మేనుపెంచి నరనాధునిగొల్చి సమస్త భాగ్యముల్
ప్రియముగఁ గూడఁబెట్టి కడు పేర్మి వహింపగ లేక యుండినన్
జయమగునే మనంబునకు సంతత ధర్మములాచరింపని[13]
శ్చయముగ 'దుఃఖితేమనసి సర్వమ సహ్య' [14]మనన్ మహీసురా? 35

కం॥ ద్రవిశేశుఁడితఁడె మాగధ
కువలయ విభుఁడి తఁడె వీఁడె కొంకణ పతిశ్రీ
ధవుని గనలేక తిరిగెద
[15]రెవని న్నోఁ్పలెదవు నీవు నిందటిలోనన్ 36

---

1 జోకతో (ట) 2 సభికుల్(ట) నధివుల్ (అ) 3 రందునిల (ట) 4 నెగ్గించుకొని ముద్దు (త) మోసపెట్టినట్లు (త) 5 బెట్టుకున్నమోర బెట్టు సుడుసు (అ) సుడియు (ట) 6 నేమైన తెచ్చిన (ట) నెనరులెంచకచను (త) 7 భవమునుబొందు (త) 8 ధరణిశరీరమాద్యం తంబుఖలు ధర్మసాధనమను నీతిశాస్త్రమమరు (అ) ధర్మశాస్త్రంబు దలఁచి (త) 9 కూడబెట్టక కులగోపకమొనరంగ వనితలతోననవరత సుఖము (త) 10 దారువగల (ట) 11 తోలునెత్తురు వ్రేలెడ (అ) 12 సాధింపఁగలవు (త) 13 నిశ్చయమగు (అ) 14 మనా (ట) 15 రెవరిన్నోఁ్పలెదవు (ట)

తే॥ ఎంత యోగ్యుఁడవైన [1]నీవిట్లు నలిగి
పోవఁబోసఁగంగఁజాతురే భూమి పతులు
[2]దానమునఁదొల్లి 'వేదపాఠోనిరర్థ
కు[3]యను మాటలు నిక్కముల్ గావె తలఁప 37

తే॥ పేదబాఁపఁడనీవంటి బీదలకును
వశమె పొడఁగన శౌరి షోడశ సహస్ర
భామినుల తోడలోపలి భవనమునను
హేోన్నతైశ్వర్యవంతుఁడై యున్నవాఁడు 38

కం॥ తమతమ మనవులు దొరకక
[4]నెమకుచుఁదిరుగుదురు [5]వీరన్నపవర్యులు [6]బల్
సముఖములఁట సులభములే
భ్రమలంబడకరుగ వయ్య [7]బాఁపఁడ యింకన్ 39

వ॥ అని పలికెడు పామర జనంబుల వచనంబులకు దరహాసంబులు నెఱపుచుఁ బరమ విజ్ఞాన ధర్మాచారులును శాంతా కారులును క్రోధదోషవిదూరులును పరోపకారులునునగు ద్వారపాలకులు వారి కలకలంబులు వారించి యిట్లనిరి. 40

కం॥ గర్వముడిగి యెట్లుండిన
[8]నిర్వాణులకేమి యెగ్గు నీతిగ 'విద్వాన్
సర్వత్ర పూజ్యతే 'యన
[9]నుర్విన్ విద్యాధికుండు యోగ్యుఁడు సభలన్ 41

గే॥ రమణ [10]'వివిధానితోయ పూర్ణాని' యనఁగ
ఘన నదీ స్నానముల యందుఁగలదె ముక్తి ?
పరగనిటువంటి [11]విజ్ఞాన పురుష వరులఁ
బూజలొనరించు కంటెను బుణ్యమెద్ది ? 42

కం॥ వారలె [12]చీరలు తులసీ
హారంబులె భూషణములు ననవరత సదా
చారమె ధన మూర్వీబ్బం
దారకులకుఁగాక [13]రిత్తదంభము లేలా ? 43

---

1నీవెట్లునొగిలి (ట) నీవిట్లు నరిగి పోయిననె సంగచూతురు (త) 2 దానముల (త) 3 కమనువమాటయు నిక్కముగాదె తలప(ప)4 నెముకుచు (త) 5 వీరు (ప) 6 తత్సముఖంబులు (ప) (త) తత్సుముఖములు (త) 7 పాపఁడ (త) 8 నిర్వాణికి (త) 9 విద్యా సర్వత్ర భూషణంబను ......జగతిన్ (ట) నుర్వర విద్యాధికుండె (త) 10 తీర్థాని తోయ పూర్ణాని (ట) 11 సుజ్ఞాన(త) 12 చీరెలు (ప) 13 డంబంబేలా (ట) డంభము లేలా (త)

గీ॥ కడఁగి శపియింప శాపంబు గ్రమ్మఱింప
విప్రుఁడె సమర్థుఁడట జగద్విదితముగను
బ్రాహ్మణాధీనములు మహీ పతుల రాజ్య
భోగ వైభవములు సారెఁబొగడ నేల ? 44

గీ॥ పుడమిలో నెట్టి యుండినఁ బూజనీయుఁ
డఖిల ధర్మార్థ నిర్ణయుండరసిచూడ
బ్రాహ్మణుఁడు క్షత్రవైశ్యశూద్రాది వివిధ
వర్ణముల కెల్ల గురువు దేవరయుఁగాఁడె ? 45

ఆ॥ [1]దేవుఁడనఁగ నెట్టి తెఱఁగు వాఁడెఱుఁగము
పుడమి కెల్ల వేల్పు భూసురుఁడెవి [2]
నోదముగను 'బ్రాహ్మణో మమదేవతా'
యనెడు మాట శౌరియాడెఁదొల్లి 46

మ॥ తిరిపెంబెత్తిన వస్త్రహీనుఁ డయినన్ దీనత్వముం బొందినన్
ధరలోనన్ మఱియెట్టులుండిన మహాధన్యుండు గా కల్పుఁడే
సరసీ సంభవ సంభవాననమునన్ జన్మించెఁ బూర్వంబుసు
స్థిరతన్ విప్రుఁడు 'బ్రాహ్మణోస్యముఖమాసీత్త'[3] ంచుఁ జాటెన్ శ్రుతుల్.
47

ఆ॥ నుతులు సేయ 'బ్రాహ్మణో భోజనప్రియ'
యనఁగ విప్రవర్యుఁడారగించి
తృప్తిఁబొందెనేని దేవుఁడాయన్నప్ర
దాతకొసఁగు నధికతర శుభములు 48

ఆ॥ జలజ నయనుఁడాది సకల దేవతలకు
ముఖములవనిసురులు మొదలు సూడ
[4]నిఖిల కర్మములకు నిర్జరుల్ బ్రాహ్మణ
భోజనములఁ దృప్తిఁబొందవలయు 49

ఆ॥ బ్రహ్మకులుని తిట్టు బ్రహ్మాస్త్ర మమ్మహో
త్తముల దీవనలు సుధారసములు
వివిధ శాస్త్రములను, [5] 'విప్రవాక్యంజనా
ర్దన' యనంగ మాట తప్పగలదె ? 50

---

1 దేవుఁడనఁగనెట్టి తెరుగు ముందెరుగము (ప) 2 వినోదమునకె (ట) ప్రేమమునను (ప)
3 మాసీదంచు (ప) 4 నిఖిలకర్మములును (అ) 5 విప్రవాక్యోజనా (ట)

ఆ॥ తాపసులకు నేల ధవళ వస్త్రంబులు ?
[1]భూమి సురుల కేల భూషణములు ?
విప్రవరుల కేల వివిధాన్న పానాది
భక్షణములు ? భోగపరులె ద్విజులు ? 51

ఆ॥ పూర్వసఖుఁడు గానఁబురుషోత్తమునిజూడ
[2]వచ్చినాఁడు గాని వాంఛనితఁడు
సంశయింపనేల సకల దేశావనీ
పతులు [3]భృత్యసములు బ్రాహ్మణులకు 52

వ॥ అని సకల సద్గుణ విభాసురులగు భూసురుల ప్రభావంబులు దెలిపి తద్ద్వార పాలకులు కుచేలు నచ్చట నునిచి, పచ్చని కోక వానికీ ముచ్చట తెలియంగించు వారైచని, బహువీర భట పరిపాలితంబులైన యమ్మహాద్వారం బులు డెబ్బదిరెండునుంగడచి, అచ్చటఁ బ్రౌఢాంగనా శతంబులు వేత్రహ స్తతఁ బెక్కులు గాచియున్న లోపలి వాఁకిట నిలిచి, శౌరికిఁ దమరాక యెఱింగించి, తదనుజ్ఞాతులై చొచ్చి, తారకాగణ పరివృతుండైనరాకాసుధా కరుంబోలెఁ గాంతాజన మధ్యంబుననున్న [4]కంతు జనకునింగాంచి యిట్లని స్తుతియించిరి. 53

మ॥ "వనజా తాయతలోచనాయ మురవిధ్వంసాయ కంసాదిదు
ర్మనుజాధీశ విభంజనాయ మురళీ మాధుర్య గానామృత
స్వనసంపూర్ణ దిగంతరాయ బహు సంసారాయ నారాయణా
యనమో" యంచుఁ బ్రణామముల్సలిపి బ్రహ్మానంద సంపూర్ణులై 54

తే॥ అవధరింపుము బ్రహ్మ కులాగ్రగణ్యుఁ
డొకఁడు తల వాఁకిటికి వచ్చి యున్న వాఁడు
[5]ఇచ్ఛఁదన రాక మీకెరిగింపుఁడనుచు
మసలి ప్రార్థించుచున్నాడు మమ్మునేఁడు 55

కం॥ తనపేరు కుచేలుండట
జన సన్నుత! మీకుఁబూర్వ సఖుఁడట, మీతో
నొనఁగూడి చదివినాఁడట
మునుమీర తెలియంగుదురట మురకంసారీ! 56

గీ॥ విన్నవార్తలు మీతోడ విన్నవింప
నిటకు వచ్చితి మింక మాకేమిబుద్ధి
సాధుజన రక్షణములు మీ సహజ గుణము
లనఘ! మీ చిత్తమతని భాగ్యము ముకుంద! 57

---

1 భూమిపతులకెల్ల భూషణములు (త) 2 వచ్చినాఁడు గాక (త) 3 భృత్యతములు (ప) 4 కాంతజనకునిం (అ) కాంతుజనకునిం (త) 5 పొంచితనరాక మీకెఱిగించుడనుచు మనవి ప్రార్థింపు (ప)

వ॥ అని బహు ప్రకారంబులం బలికినఁగరుణా రసార్ద్ర చిత్తుండై పరమే
శ్వరుండు పూర్వస్నేహంబు తలంచుకొని, యా కుచేలునిందోడ్కొని రండు
పొండని తద్ద్వారపాలకులంబనిచిన శ్రీఘ్రంబు నంజని 58

తే॥ అల కుచేలుని1పాదాబ్జములకు మ్రొక్కి
2యెంత పుణ్యుండవయ్య మునీంద్ర చంద్ర!
3స్వామి మీరాక విని చాల సంభ్రమించి
సరగందోడ్కొని రమ్మనె సముఖమునకు. 59

కం॥ 4మీ వార్త దెలిపినప్పుడె
భావమునఁ గృపావిశేష పద్ధతి మెఱయం
5గావినెఁబరాకు సేయక
శ్రీ వల్లభుఁడాననమునఁ 6జిరునవ్వొలయన్ 60

ఆ॥ తరణి రాక కలరు సరసిజంబును బోలెఁ
జంద్రురాక కెలమి సంతసిల్లు
ధరఁజకోరమట్టు ధారుణీసుర! నీదు
రాకకలరె వింత లేక శౌరి 61

కం॥ ఎంతటి ప్రియుఁడవో హరికివి
నెంతటి భక్తుఁడవో కాక యెందఱో ధరణీ
కాంతులు తలవాఁకిటఁ బడి
సంతాపించెదరు శౌరి 7సన్నిధి లేకన్ 62

కం॥ చనుఁడని పలికిన విప్రుఁడు
కనుఁగవ 8నానందబాష్ప కణములు దొఱఁగన్
దనకిన్వాళ్లకు నెలవుగఁ
గనఁగలిగెను 9శౌరి పాదకంజములనుచున్ 63

వ॥ అంతరంగమున నత్యంత సంతోషాక్రాంతుఁడై కరిఘటాపీరభటసముత్కట
ంబులయిన యమ్మహాద్వారంబులు డెబ్బదిరెండునుఁగడచి, మఱియుఁబెక్కు వాఁకిళ్లనుం
దూరి, 1యెడ నెడఁగడు బెడంగులై చూడందగిన మేడలుం గడచి, పటికంపు గోడలును
బగడంపు కంబంబులును వైడూర్యంబుల ద్వారబంధంబులును నీలంబుల జాలకంబు
లును వజ్రంబుల కవాటంబులును బచ్చల తోరణంబులును పద్మరాగంబుల
వాచూరులును బుష్యరాగంబుల వేదికలును ముత్త్రియంబుల రంగవల్లులును
గోమేధికంబుల సోపానయూథంబులును 10 గృష్ణాగరుకాండంబుల ధూపంబులును

---

2 పుణ్యుండనో సన్ము
1 శ్రీపాదములకు (త) శ్రీప్రదాబ్జములకు (ట) శీఘ్రంబునంజనిచని (ప) నీంద్రచంద్ర (అ) 3 స్వామిమీరాకవిని సంతసమున నిన్ను ప్రేమతో సముఖమునకు బిలువుమనియె (త) సరగునను బిలువుమనియెను (ట) 4 నీవార్త (ట) 5 దావినెఁ (ట) 6 చిఱునవ్వొలయన్ (ఆ) చంద్రచంద్రికకువ సంతసిలుచకోరములును బోలె (ప) 7 సముఖముకలదే (ప) సముఖముఁలేకన్ (అ) 8 సంతోషబాష్ప (ట) శ్రీశౌరిపాదకమలము (ట) 10 గృష్ణాగరుతరుకాండంబుల (ప)

నెల్ల దిశలయందుఁజల్లిన భుగభుగమని వెలయు మృగనాభిరసంబుల సౌరభంబులును విచిత్ర విక్రమ కథాక్రమంబునిగుడఁజిత్రించిన చిత్రరూపంబులును తాళమృదంగాది వాద్య రవంబుల రభసంబులును హరిషోడశ సహస్రాంగనాకల రవంబులును గలిగి మణిమయానేక చంద్రశాలా విరాజమాన శాతకుంభాంకితంబునునగు నభ్యంతర మందిరంబుం బ్రవేశించి యచ్చట 64.

సీ॥ విద్రుమోష్ఠి యొకర్తె వింజామరము వీవ
లలన యొకర్తు కాలాంజిఁబూనఁ
గోకస్తని యొకర్తె 1యాకుఁజుట్టి యొసంగఁ
గలకంఠి యొకతెబాగంబు లియ్యఁ
గమలాక్షి యొకతె బంగారు గిండి వహింపఁ
దొయ్యలి యొకతె పాదుకలు పట్ట
నెలతుక యొక్కతె నిలువుటద్దముఁజూప
సఖియ యొకర్తు హెచ్చరికసేయ

గీ॥ రుక్మిణీ పుణ్యసాధ్వి యూరువుల మీద
మస్తకముఁజేర్చి సత్యభామా వధూటి
తొడలపైఁబాదములు సాచి కడుఁబ్రియమునఁ
2బవ్వళించిన యిందిరా భర్తఁగాంచె. 65

గీ॥ పెన్నిధానంబుఁ3బొడఁగన్న పేద వోలె
దప్పిగొని నీరుగనిన బీదయును బోలె
వలదఁబోవుచుఁదరి గన్న పిటికి వోలె
హర్షమును బొందె మిగుల నయ్యావని సురుడు 66

వ॥ ఇట్లు వచ్చిన యాకుచేలునింజూచి, శౌరి లేచి కొంత దవ్వు చని 4మవ్వంబుననెదుర్కొని, కడుఁబ్రియంబున నమస్కరించి కుశలంబడిగి పాదంబులు 5గడిగి, యాలింగనము చేసి, కూర్చుండ నియమించి శరీర తాపనివారణంబుగాఁ దన మృదు కరంబుల నతని దేహంబు నివిరి, కుంకుమాగరు సమంచితంబైన మంచి గంధంబు మృగమదమిళితంబుగా నతని శరీరంబున నలంది, యక్షతంబు లిడి సువర్ణరజతంబులైన మంచిదుకూల వస్త్రంబులు గట్టించి, ధూప దీపంబులొసంగి నీరాజనంబు లిచ్చి సకల ద్రవ్యసంపన్నంబులైన యన్నంబును, భక్ష్యభోజ్య లేహ్య చోష్యపానీయంబులు మొదలైన ద్రవ్యంబులును దెప్పించి, కుడువఁబెట్టించి కర్పూర మిళితంబైన, తాంబూలంబు నొసంగి, వధూజన సభా మధ్యంబున నతని నిజశయ్యా స్థలంబునఁగూర్చుండ నియమించి, వింజామరంబులు విసరుచు మార్గ ఖేద పరిహారంబుగా నడుగులొత్తం దొడంగిన 67

---

1 ఆకుచుట్టియ్యంగ (ప) 2 పవ్వళించున్న (అ) 3 గనుగొన్న (ట) 4 మంతనంబున (ట) కొంతదవ్వుమధ్యంబున (ప) 5 గడగిశిరంబునంజల్లు కొని

శా॥ శ్రీ లక్ష్మీపతి సమ్ముఖంబు[1]న ముని శ్రేష్ఠుండు నిష్కాముఁడున్
బేలున్నట్టుల యూరకుండెనతఁడుత్ప్రేక్షింప నట్లౌగదా
హాలిన్ బూటకముల్ వహింప రతి దివ్యజ్ఞానవంతుల్ బుధుల్
'బాలోన్మత్తపి శాచవత్త'నుచుఁ జెప్పన్ శాస్త్రముల్ మిథ్యలే. 68

గీ॥ భావమాభ్రమరమునకు బ్రమసినట్టి
కీటకము వోలె హరియందుఁ గీలుకొల్పి
[2]మాధవ ధ్యానమున మేను మఱచెఁగాక
యిలఁ బతుల [3]వేఁడుకొనని వారెందుఁ గలరు ? 69

ఆ॥ కుంభ గతము లైన గొప్ప[4]దీపంబుల
కరణి మానసమును వరుస నింద్రి
యములఁ జొనిపె యాదవాధీశ్వరుని యందె
[5]తనువు చేష్టలెల్ల దలఁప కతఁడు. 70

వ॥ మఱియును 71

సీ॥ మురవైరి శృంగారమూర్తి విలో[6]కించి
నయనేంద్రియంబు[7]నానందమొందఁ
గమలాక్షు వనమాలికా సౌరభంబుల
ఘ్రాణేంద్రియము[8]తృప్తిఁ గైకొనంగ
మధువిరోధి విలాస మధుర వాక్యంబుల
శ్రోత్రేంద్రియము సొక్కి[9] సోలియాడ
జలజాక్షు మృదుహస్త [10]సంస్పర్శనమునఁ ద్వ
గింద్రియంబునుఁ గడు [11]నింపుఁబూనఁ

గీ॥ బరఁగ [12]హరి గేహ మృదులాన్న పాన రుచుల
మఱగి జిహ్వేంద్రియముఁ జాలఁబరిణమింప
మాధవుని యందు[14] డెందంబు మట్టు పఱచి
తాపసుండు ప్రపంచమంతయును మఱచె. 72

ఆ॥ ఉప్పునీటిలో[15]న నుంచిన కర[16]ణిఁగ[17]
ప్పురము వీతి హోత్రునొఱసినట్లు
వారి రాశిఁ బడిన వడగండ్లకైవడి
శౌరియందె మనసు సంఘటించె 73

---

1 ననునిశ్చేష్టుండు నిష్కాముండుంబేలుండై మరియూరకుండె (అ) యపుడూరకుండె(వ)
మాధవాధీనమున (ట) మాధవాభ్యాసమున (అ) 3 వేడుకొను (ట) వారెందుగలరె (ఆ
2 దీపంబులు సరణి మానసమున సముచితేంద్రి (అ) 5 తనువుచేష్టలేల తలచునతఁడు (ట)
విలోకింప (అ) 7 నానందమొందె (అ) 8 తృప్తిగాంచె మిగుల (అ) 9 సోకి (త) 10 సంస్ప
మున తత్త్వగింద్రియంబు 11 గరంబులింపులూన (త) లింపుబూన (ట) 12 హరిగేయరుచిరాన్న
న (అ) 13 మరిగి (ట) 14 యందె చిత్తంబు (ట) 15 నీరులోన (ట) నీటిలోనను
ప్వనించిన. 16 కరణిని (త) కరణియు (ట) 16 కైవడి కప్పురంబు నగ్ని కలసినట్లు (అ)

కం॥ ఈ విధమున (దన మేనిస్వ
భావము లన్నియును మఱచి [1]పరమాత్మ ధ్యా
నావేశుఁడై కుచేలుఁడు
భావజ గురు నెదుట నేమి పలుకక యుండెన్. 74

వ॥ ఇట్లు నారాయణ ధ్యాన పరాయణుండై యేమియుననేరక ధారుణీసురుం డూరకుండిన నయ్యంభోరుహపత్ర నేత్రుండు కారుణ్య రసార్ద్ర చిత్తుండై, యతండు వచ్చిన ప్రసంగంబంతయు నాత్మ నెరింగి, యంగీకరించి, తొల్లిటి సంగతంబులుగ్గడించి, యవ్విప్ర పుంగవునితో నిట్లనియె. 75

కం॥ ధరణీసురనందననీ
దరిసెనమున మేను పొదలెఁదనిసెను జిత్తం
[2]బిరవుగ మ[3]న్మందిరములు
పరమ పవిత్రంబులయ్యె భాగ్యములబ్బెన్ 76

కం॥ పరి పూర్ణబుగ నాపైఁ
గరుణ వహింపు[4]దువె నీదు కల్యాణశ్రీ
[5]కర గుణ వాక్య విశేషము[6]
లఱిముఱినే నెవ్వరినైన నడుగ దును జూమీ 77

ఆ॥ తడవు[7] దినములకును ధరణీసుర శ్రేష్ఠ
మాకు మీకు సంగమంబు గలిగె
నడవి యుసిరికాయ యంబుధిలవణంబుఁ
గూడినట్టు లయ్యె నేఁడు సూడ. 78

మ॥ పొరుగైనం బగవారిఁతో జెలిమి సంపూర్ణంబుగా [8]గూర్తురే
నరులాప్తుల్ గడు దూరదేశమున నున్నన్ గూర్మి వాటింప[9]రే
ధరణి[10]o జాతి ఖగంబులుండఁగ మహా [11]దానాంబుద శ్రేణికిన్
బురు లల్లార్చి నటింపవే శిఖి చయంబుల్ భూ ధరాగ్రంబులన్ 79

ఆ॥ పుడమి జలములందుఁబుట్టిన కమలంబు
లర్క కిరణములకు నలరినట్లు
దూరదేశ గతుల మీరల రాకకే[12]
నెమ్మిఁ గోరుచుందు ని[13]ర్మలాత్మ 80

కం॥ చాలం జింతిలుచుందును
దాళక నామదిని నీదు దర్శనము[14]నకున్
బాలస్నేహ వియోగము
లేలాగుననైన దుఃఖ హేతువులుగదా 81

---

1 మఱిచె (ట) 2 బిరువుగ (అ) బిరముగ (త) 3 మామందిరములు (ప) 4 వహింపుదురె (ట) 5 కరవర్తన (త) కరవాక్యవిశేషంబులు (అ) 6 విశేషము నింపరయగనెవ్వారినైన (త) 7తడుపు (అ) 8 జూతురే (ట) 9పాటింతురే (అ) 10 యురతంజాత (ట) యరతింజాతి (త)ప్ర 11 మహ బారాంబుద శ్రేణికిన్ (ప) 12 రాకకై (ట) 13 నెమ్మనమున (ట) 14 దర్శనమునకై (అ)

ఆ॥ పెండ్లియాడినావె పెక్కుగాఁగొడుకులు
గలిగినారె నీకు ప్రాసవాస
ములకుఁ గొదువ [1]పడక కలుగుచున్నవియెయె
క్కాలముననుు నొక్కగతి మహాత్మ! 82

కం॥ కుల భామిని యేమైనను
కలిగిన కొలదింటిలోన గహ్వ[2]రమునఁ బ్రొ
ద్దులు [3]గడుపునె ప్రియమున నా
నెలతుఁకని పంపుసేయ[4] నేర్చునె సెపుమా? 83

ఆ॥ ఇంటిలోన నీకు నేమాత్రమైనను
గలిగినట్లు దేవ[5]కార్యమునకు
నతిథిజనుల[6]కిడునె 'యభ్యాగతస్స్వయం
విష్ణు'వనెడు మాట విని ప్రియమున. 84

కం॥ స్నానానుష్ఠానంబు[7]లు
మానక యొనరింపు[8]దు వె సమస్తములకు నీ
మేనునదార్ఢ్యము గలదే
మానసమున నిల్చినది యె మాధ్యా[9]నంబున్ 85

కం॥ కొడుకుల నిల్లాలిని గడు
బడలంగానీక యన్న పానముల [10]దిగన్
విడువక పోషింపుదువే
సడికెన్నడునీవు చనక సద్ధర్మమునన్ 86

ఆ॥ ప్రజలనెల్ల నీతిబాధలఁ బడనీక
పాలనంబుసేసి పరమమైన
ధర్మమార్గముననుు ధరణి రక్షింతురే
మీ పురంబు లేలు మేటి[11] నృపులు? 87

ఆ॥ మనము చిన్ననాఁడు మసలి సాందీపని
యొద్దఁ జదువు[12]కొన్న సుద్దులెల్లఁ
[13]దలఁచుకొందు నెపుడు దలఁచు నీమనమునఁ
[14]దగిలియున్నయవియె తాపసేంద్ర 88

---

1 కొదువలేక (అ) కొదవలేక (ప) 2 గంహరమున (ప) 3 జరుపునె (అ) 4 సేయునేయే యెడలన్ (ట, ప, అ) 5 పేదకార్యముడిగి (ట) 6 జనుల కిడుదె (అ) 7 ష్ఠానాదులు (ప) 8 యొనరింపుదే సమస్త (ప) 9 మాధ్యానంబుల్ (త) నిలిచినవి ధ్యానం యేవహాబుల్ (త) మధ్యాహ్నంబుల్ (అ) 10 పానములడుగన్ విడువక (ట) కెన్నడు జొరకనైజ సద్ధర్మమునన్ (అ) 11 మేదినిపులు (త) మేదిన్నృపులు (అ) 12 చదువుకొనిన (ట) 13 దలుచు కుందువాక్కొ (త) 14 తగిలియున్నదెపుడు (త)

కం॥ గురు భార్య మున్ను మనలను
జిఱుతల నిద్దరను వంటచెఱకుల [1]కనుపన్
మురియుచుఁ బరువు[2]లు వెట్టుచుఁ
దెరలి మహాటవులయందుఁ దిరిగితిమిగదా 89

ఆ॥ మరలి వచ్చునెడల మార్గం[3]బు తెలియక
[4]యట్టెపోయి యడవి నట్టనడుమఁ
బ్రొద్దుమునిగి వాన భోరునఁ గురియంగఁ
దడసి వడఁకితిమిగదా మహాత్మ 90

కం॥ దుడ్డెలురాకటు[5] మసలిరి
జడ్డున నున్నారటంచుఁ జనుదెంచి గురుం
[6]డొడ్డైన యడవిని బొడఁగని
[7]దొడ్డన మన్నించు టెరుగు దువుగద మనలన్ 91

వః అని మఱియును, హరి పరమాత్ముండయ్యును, ప్రపంచంబులోని వాఁడునుం బోలె బూటకంబున నతని యోగక్షేమంబులరసి, చిన్ననాటి మాటలుగ్గడించి, "మహాత్మా, మా పట్టణంబునకు నెట్టకేలకుఁ జుట్టంబవై వచ్చుచు వాకేమి తెచ్చితి" వని ముచ్చటపడి యడిగి, యొడలెల్లఁ బఁడికి జీర్ణ చేలంబున[8] ముడిచి దాఁచిన యడుకులం గని పిడికెడు [9]దిగుచు కొని భక్షించి, మరియునుఁ బిడికెఁడు నారగింప నపేక్ష సేయ, సాక్షాదిందిరాదేవియగు రుక్మిణీదేవి, లోక రక్ష[10]ణ ప్రశస్తంబైన తన మగని హస్తంబుఁ బట్టెననిన విని బాదరాయణికి నమ్మేదినీ వల్లభుం డిట్లనియె. 92

కం॥ శ్రీహరి యడుకులు మఱియును
మోహంబున నారగింప ముచ్చటప[11]డఁ ద
ద్గేహిని యగు రుక్మిణియే
యూహను జెయి పట్టి తిగిచెను[12] చితంబెడలన్ 93

ఆ॥ అధిపుఁ డారగింప నంబుజేక్షణలును
జెలఁగి సంతసింప వలయుఁగాక
కుడువ వలదటంచుఁ గడు నడ్డపడియెడు
కాంతలెచటనైన గలరె జగతి? 94

ఆ॥ పనులు[13] సేయునెడల బానిసవలె బుద్ధి
గరపునెడఁ బ్రధాని కరణి భోజ
నంబు లిడెడియెడల నంబకైవడిఁ బ్రియం
బాచరింపవలయు నంద్రు [14]సతులు 95

---

1 బెరుకుల (ప) 2 తరవులు బెట్టుచ (త) 3 మార్గంబులెరుగక (త) యొట్టోపోయి (త) 5 రాకటుమసలిరె (ట) రాకన్ మసలిరి (ప) 6 దొడ్డైనయడవిగనుగొని (అ) (ట) 7 దొడ్డుగ (అ) 8 వసనంబున ముడిచిన (అ) వస్త్రంబున ముడిచిన (ట) 9 దిగుచుక (ట) 10 లోకరక్షప్రశస్తంబైన (త) 11 పడనారోహిణియగు (త) 12 యుచితమెయెడలన్ (ట) 13 పనులు జేయువెడల (అ) 14 నంద్రు బుధులు (అ)

కం॥ అనవుడు శుక యోగీంద్రుఁడు
మనుజాధీశ్వరునకనియె మంజుల ఫణితిన్
వినుము పరీక్షిన్నరవర!
యనుచితములుగావు గద మహాత్ముల చర్యల్ 96

చం॥ కులమును[1] రూపమును గలుగు కోమలి రుక్మిణి పుణ్య సాధ్వి శ్రీ
లలన నిజాంశమందుల నిలం బ్రభవించిన [2]లక్షణాఢ్యయా
యలి కులవేణి భర్తకుఁ బ్రియం[3]బొనగూర్పనె చూచుఁ గాక దాఁ
దలఁపున వాక్శరీరములఁ దప్పనె యెప్పుడు సత్య ధర్మముల్ 97

ఆ॥ పిడికెఁడడుకులపుడు [4]ప్రియమున భక్షించి
యాకుచేలునకు మహామహునకు
[5]సకల లోక విభవ సామ్రాజ్య మొసఁగంగ
[6]మనసు వెట్టెనట రమాధవుండు 98

కం॥ మఱియును బిడికెండడుకులు
గిరిధరుఁడటుఁ బ్రేమ [7]నారగించిన యేనిన్
[8]పరమాదరమున నతనికిఁ
జిరకాలము భృత్యుడై వసింపఁగ వలయున్ 99

కం॥ కావునఁ బతికి [9]హితంబుగ
నావెలఁదుక మఱియు నడుకులాహరింపం
గావలదని యెను భక్తుల
కీవచ్చును రాదనఁడు రమేశ్వరుఁడెందున్ 100

చం॥ ధరనొక మర్త్యమాత్రునకుఁ దానొనరించిన మేలు చాలు సు
స్థిరముగ నూర్ధ్వలోకమును జెందఁగఁ జేయు సమస్త భాగ్యముల్
పరమ గురుండు లోక పరిపాలకుడైన హరిన్ భజించినన్
[10]గరము నిజాధిపత్యములు గల్గుట[11] చోద్యమె మానవేశ్వరా 101

వ॥ అని చెప్పి శుకుండు వెండియునిట్లనియె. అంత ముకుందుండు, రుక్మిణీ కాంతానివారిత కార్యుండై, యత్యంత తృప్తుఁడగు వాఁడునుంబోలె నాదరంబున నయ్యడుకు లతని జీర్ణ[12] వస్త్రంబునఁ గ్రమ్మఱ ముడిచి, యాకుచేలునిన్ బహు ప్రకారంబుల నూరడించి [13] పంచిన, నాయకించనుఁడు నిశ్చల చిత్తుండును నిర్మలుండును నిర్గుణుండును గావునఁ బురుషోత్తమునింగనుం గొంటి, నావంటి

1 రూపునన్ (ట) 2 లక్షణద్వయా (ప) లక్షణాంగి (ట) 3 బొనగూర్చగ జూచుగాక (అ) 4 ప్రేమను (అ) 5 సకలలోకములకు (త) సకలలోకాలోక సామ్రాజ్యములొసంగ (ట) 6 మనసు పట్టె (ట) మనుసు (త) 7 నారగించినయెన్నం పరమాప్తంబుగ నతనికి (త) 8 పరమాప్తంబున (తు) పరమాత్ముండగు కృష్ణుడు (అ) 9 పతికిని హితవుగ (ట) పతికి హితంబగు (అ) 10 గరిమెనిలాధిపత్యమును (అ) 11 గల్గుటభాగ్యమే (ప) 12 కాంతవలన నభ్యంతరకార్యుండై (త) బహిర్వస్త్రంబు నక్కమ్మరి (త) 13 పలికిన (అ)

భాగ్యవంతుఁడు గలఁడేయని సంతోషించుచు లేచి, శౌరికి నమస్కరించి, యేమియు నడుగ[1]నేరక [2]ముగ్ధత్వంబునఁ దద్గృహద్వారంబు వెడలి, కొలువు కూటంబు దాఁటి చనునప్పుడు 102

కం॥ ఆ కొలువులోన నుండిన
[3]యాకర్ణాంత తేక్షణలు మురాంతకుని సతుల్
రాకేందు ముఖులు చక్కని
కోకస్తను లొకరి కొకరు గురు హృదయములన్ 103

కం॥ ఎంతటి దయవాఁడే శ్రీ
కాంతుండే[4]మైన నీక కదలు మనినవి
భ్రాంతుండై చనె[5]విప్రుడు
వింతలు ధర నిట్టివనులు వినమెన్నండున్ 104

ఆ॥ హరియు లేచుటెట్టు లర్ఘ్యపాద్యాదుల
గారవించుటెట్లు కానుపీస
మేమియును నొసంగకేఁగు మా[6]యనుటెట్టు
[7]లెంత భాగ్య హీనుఁడిల[8] నితండు 105

ఆ॥ [9]కుడువఁ గూడు ఁ గట్టఁ గోకయులేకుండి
చేరినట్టి తొంటి చెలిమికాని
బూటకములు పలికి పొమ్మని [10] పంచెనీ
జలజలోచను[11]నకు సత్యమేది ? 106

గీ॥ అరయఁ '[6]నాడంబరాణి పూజ్యాని' యనుచుఁ
జాటు చుండెడి నీతి శాస్త్రము నిజంబు
బడుగు లెచ్చోటి కేఁగిన బ్రదుకు గలదె
బూటకుల ఁ గాని మెచ్చరు భూమి పతులు 107

ఆ॥ దీన జనులు ఘనుల ఁ దిరి యంగ ఁ బోయినఁ
గోకయైన [12] నొక్కరూకయైన
[13]నిచ్చి పంచుట దియె యెంతయు బహుమాన
[14]మిల్లె యనుట యదియె హీనతయగు 108

1 అననేరక (ట) 2 ముగ్ధతనంబున (త) మగ్నత్వంబున (అ) 3 యాకర్ణాంతేక్షణుని మురాంతకుని సతుల్ (ట) 4 యేమియు నొసగకయు ననుపగాయట్లు (ట) 5 నితఘను (ట) నతడును (అ) 6 యనుటెల్ల (త) 7 యెట్టుభాగ్యహీను (అ) 8 డిలసురుండు (అ) 9 కుడుపుకూడు కట్టుకొను బట్టయును లేక (ట) కట్టుకొక బట్టయులేక (త) 10 పంచిన (అ) పొమ్మని పంచనీ (ట) 11 లోచనునికి (ప) 12 వొక్కరూక (త) వక్కరూక (ప) 13 ఇచ్చి పంపుటదియెంతటి (త) 14 యిట్లు యగుట దానహీనుడగుట

ఆ॥ అఖిల రాజ్యమేలు హరి సఖుండయ్యు నా
చెనఁటిభూసురుఁడు కుచేలుఁడయ్యె
1 'భూజనంబు నేలు రాజు మగండయ్యు
గాజు కడియ'మనెడి గతి సెలంగ. 109

ఆ॥ బడుగు బాఁపనయ్య 2బ్రదికించి నందులోఁ
గానవచ్చె శౌరి 3 కరుణ యెల్ల
4మునికి విందుగలదె 'ముంజేతి కంకణం
బునకు 5నద్దమేల' పొసఁగఁ జూడ 110

తే॥ ఎంత దవ్వుల నుండియో యేగుదెంచి
కడేఁడు మెతుకులకై యింత 6కష్టపడెడుఁ
గటకటా యమ్మ హీసురాగ్రణి విధంబు
7కొండఁ ద్రవ్వియు నెలుకను 8గొనుటయయ్యె 111

ఉ॥ కామిత వస్తు జాలములు గల్గిద యాపరులైన పుణ్యులన్
9బ్రామిత నిచ్చి పుచ్చుకొను భావమునన్ దలపో10యఁడెంతయున్
గ్రామము 11క్రొత్తయైనఁదనకర్మము క్రొత్తయె పెక్కు మాటలిం
కేమి యదృష్ట హీనులకు నెచ్చటనైనను గల్గునే సిరుల్ 112

కం॥ మనకేమి తెలియు శ్రీకృ
ష్ణుని 12బూటకములును భూమిసురవరు మహిమల్
'మనసునకు మనసె తార్కా
ణ'మను సామిత13 వీరియందె యందంబయ్యెన్ 113

వ॥ అని పలికి, సఖీజనంబు లొకరికొకరు తమలోఁ దమరు మొగమొగంబులు చూచుకొనుచు, దరహాసంబు నెఱపుచుండిరి. అంతనాభూసురోత్తముండు జలరాశిదాఁటి పెక్కుదేశంబులు గడచుచు వాసుదేవ పదధ్యానమనస్కుండై మహోల్లాసంబునఁ జని చని నిజ నివాసంబునకు మరలి వచ్చునప్పుడు 114

సీ॥ ఉప వాసములచేత 14నొగిలిడస్సిన మేను
రక్త మాంస ప్రపూర్ణత వ15హించె
బలువుగాఁ జినిఁగిన ప్రాఁత కుచేలంబు
కాంచనాంబరమై ప్రకాశమొందె
గళమున నిడుకొన్నతులసి పూసల పేర్లు
మౌక్తిక హార నిర్మలత దాల్చె
మృదు కరాంగుల ముల ముదురు దర్భలముళ్ళు
16రత్నంపు మెఱుఁగుం గరంబులయ్యె

---

1 భూజనంబులెల్ల రాజు మొగడైనను గాజుకడియమనెడి గతి చెలంగి (ట) 2 బ్రతికించె (త) బ్రతికించుటందులో (అ) 3 శౌరిగణకయెల్ల (త) 4 మునికి యిందు గలదె (త) విందుగలడె (అ) 5 నందమేల (అ) 6 కష్టపడుట (అ) 7 కొండద్రవ్వెలుక బట్టిన గొడువయయ్యె. (ట) 8 గోడునయ్యె (అ) గొడువయయ్యె (త) 9 బ్రామికనెంచి పుచ్చుకొన (ప) 10 పోయకెంతయున్ (ప) పోయెరెంతయున్ (అ) 11 క్రొత్తయైతె (త) 12 బూటకములనటనలు (ప) 13 సామితి (అ) 14 వొరళిడస్సిన (ప) 15 జెలంగె (అ) 16 మెరుగుటుంగరవులయ్యె (అ).

గీ॥ జెవుల వ్రేలాడు బలు పుత్రజీవికాయ
లెలమి మణి కుండలంబులై యేపుఁ జూపెఁ
జెలువ మంతంతకును హె[1]చ్చ శ్రీమురారి
పరమ కరుణానురక్తి[2]ని బ్రాహ్మణునకు 115

గీ॥ హరి కర స్పర్శనమునను నధికదేహ
దాహ[3]మెడలెను భద్ర మాతంగవిభుని
కరణి ధా[4]త్రీ సురునకు భీకర దరిద్ర
తాపములు మానె శౌరి సందర్శనమున 116

వ॥ ఇట్లు శ్రీకృష్ణుని సందర్శనంబున మహదైశ్వర్య చిహ్నంబులు వొడమిన బరమాశ్చర్య [5]పరుండై భూసురుండు సనంజన వెండియుఁ బురో భాగంబున నున్న పురంబుల నృపతులు శ్రీహరి ప్రేరితులై కదలి, కరి తురగస్యందనాది బలంబులతో నెదుర్కొని, యుదయ శైలంబున నున్న యర్కునింభోలెఁ దన్ను[6] నగణ్య కల్యాణ నిపుణ రథారోహణుంజేసి పరివేష్టించి నడువ నెడనెడఁ దమ రూపంబులతోడఁ బొడ[7]గట్టి వేల్పులనల్పకుసుమ వర్షంబులు గురియింపుచు, దుందుభులు మొరయింపఁ బ్రహ్లాద నారద పరాశర పుండరీక వ్యాసాంబరీష శుక శౌనకాది పరమ భాగవతులు గీర్తింప, దివ్యాంగనలు [8]నటింప మహావైభవంబున 117

మ॥ పరితోషం[9]బును బొందె బ్రాహ్మణుఁడు దద్భాగ్యంబు సిద్ధించుటన్
బరమాత్ముండగు శౌరి [10]యుత్తమ పరబ్రహ్మంబు ధాత్రీస్థితి
న్నర జన్మంబును బొంది తాఁజెరిగి నానా యోగ భోగంబులన్
[11]బొరయన్ వేడ్కపడంగ నొల్లఁ[12]డె కరంబున్ మర్త్యుఁడీసౌఖ్యముల్ 118

కం॥ శ్రీ గరుడగమనుఁగొలిచిన
[13]భాగవతోత్తముల కెలమిఁ [14]బరమాయువులున్
[15]వేగ గరితురగరథభట
భోగంబులు గలుగుటరుదె భూతల నాధా! 119

---

1 హెచ్చె (అ) 2 రక్తినాబ్రాహ్మణునకు (అ) 3 దాహమెడలిన (ట) తాపమెడలిన (అ) 4 తాపసునకును (అ) 5 పరమాశ్చర్యకరుండై (త) 6 తన్నునతుల్యకల్యాణరథారోహణంబు (ట) తుల్యనిపుణరథారోహణంబు (త) 7 పొడగంటివేల్పులు ననన్యకుసుమ (ప) 8 నర్తింప (త) 9 పరితోషంబున (అ) 10 యాపరపదబ్రహ్మంబు (త) 11 బొడయన్వేడ్క (ప) 12 నొల్లరె శరీరంబున్ మదిన్ రాజ్యముల్ (ట) 13 భాగవతులకేమిమెప్పు (ట) 14 పరమాయుష్యం (అ) 15 బగుపట కరితరుగ (ప)

కం॥ పెట్టిన [1]తద్వాసరముల
గట్టిగ సంపదలు గలుగుఁ గట్టడియైముఁన్
బెట్టని దినముల లేములు
[2]దొట్టును మనుజులకు నెల్లఁ దుదిజన్మములన్ 120

గీ॥ అనిన[3] విని యర్జునుని పౌత్రుఁడాత్మనలరి
పద్మనేత్రు కథాసుధాపానమునను
దనివి సొలక శుకుని మోదమునఁజూచి
యనఘ! యట[4]మీఁది కథలెట్టులయ్యెననిన 121

మ॥ హరి[5] మాయోగ్ర శిలాప్రవర్ష భయ ఘోషాబ్జే క్షణా గోపగో
వర గోవత్స గణాభినందిత మహావాత్సల్య[6] రాధామనో
హర లావణ్య[7] విలాస విభ్రమ కళాహంకార బాణాసురో
త్కరదోర్దండ సహస్రఖండన జగత్కల్యాణ[8]కల్యాత్మకా 122

కం॥ [9]శరచర కచ్ఛపకిటినర
హరివటు భృగురామ రామ హలిబుద్ధమహో
తురగారోహణ రూపక
స్మర సదృశాకార [10]కపట మనుజ శరీరా! 123

## భుజంగ ప్రయాతము

సమస్తా వనీనాథ సంసేవ్య పాదా!
రమా రూపరేఖాభి రామ ప్రమోదా!
[11]హిమ క్షీర వాక్కీర్తి హేలావినోదా!
విమాలిన్యవిజ్ఞాన విద్యా ప్రమోదా! 124

గద్య: ఇది శ్రీ మద్భ్రమరాంబికా వర ప్రసాదలబ్ధ కవితా ధురంధర యర
నామాత్య పుత్ర సకల సద్గుణ విధేయ ఘట్టు ప్రభు నామధేయ
ప్రణీతంబైన కుచేలోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసమ

---

1 దినమున నరులకు (ట) 2 దెట్టును (ట) దొట్టుము (త) 3 అనిన నర్జునపౌత్రుండు న
వలరి (ట) 4 యిటమీద (ట) కథయెట్టులయ్యె (అ) 5 హరిమాయోగ్రకరౌద్రవర్షభయ (
6 వాత్సల్యధారా (అ) 7 విహారవిభ్రమ (ట) 8 కాల్యాత్మకా (ట) కళ్యాత్మకా (వ) 9 కరచర (
10 కృష్ణమనుజశరీరా (అ) 11 హిమక్షీర భాకీర్తి (ట)

# తృతీయాశ్వాసము

శ్రీ లక్ష్మీ మందిర శిశు
పాల జరా సంధ కంసబల[1] భంజనగో
పాల నిజకన్యకాత్యను
కూల కళాలోల[2] కృష్ణ [3]గోపముకుందా! 1

వ॥ అవధరింపుమని పరీక్షిన్నరేంద్రునకు శుక యోగీంద్రుం డిట్లనియె.

ఆ॥ మానవేంద్ర వినుము మసలక విప్రుండు
సకల రాజ్యభోగ సహితుఁ డగుచు
హరి దయావిశేష మాత్మలో మెచ్చుచుఁ
జేరెఁ దొంటి పల్లె చేరువకును. 3

కం॥ అది మిక్కిలి హరి కరుణను
మొదలి పురంబు[4]లకు నెల్ల మొదలిపురంబై
సదమలమై బహు భోగా
స్పదమై విలసిల్లె సకల సౌభాగ్యములన్ 4

సీ॥ మాణిక్య కీలిత మహిత సౌధము[5]లన
త్యున్నత ప్రాకారయూథములను
గంచు మించుగ దువాళించు వాహనముల
గీత ఘూర్ణిత సభాగేహములను
జగతీసురులు పెక్కు చదువు వేదములువి
[6]ద్వజ్జనంబుల శాస్త్ర వాదములను
గురుతర బహు [7]రత్నకుల గోత్రములు సమా
కుంచిత కేళి[8]కాకు ధరములను

తే॥ బలువులగు నట్టి[9] తేరులు బహుల వాద్య
నాద[11]ములను దగినరత్న వేదికలను
వీర పరివారముల [11]మంచి తీరములను
పర[12]గిగను పట్టెనమ్మని పట్టణంబు 5

---

1 కంసవిభంజన (ప) 2 కళాలహరి (ప) కధాలహరి(త) కపోలహరి (అ) 3 గోపాలహరీ (ట) 4 పురంబునకు (ట) 5 సౌధంబుల (ట) 6 పండితజన శాస్త్రపాఠములను (ప) 7 బహు వర్ణ (అ) 8 కేళికాకుడ్యములను (ట) 9 కలిగి బళుపైనతరులును (ట) ప్రబలిబలువైన (ప) బలువుతెరువుల నలరాయబారులను (అ) 10 కుమారవిటులను భరతమేమరని నటుల (అ) 11 వీరపరివారముల మంచిద్వారములను (అ) మంని వితానములు (ప) 12 పరగ (అ)

తే॥ అది మహా[1]రాజధానిగ నపుడు గాంచి
పల్లెయును బట్టణం బయ్యె బద్మనయను
మాయ దెలియంగ శక్యమే మనకుననుచుఁ
దత్పుర ద్వార దేశంబు[2] దరియఁ జనిన 6

కం॥ అందలములు గుఱ్ఱంబులు
స్యందనములు భటులు భద్రసామజములు బల్
మందగొని తొలఁగఁ [3] ద్రోయను
సందెందును లేక దొడ్డ సందడి యయ్యెన్. 7

తే॥ అప్పు రాంతరమున నున్న యట్టి ప్రజలు
దొరలు రాజులు భటులు మంత్రులును బుధులు
హర్షములతోనెదుర్కొని యతని కపుడు
గాను కలొసంగి మ్రొక్కిరి [4]గారవమున. 8

వ॥ ఇట్లు మహైశ్వర్యంబున నభ్యాసురుం[5]డు తేజోవిరాజమానుండై రాజమార్గంబున వచ్చునపుడు 9

కం॥ సౌధాగ్రంబులఁ దగునవ
[6]రోధాబ్జాక్షుల శరీర రుచులా భరణా
గాధ ప్రభలును జాలక
యూధంబుల వెంటవెడలి [7]యుప్పతిలంగన్. 10

తే॥ కాంచి వీక్షించుచున్నారె కాంతలార !
మిగుల వరిటె[8]న గొకిలికి మేనివాడు
మన కుచేలుఁడు హరి దయా మహిమనేడు
కన్నులకు నెంత చెలువమై యున్నవాఁడు 11

మ॥ బలిమిన్ వాయువు గ్రోలి యాకులలముల్ భక్షించి కందంబులన్
ఫలములామ్లలవు లున్మె సంగి జలముల్ పానంబు గావించి వి
శ్వలతన్ ఘోర తపంబుఁ జేసి హరిచే సౌభా[9]గ్య ముల్పేకొనెం
గలరే. యాతని [10]పాటి లోకముల సంకల్పంబు[11]నం జూడఁగన్. 12

---

1ఆమహారాజధానినెయ్యమునగాంచి (అ) 2 దరియఁజనుడు (త) 3 దొబ్బను (ట) 4 గారవ మున (అ) 5 నయ్యార్యుండు (ట) తేజోవిశేషమానుండై (త) 6 నుండిరిరొధా (ట) మంద్రిడివరొధా (త) 7 యొప్పతిలంగన్ (ట) 8 వరిటున్న (ట) వరటున్న (అ) 9 సామ్రాజ్యముల్ (అ) 10 యాతనిసాటి (అ)11 సంకల్పంబుఁజూడందగన్ (త)

కం॥ సతతంబును నీవి(పుని
యతిశయ సద్ధర్మఫలముల విపృథయగునే
స్మృతి 'ధ[1]'ర్మోవర్ధతి వ
ర్ధతి'యని యెడు వాక్యమున[2]కు తప్పంగలదే 13

ఆ॥ ఎవఁడు సకల భూత హితదయా ధర్మంబు
లెఱిఁగి నడుచు వాఁడె హె[3]చ్చునిలను
మున్ను పలుకు శాస్త్రములు 'యతోధర్మస్త
తోజయం'బటన్న నైజమ[4]య్యె 14

తే॥ సిద్ధములు[5] గాగ (త్రికరణ శుద్ధిగాగ
(శ్రీహరిని నమ్మి[6]యుండిన శిష్టజనుల
కెల్ల సంపద గల్గుట కేమి[7] యరుదు
[8]లక్ష్మి శౌరి కటాక్షంబుల నవసించు. 15

కం॥ దారాసుతాదులందే
కారణముననైన మనసు గదియింపక జ్ఞా
నారూఢుఁడైన యీ ఋషి
కీరితిని సిరులు గలిగె [9]నిది యరుదు గదా 16

మ॥ చ్యవ నుండిట్టుల కాదె నిష్ఠురతపస్సామర్థ్యుఁడై మిక్కిలిన్
వివిధారణ్యగిరి (ప్రదేశములలో వేయేండ్లు వర్తించి యా
భువి సం[10]యాతి కుమారిఁగైకొని మహా భోగంబులంజెందఁడే
సవి[11]ధిన్ దొల్లిటివారు మానిరె వధూసంయోగ సౌఖ్యంబులున్ 17

కం॥ ఈలోకంబున రాజ్యము
లేలన్ గల్గినను జాలు నెంత విరక్తుం
డేల విసర్జన[12] సేయును
బాలొల్లని పిల్లి గలదె పరికింపంగన్ 18

ఆ॥ దైవ యోగమునను దట్టిన [13]మేలుకీ
ళ్లనుభవింప కెట్టులరుగ వచ్చు
గాన నార్యులొక్క గతి నుండుదురు సుఖ
దుఃఖములకు మనసు [14]దొరఁగనీక 19

---

1 స్మృతియందతిధర్మోవ (ట) 2 వాక్యములను తప్పులు గలవే (ప) 3 యెచ్చరిల్ల (త) 4 బటంచునీజగమున (అ) 5 సిద్ధములుగను (ట) 6 నమ్మియుండెటి (ట) 7 కలుగుటకేమియరుదె (త) 8 అన్నిశౌరికటాక్షంబు (ప) అట్టిశౌరికటాక్షంబు (త) 9 గలిగనేమనవచ్చున్ (ట) (త) సిరులఁ దగిలె (ప) 10 సయ్యాతి (ప) 11 సవధిం (అ) 12 డేలవిసర్జనయనన్ (ప) 13 కీడుమేలను (అ) 14 దొరల నీక (అ) దొరకనీక (ట)

తే॥ కొట్టినను గార[1]వించినఁ గుడుపులిడినఁ
బస్తు వెట్టినఁ దిట్టిన బహు విధముల
వేడు కొనినను మరి యొక్క విధముగాఁ[2] గ
్రుక్కు నిక్కులు గలుగునే సుజనులకును 20

మ॥ స్థిర బుద్ధిన్ జనకుండనంగనొకధాత్రీ భర్త యే[ప్రొద్దు]దు
ష్కర వైశ్వానర పూర్ణ కుండమున శ్రీ గంధంపు పాత్రంబునం
జరణంబుల్పదిలంబుగా నిలిపి స్వేచ్ఛన్ రాజ్యమున్ జేసెనీ
ధర శీతోష్ణములొక్కచందమున నాత్మ[3]న్జింతనల్ సేయుచున్ 21

ఆ॥ అటుల నా కుచేలుఁడత్యంతమును లేమి
కలిమియును సమంబుగాఁ దలంచి
[4] దైవ ఘటన దొరసి తన కర్మమున మన
సొగ్గి యుండు జ్ఞాన యుక్తుఁడగుట. 22

సీ॥ బహు విధంబులఁ దన భార్య ప్రార్థించినఁ
జిరతర కరుణార్ద్ర చిత్తుఁడగుచుఁ
గణఁగి "సర్వేజనా: కాంచన మా[శ్రి][5]యం
త"ని యెడు శ్లోకార్థమనుసరించి
ద్రవ్యంబు కంస విధ్వంసుని యా[6]చింప
సరవితోఁదనకును శౌరి యొసఁగుఁ
గల [7]కొద్ది కొని ద్వారకాపురంబునకేఁగి
మురవైరిఁ బొడగాంచి మురిపెముగను

ఆ॥ నేమి యడుగ[8] మరచి యుందిరా విభునిచే
గౌరవమును బొంది కదలి వచ్చి
శౌరి యొసఁగు సకల సామ్రాజ్య లక్ష్మిని
బొందినాఁడ యెంత పుణ్యుఁ డితఁడు. 23

వ॥ అని ప్రౌఢలగు నప్పువ్వుబోడులు బహు ప్రకారంబులఁ గొని యాడ నమ్మని చూడామణి యాందోళికా ఛత్ర చామరంబులు మొదలైన చిహ్నంబులు పరిగ్రహింపుచు, భేరీమృదంగ శంఖ కాహళ గంభీర నాదంబులు భోరు గలుగ నిజా గారంబు చేరువకుఁజను దెంచునప్పుడు 24

---

1 గోరగించిన (ట) 2 గాకపెక్కుటెక్కులు గలుగునే పెద్దలకును (అ) మదిస్రుక్కునిక్కులు (ట, (ప) 3 యాత్మాచింతనల్ (అ) 4 దైవఘటనలేక తన కర్మవశమున సొగిచియుండుజ్ఞాన యుక్తుఁడగుచు (అ) దైవఘటన దారసిల్లినకర్మము (త) ధర్మము (ట) 5 తనెడు సుశ్లోకార్థ (అ) 6 యాచించితెచ్చియిచ్చెను తన దేహజులకు (అ) 7 కలకోటియని (అ) 8 యడుగవెరచి (ట)

కం॥ మునుపటి పర్ణకుటీరము
కనకమయంబై యతుల్య కల్యాణంబై
[1]ధన ధాన్య సంభరితమై
ఘనమై యుండంగఁ జూచికడు [2]వెఱఁగు పడెన్. 25

ఆ॥ అతని భార్య కోమలాంగి స్వాధీమణి
యఖిల రత్న కాంచ[3] నాభరణవి
భూషితాంగి యగుచు బూచిన తంగేటి[4]
కరణి చెలులుదాను కదియ[5] వచ్చి. 26

ఆ॥ పసిమి గలిగినట్టి మిసిమి బంగారంపుఁ
బళ్లెరమున ధవుని పాదపంక
[6]జములు నిలిపి సతులు జాళువాగిండిని
బరిమళోదకములు సరవిఁబోయ 27

కం॥ కడఁగి[7] తన పైట కొంగునఁ
దడియొత్తి యనర్ఘ రత్నతతులంబరముల్
పిడికిళ్ళ కొలఁది మాడలు
కుడి [8]యెడమల ఁబడఁ గవైచె కోమలివేడ్కన్ 28

కం॥ కై[9] దండయొ సంగినయా
పైదలి చెయ్యూది వెంటఁ బఱతెంచిన యా
మేదిని భర్తల నందఱ
నాదరమునఁదొంటి కడలకనిపి ప్రియమునన్. 29

కం॥ ఇరు దెసల నంబు జాక్షులు
పరివేష్టించుకొని నడువఁ బటుతర విభవ
[10]స్ఫురణ ఁగుచేలుఁడు దనమం
దిరముఁ బ్రవేశించె నధిక తేజోనిధియై. 30

సీ॥ ప్రాణ నాయకుని ఁదద్భార్యా[11] శిరోమణి
గరిమె[12]తో ముత్తెపు గద్దెమీదఁ
గూర్చుండ నియమించి [13]కొమిరెలందిచ్చిన
బంగారు గిండి[14] సంపంగి [15]నూనెఁ
దలయంటి పరిమళోదకముల నభిషేక
మలరించి యొక[16] దుకూలాంబరమునఁ
దడి యొత్తి పట్టు వస్త్రములు గట్టఁగనిచ్చి
గాషణంబులు మేన ఁబొందు పఱచి

---

1 ధనధాన్య సంపదలచే (ట) ధాన్యభరితమై మరి (వ) 2 కడువెరగందెన్ (అ) 3 రత్నభూషణాంబరాది (వ) 4 తంగేడు (అ) 5 కదిరివచ్చి (వ) 6 జంబులునిచి సతులు గరిమెపరి మళోదకములు బోయ (వ) 7 కదిగి (అ) 8 యెడమంబడగ (ట) 9 కైదండప్పుడుయొసగిన (వ) కైదండయె సంగినదా (అ) 10 స్ఫురణఁజెలంగుచుతన (అ) స్ఫురణన్వెలుగుచుతన (వ) 11 దద్భామాశిరోమణి(అ) 12 పేర్మిముత్యపుగద్దెపీటమీద (అ) ప్రేమముత్తెపు (ట) 13 కామెర (అ) కొమరులందిచ్చిన (వ) 14 గిన్నె (అ) 15 సంపెంగనూనె (వ) 16 కడుదుకూలా (ట)

తే॥ మృదుల కర్పూర కాశ్మీర మృగమదములఁ
గలపములు గూర్చి మంచి శ్రీగంధములఁది
యమృత శాల్యన్న [1]శాక పాకాదికంబు
లారగింపంగఁ బెట్టెనయ్యధిపునకును 31

తే॥ కర్పూరపుఁ దావులొసఁగు[2] బాగాలొసంగి
తెల్లఁగాఁ బండ బారిన తెల్లనాకు
మడుపులిచ్చుచు సౌఖ్యంబు[3] మరుగఁ జేసి
భోగములఁ దృప్తిఁ బొందె నా పువ్వుఁబోఁడి. 32

వ॥ ఇట్లు నంతుని కరుణా ప్రసాదంబునం గలిగిన మహైశ్వ[4]ర్యంబున ననంత [5]సుఖంబులనుభవించుచుఁ గొన్ని దినంబులకుఁ దృప్తుండై యాభూసుర శ్రేష్ఠుండు కాంతా సుతాదుల నెడఁబాసి యేకాంతంబున నుండి తన యంత రంగంబున—— 33

సీ॥ పరమేశ యిందిరా పతి మురారి ముకుంద
వసుదేవ తనయ శ్రీవరదదీన
పాలన పూతనా ప్రాణాప హర దేవ
కీతనూభవ సర్వ భూతమయ జ
రా సుత మాయావిరావణ వేణునా
ద వినోద శిశుపాల దర్ప [6]మథన
సత్యా వధూ భోగ సంయోగ రౌహిణే
యానుజ గోపాల కాంగ్రగణ్య

తే॥ ద్రౌపదీ మాన రక్షక ధార్త రాష్ట్ర
గహన పావక [7]శకటారి కంసహరణ
నంద నందన హరి చిదానంద రూప
కేశవానంత పరమాత్మ కృష్ణ కృష్ణ. 34

గీ॥ చేయుదువు పుణ్యాపాపముల్ [8]జీవుఁడవయి
తథ్యముగఁ [9]బొందు చుందువు తత్ఫలముల
మురహర [10]ముకుంద పరమార్థములను జూడఁ
గర్తయును నీవ పిదప భోక్తయును నీవ 35

---

1 సూపదధ్యాదిఘృతము (ట) బెట్టెనయ్యంబుజాక్షి (ట) 2 తావులెసగు (ట) 3 సౌఖ్యంబు నదరజేసి (ట) 4 మహదైశ్వర్యంబున (అ) 5 అనంతభోగంబు (అ) 6 దర్పదమన (అ) 7 శకటాది (అ) శకశాఖ (ట) 8 జీవులందు (అ) 9 ననుభవింతువు (అ) 10 మురహర్మప్రపంచ పరమార్థములును నీవు (అ) ఘటములు (ట)

కం॥ సామజ ఘటలును మొదలుగ
దోమలు తుదగాఁగ ధరణిఁ దోఁచిన జీవ
స్తోమంబులశేషంబులు
నీ మూర్తి [1]విశేషములుగనెగడుదువు హరీ 36

సీ॥ అరయు[2]' నణోర ణీయాన్మహతో మహీ
యా' నను శ్రుత్యర్థ మదినిజముగ
దానవాంతక నీవు ధరణిలోనను మహ
త్పరి పూరితుండవై వరఁగి యుండి
యెందు[3] లేఁడనిపింతు వీశ్వర నీమాయ
తెలియ శక్యమెయెట్టి ధీయుతులకు
నిది యెఱుంగక కొందఱలమిఁ గర్తల మంచ
హం కరింతురు తామసాత్ములగుచు

తే॥ నాలఁగుఱ్ఱల గోపాల బాలకులను
దాఁచుకొను ధాతకే [4] స్వతంత్ర్వ మబ్బె?
ఘోషముల మీఁదబలుఱాల గురియఁ జేయు
వజ్రి పూనిక చెల్లెనె వారిజాక్ష. 37

ఆ॥ తగు ప్రయోజనములు తామె [5] చేసితిమని
యాత్మఁ దలఁచు చుందు రల్పమతులు
తద్విధంబు లెల్లఁ దమలోపలనె యుండి
నీవొనర్చు [6] టెఱుఁగనేరరెవరు. 38

ఆ॥ మ్రాకులోని చేవ మాడ్కిఁ బూసలలోని
దారమట్లు శిలల [7] తతులలోని
లోహముల విధాన లోకంబు జీవుల
లోన నుందువెందుఁ గానరావు 39

కం॥ తరువునఁ బుట్టిన యనలము
తెరఁగున దధిఁ బొడము ఘృతము తీరున మదిలో
నరయఁగ యోగీశ్వరులకు
నరఁగునఁ బొడ[8] సూపుదువు నిజముగ ముకుందా. 40

---

1 నీమూర్తివిభేదములుగ (ట) నీమూర్తి విభేదములను నిండుదువుహరీ (ట)

2 తొల్లి యణోరణీయాన్మహామహీయా యనెడు శ్రుత్యర్థమెంతయు నది నిజముగ దానవాంతక నీవును ధరణిలోన నణుమహాపరపూర్ణతనలరియుండి''

3'' యెందులేక యుండు నీశ్వరనీమాయ తెలియశక్యమెట్టి ధీమతులకు నిదియెరుగక కొంద రేమెకర్తలమని హంకరింతు రద్దురాత్ముల గుచు (అ)

4 స్వతంత్రతంబు గలిగె (అ) 5 తాముచేసితిమని (అ) 6 నీవునేర్పు టెరుగ (అ) నీవనేర్చు (ట) 7 శిలల తరులలోని (ట) 8 బొరచూపుదు నీవునైజమునను ముకుందా (అ) పొడసూపుదువీవు నిజముగానముకుందా (ట)

ఆ॥ ఇంద్రియ[1]ముల నిగ్రహించి కామక్రోధ
లోభ మోహములను లోను బఱచి
యుపవసించి శీతముష్ణంబు[2]ఁ దలపక
తపము సేయకేల [3] తక్కుదేను 41

ఉ॥ పేరిమితో వలంబడిన పిట్టయుఁ బోలె నపార ఘోరసం
సార దురంత పాశముల సందు దగుల్పడితిం భవత్పదాం
భోరుహ చింతనంబు మదిఁ [4] బూనుటకేమఱి యుంటి నక్కటా
తీరునె సంపదల్గలుగు దేహులకు న్నినుఁబూజ సేయఁగన్ 42

సీ॥ శాల్యోదనా పూపసద్యోఘృతంబులు
మెసఁగ మేనునఁ గండ మెండు గలిగి

రక్తమాంస ప్రపూర్ణత నింద్రియంబులు
ప్రబల మోహంబులోభంబు నిగుడ

దారా సుతాదులఁ దనివి చాలక బహు
ద్రవ్య [5] నవ్యాపేక్ష దారసిల్ల

మున్నె 'యర్థాతురాణాన్న గురుర్నబం
ధు' యనెడి వాక్యంబు దోడుగాఁగ.

తే॥ బేదలకు బాంధవులకును బెట్టుటుడిగి
పరమ నాస్తికులై జనుల్ బ్రదుక నాస
పడి చెడుదురంతమున [6] జము బారిఁద్రెళ్లి
జీవులకు దొడ్డ సంపదల్ చేటుగాదె 43

ఆ॥ ధనము గూర్చి [7] నరుఁడు తస్కరుల్ [8] భూపతు
లపహరింతు రొక్కొయని కృశించు
స్త్రీలనేలి వారి చిత్తంబు లెవరిపైఁ
బాఱు నోయటంచుఁ బరితపించు. 44

!

మ॥ తనయుల్వోరుదు రొండొరుల్ చడ బడం దాయాదు లీక్షింతురే
మనుజాధీశులు [9]తప్పు లారయుదురే మాయింతురా[10] తస్కరుల్
[ వనజాతేక్షణ తొంటి చందముననే వర్తింతునే వొల్లఁబో
ధనముల్మిక్కిలి దుఃఖహేతువులగుం ధాత్రీ[11]జన శ్రేణికిన్. 45

---

1 ఇంద్రియములు నిగ్రహించి యుమిడించి కామంబు (ట) 2 ముష్ణంబు లెరువక(ట) 3 దక్కుదీవు (ట) 4 మదిఁ బూనకయే మరియుంటి (ట ) 5 బహుద్రవ్యాల్యాపేక్ష ( ట ) బహు ద్రవ్య సంగ్రహాపేక్ష ( అ ) 6 జముబాధ (అ ) 7 నరులు (ట) 8 రాజులేమపహరింతు (త) 9 తప్పులారుతురు యామారింతురే (ట) 10 మారింతురాతస్కరుల్ ( అ ) 11 ధాత్రిన్(అ)

ఆ॥ బహుళముగఁ బ్రయాసపడి దినంబులు సాఁకి
సంతరించి [1]నట్టి జనుల ప్రాణ
మానముల హరించి[2] మగడిపోయెడివేళ
ధనము పాపకర్మ్ఁడనుట నిజము 46

ఆ॥ పేర్మి [3]నదురు గుండె పిరికి[4] కండయు లేక
యుండ వచ్చు [5] పేదయులుకులుడిగి
రమణఁగొచిపాతరాయఁడు [6]దొంగల
మిండఁడనెడి మాట మేలు దెలిసి 47

ఆ॥ సకల [7]జనములోర్వ [7]జాలరుపద్రవం
బులు ఘటింప నాత్మ కలగి కలగి
యులమటించు నట్టియైశ్వర్యముల కంటె
నాకుఁ జూడలేమి నయము కృష్ణ! 48

కం॥ [8] మీసముల మీఁది తేనియ
లాసల పుంజంబు లిట్టి యైశ్వర్యంబుల్
[9] దోసముల పుట్టినిండ్లని
యే సత్యము వెడలి పోవు [10]నీక్షణికమునన్ 49

కం॥ నా[11] నావిధ సకలైశ్వ
ర్యానూనతమః ప్రపూర్ణుడై మర్మంబు
ల్గానఁడు ధనమదమేద ని[12]
ధానమునకు దీపకళిక [13] దారిద్ర్యంబౌ 50

మత్త॥ ఎండమావులు నీరు బుగ్గలు హీనదర్పణ రూపముల్
చండ వాయువు[14] నాయువుల్ బహుచంచలంబులు [15] ప్రాణముల్
పండు వెన్నెల లంబుదంబులు [16] భంగు లబ్ధి తరంగముల్
మెండు సంపదలే నిజంబులు మేదినింగరుణాలయా. 51

---

(అ) 1 సంతరించునట్టి ( ట ) 2 హరించు మగుడ పొయ్యెడివేళ (ట) 3 పెరిమె (ట) పెదిమె (త) 4 పిక్కబెదురుసులేక (ప) 5 వచ్చుదాయలుక్క లుడిగి (ట) యలుకలుడిగి(ప) 6 రాయుడు ( అ ) 7 సకలజనుల వద్ద చాలను పద్రవంబులు ఘటింపనాత్మకలిగి కలిగి ( ట ) 8 మీసాలమీది (అ) 9 దాసముల పుట్టినిల్లని (అ) 10 నీక్షితములకున్ (ట) 11 నానావిధ మహదైశ్వరాసూనద పరిపూర్ణమందు దిగిన (ట) 12 నిదానము (ట) 13 దారిద్రంబున్ (ప) దారిద్రమిలన్ (అ) 14 లాయువుల్ (ట) 15 ప్రాయముల్ (త) 16 భంగరాబ్ధి (ట) భంగులబ్ధి తురంగముల్ (అ)

ఆ॥ [1]కొట్టి గింజ నోరఁ గొఱికియు నొక ప్రొద్దు
చెఱుచుకొన్న [2] విధము కొఱితలైన
సిరులు నమ్మి నీదు శ్రీ[3]పాదచింతన
మరచి నాఁడ నెంత మందమతిని. 52

ఉ॥ అన్నము లేక యుండినలయంబగు[4] దేహము రక్త మాంసముల్
సున్నగు[5] నింద్రియ స్ఫురణ సుక్కుమదాతి శయంబు దూరమో
నన్నుల మీఁది ప్రేమచెడు నచ్యుత నీపయి నిల్చు మానసం
బెన్నటికైన జ్ఞానులకు హెచ్చు దరిద్రము [6]పాటి యేసిరుల్ 53

ఉ॥ ఓపినయట్లు భోగముల నొందెడు [7]మీద వహింపగావలెన్
దాపస వృత్తి నంచు[8] మదిఁ దప్పక యుందురు కొందఱిక్క టా
యీ పురుషాయువల్ప[9] మింక నిందుల కందుల కేవి[10] యబ్దముల్
[11] పాఁపర కాయచే దెఱిఁగి భక్షణ సేయుట నీతియే ధరన్ 54

కం॥ బెత్తుగ, వృద్ధత్వేముని
వృత్తినా' మనెడు పల్కు వినవొల్లకయ
త్యుత్తములు మొదల నుండియుఁ
జిత్తమునినుఁ జేర్చి ముక్తిఁ జెందెదరు హరీ 55

ఆ॥ వయసు [12] నాఁడు భోగవంతుఁడై ముదిమిని
దప మొనర్తు ననుచుఁ [13] దలఁపఁ దలఁప
[14] యౌవనమునఁ జచ్చు నతఁడు వృద్ధగు దాఁక
బ్రదుకు టేమి నిజము పంకజాక్ష 56

ఆ॥ పండు వంటి వయసు బలు కాఁపురము సేయ
జప తపంబులకును [15] జాలలేడు
మీఁది దినములనుచు [16] మిన్నత పలికెడి
[17]భ్రాంత జనులఁ దగదు పాటిసేయ 57

---

1 వూరకే కొరగింజ గొర్కొక్కప్రొదు (అ) వురికి (ప) గొరికొక్క ప్రొద్దు (ట) 2 కొనిన విధంబున (ట) 3 శ్రీరామచింతన (ట) 4 రయంబున దేహము (అ) 5 సున్నయు (అ) 6 దరిద్రుల పాటి యేసిరుల్ (ట) 7 నొందుట మీద (ట) 8 యాపములు తప్పక (ట) 9 వుల్దెలుప నిందుకు నందుకు నెవ్వియబ్దముల్ (ట) 10 యర్ధముల్ (ప) 11 పాపరకాయలో కొరికి బాగుగ నోపున బెట్టమన్నదే (అ) కాయలో కురికి బాగుగ నేర్పున బెట్టెమున్నదే (ట) కాయలో గొలికి (త) బెట్టనున్నదే (త) పాపట కాయలో గొరికి బాగుగ యాకను బెట్టమన్నదే(ప) 12 వైచునాడు భోగవైభవంబుల నుండి (త) 13 తాముతలపనెమ్మనమున జేర్చు (అ) 14 నప్పసముగ జచ్చు (త) 15 చాలలేదె (అ) చాలలేమె (ప) చాలలేవె (త) చాలవేరె (ట) 16 మిన్నర్త (అ) మిన్నతల్ (ట) 17 భ్రాంతి జనుల పల్కు పాటిదగదు (ప)

కం॥ ఆయువు నిండని యప్పుడె
కాయంబున జీవబలము గలిగినయపుడే
ధీయుక్తి దూల నప్పుడె
శ్రీ యువతీ రమణ నిన్నుఁ జింతింపఁదగున్ 58

సీ॥ ముదిమి ప్రవేశించి 1మూల్గించు నప్పుడు
కుత్తుక శ్లేష్మంబు 2గూర్చునపుడు
బలువైన మూర్ఛలు 3 ప్రాపించు నప్పుడు
నెదురుఁ దన్నెఱుఁగక 4యదరునపుడు
పలుమాఱు రుచులకు బ్రతిమాలు నప్పుడు
వడిచెడి దేహంబు వడఁకు నపుడు
కష్టంపు రోగముల్5 గాఱించునప్పుడు
మల మూత్రములలోన మెలఁగు నపుడు

గీ॥ బహు విధంబుల నాయాస పడెడు నపుడు
గొణుగు6 మాటల రసనంబు గుదియు 7 నపుడు
వేదనలఁ బొంది ప్రాణముల్ విడుచు నపుడు
నరుఁడు నిన్నెట్టు దలఁచు శ్రీ నలిననయన. 59

ఆ॥ ఇపుడె 8నరుల బ్రదుకులిగ యెంత సేపటి
కో,9 సతములు గావు క్రూర యముఁడు
కరుణ లే10నివాఁడు గావున శీఘ్రంబె
శ్రీ11శ నిన్ను పూజ సేయవలయు. 60

ఆ॥ నిన్నుఁగొలుచు టుడిగి నేవొల్లఁ బోసిరు
అనుభవింప నరుని యాయు వల్ప
12మిట్టి వాసరముల నిందీవరాక్ష నీ
పాద చింతనంబు పాదుకొల్పు 61

కం॥ కావున నిపుడిక తొల్లిటి
త్రోవనె విహరింతు నిట్టి తుచ్ఛపు సిరులుం
గావలెనే 13యిన్నియు నీ
సేవా ధర్మంబు నాకుఁజిత్తజ జనకా 62

---

1 మూల్గుచున్నప్పుడు (ట) 2 గూరునప్పుడు (అ) 3 బడియున్నయప్పుడు (అ) 4 వదరునపుడు (త) 5 గావించునప్పుడు (ట) 6 కొణుగు మాటల (ప) గూర్చునపుడు (ప) కొతుకుమాటల స్వరసంబు గురియు నపుడు (ట) 7 గురియునపుడు (త) కొడుకు మాటల – గుదియునపుడు (అ) 8 ఇపుడొనరుల బ్రతుకు లిగయెంత సేపటి (అ) 9 కోసతముగాదుకృష్ణ (త) 10 కరుణ యుంచడతఁడు కణకతో (అ) 11 శ్రీపతినిను పూజ (అ) శ్రీనివాసు పూజ (ప) 12 మెచ్చి వాసరంబులిందీ (ట) మెచ్చి వాసరములు యిందీవరాక్ష నీ పాదపంకజంబు పాదుకొల్ప (త) 13 యెన్నియు మరిసీ సేవార్థం బెపుడు (ట) నీ సేవార్థంబివె నాకు (త) నీసేవార్థములగునె (ప)

తే॥ ఏడి[1]చెడి చిన్న వాండ్రకు నిన్ని[2] పప్పు
గింజలిడి పోరు వఱిచిన క్రియను జాలఁ
దుచ్ఛ మగు సంపదలొసంగి తొలఁగి నన్ను
[3] మత్తునిగఁ జేసెదవు నీదు [4]చిత్తము హరి. 63

కం॥ మురహర! యీ గ్రామము లీ
పురములు నేనొల్ల నిన్ను [5] పూజలొనర్తుం
[6]బరమ మునులు 'రాజ్యాంతే
నరకం ధ్రువ' మనెడి మాట నాకుఁ దెలియదే. 64

శా॥ పారంబెన్నఁడు లేని మోహలతికల్బంధింప [7]సంసార ఘో
రారణ్యంబునఁ ద్రెళ్లదారసుతముఖ్యాఖండితా శారుజల్
గాటింపన్ బహుదుఃఖ వేదనలఁ జీకాకయ్యెడిన్ డెందమో
కారుణ్యాం[8]బుధి శౌరి నీదయనయాకారంబుఁజూపంగదే 65

ఆ॥ ఎగసి తేనెఁ [9]బడిన యీగయుఁబోలెను
[10]భోగములను దగిలి పొగల దాత్మ
[11]చిత్తగించినీదు శ్రీపాద [12]దర్శన
మిచ్చి ప్రోవవయ్య యిందిరేశ. 66

ఆ॥ [13]మూలమున్నవాని ముంగిటఁ బడవైచి
సిరులొసంగి అట్టు చేసినావు
[14]దండిసంపదలు వృథా డంబరంబుల
యేల మమ్ముబోంట్లకివి మహాత్మ. 67

వ॥ అని శ్రీకాంతుని [15]గూర్చి యత్యంత చింతా శీలుండై కుచేలుండు బహుప్రకారంబుల స్తుతియించినఁదదీయ భావశుద్ధి కాత్మనలరి యద్దేవదేవుఁడు గరుణారసార్ద్రచిత్తుండై

సీ॥ శ్రీవత్స కౌస్తుభగ్రైవేయములతోడ
లాలిత మణి కుండలములతోడ
మాణిక్యకాంచన మణికిరీటముతోడ
రహిమించు పీతాంబరంబుతోడఁ
శంఖ చక్ర గదాది సాధనంబులతోడ
నమిత రత్నాభరణములతోడఁ
బెడతల వ్రేలాడు పికిలి పింఛముతోడ
కస్తూరి కాంగరాగంబుతోడ 6

1 ఏడిచెటి చిన్నవాండ్లకు (త) 2 యింతపప్పు గింజలిడి (ప) 3 మత్తునిగఁజేసినావు నీ చి[illegible] హరి (ట) 4 నీచిత్తమికను (ప) 5 నిన్ను బూజయొనర్తుంబరమమునన్ (త) 6 పర[illegible] రాజ్యాంతే (ప) నాకుందెలుసున్ (త) 7 నేనిట్లుఘోరా (అ) 8 కారుణ్యానిధి [illegible] 9 తేనెలోన (ట) భ్రమసి తేనెలోన బడిన యీగయు (అ) 10 భోగములకు దవిలి పొ[illegible] (ట) పొగిలెదాత్మ (త) 11 చిత్తగింపు (త) 12 శ్రీపాద చింతన (అ) 13 మూలనున్న[illegible] 14 దండి సంపద వృథాడంభంబు మాకును(త) 15 గుదియుంచి (అ) గురియుంచి (ప)

గీ॥ జాంబవతియును గాళింది సత్యభామ
మిత్రవిందయు భద్ర రుక్మిణి యనంగ
మహిషులందరు సేవింపమానియెదుట
శకట దానవవైరి సాక్షాత్కరించె. 69

గీ॥ ఇట్లు ప్రత్యక్షమై[1]యాదవేశ్వరుండు
[3]గారవముతోఁ గుచేలుని[3]గారవించి
[4]యాఘనునిచేత నర్ఘ్యపాద్యాదులైన
[5]యతిథి పూజలనొంది యిట్లనుచుఁ బలికె 70

కం॥ మెచ్చితి నీ నైష్ఠికమున
కిచ్చకు వచ్చిన వరంబు లిపుడే మయినన్
ఇచ్చెద[6]వేడు మనంగడు
ముచ్చటపడి యపుడు విప్రముఖ్యుడు పలికెన్. 71

ఆ॥ మెఱసి పిచ్చుగుంటు మీద భాగీరథి
వచ్చినట్లు మిగుల వాంఛకలిగి
స్వామి మీరలిటకుఁ జనుదెంచితిరి కడు[7]
భాగ్యయుతుఁడనైతిఁ బద్మనయన. 72

కం॥ నిరతంబును [8] 'నాశా సా
[9]పరమందుఃఖమ్మ' టంచుఁ బలికెడి శ్రుతులన్
గుఱుతెఱిఁగి వృథా తృష్ణా
తురత భవచ్చరణములకు దూరుఁడనైతిన్ 73

సీ॥ నిత్యంబులా సిరుల్ నెరయ[10]నత్యంతంబు
దురితంబుఁ బొందించి తొలఁగుఁగాక
సతములా ప్రాణముల్ సంతతంబును భవ
[11]సుఖ దుఃఖములఁబొంది స్రుక్కుఁగాక
కాణాచి[12]భూములా కాయముల్ నీళ్లపై
బుగ్గలవలెఁబుట్టి పొలియుఁగాక
చుట్టంబులా [13]సుతుల్ వట్టి యాశాశల
వేచెటి[14]పగదాయలింతె గాక

---

1 యారమేశ్వరుండు (వ) 2 గారవముతో (ట) 3 తోడచెలికాని గారవించి (వ) 4 అతనిచేతను అర్ఘ్య (ట) ....గైకొనియతిముదమున (ట) 5 అతిథిపూజలు గొనుచు మోదమున బలికె (అ) 6 వేడుమయవినను ముచ్చటదీరంగ నతడు మురి యుచుఁ బలికెన్ (త) ఇచ్చెదనని పలికిన మరి ముచ్చటపడి (అ) 7 యెంత భాగ్యమబ్బెనాకు (అ) 8 నాశాశాః (అ) నాశాశః (వ) 9 పరదుఃఖంబను (ట) 10 నెరయనత్యంబున (ట) 11 సుఖ దుఃఖములను బొంది దొరగుగాక (అ) తొలగుగాక (ట) 12 నిజములాకాయముల్ (వ) కాణాచి భూములాకారముల్ (ట) కాణాచిమూకలాకాయముల్ (అ) 13 పతుల్ (అ) 14 పరదాయలింతె (వ)

ఆ॥ [1]ఇట్టి తుచ్ఛ పదవులేనొల్లను మదీయ
[2]మానసమున నిన్నె మరిగియుండు
సేవ్యనై నముంచు నిక్కంబు గానను
బాలనై నముంచు పంకజాక్ష 74

శా॥ ఆలంటన్ సుతులంట చుట్టములటంటన్ జేరి యాశాశలం
జాలా దుఃఖ పరంపరల్వొడమనే సౌఖ్యంబులుంగానలే
కీలీలన్[3]దురటిల్లుదున్ దురిత దేహిన్నన్ను రక్షింపు మో
శ్రీలక్ష్మీపతి [4]నందగోపతనయా [5]శ్రీకృష్ణ రామానుజా 75

ఆ॥ సకల దుఃఖములకు జననస్థలములైన
యిహ సుఖంబు లిచ్చగింపదాత్మ
[6]పరమ పదము నీదు [7]పాదపంకజములఁ
జేర్చు కొనుము నన్ను శ్రీనివాస 76

వ॥ అని సన్నుతించిన పరమేశ్వరుండిట్లనియె. మహాత్మా! నీవు జిహ్వాత్వగాది దుష్టేంద్రియములు గుదియించి కామ క్రోధ లోభ మోహంబులు పెరుగనీక దారా సుతాదులందు మోహంబు విడిచి, కందమూల ఫల పర్ణజలానిల భక్షణంబులఁ బ్రాణ సంరక్షణంబు సేయుచుఁ ద్వగస్థిమాత్ర శరీరుండవై యేకాంత కాంతారంబున నుండి సుజ్ఞానవంతంబైన నిజస్వాంతంబు నాపయిన్నిలిపి, యెత్తటినైన దుచ్ఛ భోగములందుఁ బ్రమత్తుండవు గాకుండు టెఱుంగుదు, నైనను దైవయత్నంబునంబొదవిన శుభాశుభంబులనుభవింపక పోవచ్చునే ? నీవు మాకు పిడికెడడుకులు సమర్పణంబు చేసిన పుణ్యంబున నీనుహదైశ్వర్యంబులు గలిగె. ఎందును సత్పాత్రుల కిచ్చిన దానంబులు నిష్ఫలంబులు గావు అనంతంబులై ఫలియించు. మున్ను వామనునకుఁ బుడమి మూఁడడుగులొసంగిన కతంబున బలి పాతాళభువనంబేలుచున్నవాడు. ధ్రువవిభీషణు లిట్టివారె. కావున నేనిచ్చిన వరంబుల ధ్రువంబులు గానేరవు. నీవు చిరకాలంబు సంపదలనుభవింపుము. అంతంబుననిన్ను నన్నుంజేర్చుకొనియెదనని పలికి వెండియు నిట్లనియె. 77

తే॥ నిజతలోదరి ప్రార్థింప నీవు నన్ను
కాసు వీసము నడుగంగ నాస చేసి
వచ్చి యూరక యున్న నీ వాంఛ దెలిసి
యిచ్చి తైశ్వర్య విభవంబు [8]లింతలేసి 78

---

1 ఇట్టి తుచ్ఛంపు సంసారమింటిలోన నరయ నిత్యంబు వగలచే నణగి యుంటి (ప) 2 మానసమున నిన్ను మరిగియుందు (అ) 3 దురుటిల్లుదున్ (ట) దురిపిల్లుదున్ (ప) 4 నంద నందన హరీ (ప) 5 కృష్ణారమానాయకా (ట) 6 పరమ పదవి (ట) 7 పాదపంకజములు సేవ చేయుచున్న జనులకెల్ల (ప) 8 లింతదెలిసి (ట)

తే॥ తొల్లియును బోలె లే[1]ముల(దల్ల డింప
కన్నమమృతంబు గలిగి నీ[2]యాలు బిడ్డ
లెల్ల[3]సౌఖ్యంబులను బంధు హితుల( గూడి
యను భవింతురు నీధర్మమున మహాత్మ 79

ఆ॥ కలిమి కలిగెననుచు(గండకావరమున(
[4]బొగరు వట్టి[5]అట్టు(బొందనేల ?
బీదలకును బంక్తి భేదంబు సేయక
యన్నమిడ(గవలయునతిథులకును. 80

సీ॥ అరయ(‘బరోపకారార్థ మిదం శరీ
రర’మ్మను వాక్య సారము [6]గ్రహించి
[7]ధరణిలో[8]ప్రజలకు(దనచేత నైనట్టు
లేమార్గముననైన హితమొనర్చి
స్మృతు ‘అనిత్యాని శరీరాణి’ యనుమాట
లాదరించుచు మేనుల(ధ్రువముగ
గణుతించి ధర్మార్థ కామ మోక్షములకు
మనసొగ్గి సుకృత మేమఱకొనర్చి

గీ॥ [8]గరిమతోడ‘శుభస్య శీఘ్రమ్మ’నంగ(
దెలిసి యత్యంత విజ్ఞాన తేజమునను
సకల ధర్మములందును జాడ్యముడిగి
నన్ను(బూజింపవలయు( గ్రన్నన మహాత్మ 81

కం॥ సన్నాహంబున[9]‘నిత్యా
సన్నిహితా మృత్యు’[10]వనెడి చదువులు వినివి
ద్వన్నుత సేయగవలయును
మున్నుగ ధర్మంబు శీఘ్రముగ మర్త్యులకున్ 82

కం॥ పరికింప(గ ‘ధర్మస్య
త్వరితాగతి’ యన(గ[11]విని వృధాదివసంబుల్
జరుపక యతి వేగమె మ
చ్చరణ సమారాధనములు సలుప(గవలయున్ 83

---

1 మోములు మల్లడింపకన్న (అ) 2 కలిగినయాడు బిడ్డ (అ) 3 భోగంబులును (అ) 4 పొగరు బట్టి హితుల దగదు విడువ (వ) 5 పట్టి పెట్టుపోయునెడల బండతనము లకును బేరంబు (ట) 6 రంబను శ్రుత్యర్థమది గ్రహించి (అ) 7 ధరలోని(ట) 8 గరిమెతోన (ట) 9 నిత్యం వన్నిహితో (వ) 10 గ్రన్నన ధర్మమె శీఘ్రము మన్ననముగ( జేయవలయు మర్త్యులకెల్లన్ (అ) 11 వినియు(దా దివసంబుల్ (వ)

కం ॥ విస్తారంబుగ 'గ్రామో
నాస్తి కుతిస్సీమ' యనెడి న్యా[1]యముతోడన్
[2]ప్రస్తుతి సేయని మూఢున
కస్తవ్యస్తములు సుఖములందును నిండున్ 84

కం ॥ స్త్రీ యుక్తులైన యన్యుల
కేయెడఁగీడాచరించు హీనజనుఁడు 'పా
పాయ పరపీడన' మ్మను
న్యాయమ్మున[3]రౌరవాదినరకములఁబడున్ 85

కం ॥ కలుషములె దరిద్రంబుల
కలుషములే దలప[4]సిరులు గలిగియు[5]సత్పా
త్రుల కీనేరని మనుజులు
కలియుగమున నధిక[6]దుఃఖ కర్ములు జగతిన్ 86

కం ॥ క్షేత్రమెరిగి విత్తనమును
బాత్ర మెరిగి[7]దానములను బఱపఁగవలయున్
ధాత్రీజనులది యెఱిఁగియుఁ
బాత్రులకీయంగవలయుఁబసిడిగలిగినన్ 87

కం ॥ ముని నాథ పూర్వభవమున
ధనమార్యుల కిచ్చినట్టి తత్సుకృతమునన్
[8]మనుజుండన్యభవంబున
జనపతియై సకల భాగ్య సంపదలందున్ 88

కం ॥ ఏపట్ల బుణ్య పరులగు
భూపాలుర యొద్ద నేనుబొ[9]ందుగనుందున్
'ప్రాప్యైఁ నా విష్ణుః పృథి
వీపతి' యను స్మృతులమాట వృథగాకుండన్ 89

కం ॥ సిరి గల వానికి వశ్యులు
నరనాథులు భూమి ప్రజలు నానాదిశలన్
[10]సరసిజ మందిర యెచ్చట
నిరవై యుండఁదగు నచట నేను వసింతున్ 90

---

1 న్యాయమున దయా ప్రస్తుతుడుగాని (ట) 2 ప్రస్తుతి సేయని భక్తిన్ నాస్తికుడా 3 శారవాది నరకములఁబడున్ (వ) 4 పుణ్య సిరులు (ట) 5 సత్పాత్రులకియ్యలేని (ట) 6 తృష్ణ కర్ములు (వ) 7 దానమొనరుపగవలయునని ధాత్రి జనులది యెఱిగి సత్పాత్రులకియ్యంగ వలయు ధనముకలిగినన్ (వ) 8 మనుజుండై జన్మించును జనపతియై సకల భాగ్య సంపదలందున్ (ట) 9 పాలుపుగ మందున్ (వ) వెనరు పొందగ (ట) 10 సరసిజన సదనయచ్చట యిరవై యుండినను యేను నచట వసింతున్ (ట) సరసిజ సదనం బచ్చట యిరువై యున్నయది వసింతురచటన్ (అ)

కం ॥ శ్రీ[1] నళిన నయన దోడుగ
నేనతఁడై యుండుఁ గాన హెచ్చుగ జెల్లన్
మానవ పతి యానతి'రా
జానుమతో [2]ధర్మ'యనగ [3]సకల ధరిత్రిన్ 91

గీ ॥ సిరులు లేనట్టి పురుషుండు మరణమైన
జనుఁడు తర్కింపఁదా[4]నొక్కసముఁడు గాఁడె
తథ్యముగ "నిర్ధనస్యమృతస్యచ" యను
మేటి పౌరాణికుల మాట మేలు తెలియ 92

గీ ॥ దాత ననుచు సకల ధనమపాత్రులకును
[5]వెచ్చ వెట్టుటదియు వెఱ్ఱితనము
దీనులయిన భూమి దేవోత్తములకును
[6]దానమీఁగ వలయుఁ దగిన కొలఁది. 93

కం ॥ [7]ఘోరముగ వెఱ్ఱి కోఁతికి
వీరుల శివ మెత్తినట్లు వెచ్చము సేయన్
గోరి కమును[8] దనుదిరిసిన
[9]వారల మరలంగ దిరియ [10]వలయును జుమ్మీ 94

కం ॥ కూడిన[11] ద్రవ్యమపాత్రుల
కాడంబరవృత్తి నొసఁగ నది [12]వ్యధయె యగున్
బూడిదలో హోమమువలెఁ
బాడింటికి నిడిన దీప పంక్తియుఁ బోలెన్ 95

ఆ ॥ దేవ పూజ యతిథి దీనరక్షణమును
బంధుపోషణంబు [13] ఫలితముగను
దాన ధర్మములను ధనము గల్గిన కొలఁ
దాచరింపవలె గృహస్థులకును 96

కం ॥ స్నానము సంధ్య యు జపమును
మానుగఁ బితృతర్పణములు మరువకమదిని
త్యానుష్ఠానము లెడపక
మానవుఁడొనరింపవలె [14]సమస్తము తెలివిన్ 97

---

1 శ్రీహరిగానను పాడగన (ప) శ్రీనలినానన (ట) నయను దోడుగ (అ) 2 ధర్మమనగ (అ) 3 నఖిల ధరిత్రిన్ (అ) 4 గానొకసమము (ట) 5 వెచ్చపెట్టినదియె (ట) 6 మియ్యవలయు (అ) 7 ఘోరమగు (ట) 8 ముమదనుదరిసిన (ట) 9 వారిని మరలంగ (ప) 10 వలయును జగతిన్ (అ) 11 కూడని ద్రవ్యము (ప) 12 వృధయయగున్ (ప) 13 భరితముగను (అ) 14 సమస్తము తెలియన్ (అ)

కం॥ పరికింప స్మృతి "యహింసా
పరమో ధర్మ" యనుచుందగఁబలికెడు కతనన్
ధర సర్వ జీవులందును
గరుణయు పాటింపవలె సకల్మషవృత్తిన్. 98

ఆ॥ తేరు క్రింద ప్రతిమ తెఱఁగున సంసార
భారనూని యందుఁ బరవశుండు
గాక మానవుండు గల్మషవిరహితుఁ
డై చరింపవలె మహామునీంద్ర. 99

సీ॥ మానక [1]స్మృతులు "జ్ఞానేన హీనః పశు
భిస్సమానో" యని పేర్మిఁ బలుక
వేదంబు మఱియు "జ్ఞానా దేవ మోక్షో" యు
నంగ విజ్ఞానాంతరంగముననుె
విమల శరీరుండై వివిధ ధర్మా ధర్మ
మార్గ భేదంబు లేమఱక తెలిసి
తనకుఁ బాకము సేయుమనక యయ్యఖిల ప
దార్ధములును దేవతార్పితముగఁ

గీ॥ [2]దలఁచియు నసాక్షి భుక్తియొత్తరిని గొనుట
మాని మధ్యాహ్నవేళఁ గ్రుమ్మఱెడు నతిథి
యాఁకలెఱిఁగి సమస్త జీవాత్మలకును
సమత వర్తింప వలయును సజ్జనుండు 100

గీ॥ "కాకులకుఁగాని వేములు [3]ఘనతరముగఁ
[4]బండెనే మెండెనే" మన్న పగిది నతిథి
బాంధవులకునుగాని సంపదలు నరుల
కుండె నేమియు మఱియు లేకుండె నేమి ? 101

ఉ॥ మాడలు సంతరించుకొని [5]మచ్చిక నెవ్వరికీఁ[6]గ లేక ప
శ్పీడలు మేనులంబొరలి పెక్కు రుజాదులు బాధపెట్టఁగా
గోడని యేడ్చుచున్ భ్రమలఁ [7]గ[illegible]
చూడ [8]సమస్త కర్మ పరిశుద్ధుల కిత్తురు గాక మోక్షమున్ 102

---

1 శ్రుతులు (అ) 2 [illegible] (అ) 3 [illegible] (అ)
4 [illegible] (ఆ) 5 [illegible] 6 [illegible] (అ)
7 [illegible] (ఆ) 8 [illegible] (అ)

తే॥ తస్కరులు భూమిపతులు విత్తములు [1]బలిమిఁ
బొదివి కొని పోవఁ జూచుచుండుదురు గాని
[2]యీఁగ గలిగి యేరికిని దగనిడఁగ లేని
కష్ట [3]లోభులకేల సద్గతులు గలుగు 103

తే॥ [4]పసిడి చేఁగలి యెవరికిఁ బెట్టనట్టి
బైసి మాలిన కృత కర్మ భ్రష్టుఁడిలను
పరమ చండాలుఁ డహహయే పట్లనైనఁ
దరచు ధనలోభికంటెఁ బాతకుఁడు గలఁడె 104

ఆ॥ తనువు గురువులకును ధనము [5]బ్రాహ్మణులకుఁ
[6]మనసు నిష్టదైవమునకు నొసగి
భూత దయయు సుకృత [7]బుద్ధి శుద్ధియుఁగల్గి
పరగువాఁడె నాకు భక్తుఁడనఘ 105

కం॥ [8]ధర్మాత్ముం డభివృద్ధియు
దుర్మదుఁడు లయంబు నొందు దోషంబులచే
'[8]ధర్మమె జయము ధరిత్రిన
ధర్మమెలయ' మన్నమాట, తథ్యము గాఁగన్ 106

వ॥ కావున నీవు సకల భూతములయందును ధర్మంబునుం గలిగి స్నాన జపా ద్యనుష్ఠానంబులు మొదలైన బ్రాహ్మణ కర్మంబు లేమఱక, ఋుగ్యజుస్సామంబులునియమం బునం బఠింపుచు నసాక్షిభుక్తంబయుక్తంబని తెలిసి యతిథులం బూజింపుచుహింసా కర్మంబులు వర్జించి, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యంబులు వెలుఁగనీయక, యత్యంత విరక్తుండవై శాంతాకారంబునం బ్రవర్తింపుమని చెప్పి పరమాత్ముండైన హరి యంతర్హితుండయ్యెనప్పుడు 107

కం॥ కమలము [9]నీరున నుండియు
కమలంబున నంటనట్టి కరణిని సంసా
రమునఁ [10]బ్రవర్తించుచు నా
యమలిన చిత్తుఁడు విరక్తుఁడై విహరించెన్ 108

---

1 మరియునదిమికొని (వ) 2 యీఁగకిరి పాముకును బలి (త) యీఁగకెరి పాముకును బలియిడగలేరు (అ) పాముకును భృతి (వ) 3 లోభులకునేల సద్గతుల్ రూఢిగల్గు (ప) 4 పసిఁడి గలిగియుండి పరగ పెట్టడు కడు పామరుండు చాలబగిసిమాలు(అ) పిసినియగువాడు (త) 5 బ్రాహ్మలకును (ట) 6 మొనసి యిష్టదైవముగ నొసంగి (వ) 7 బుద్ధియు గలిగియు (ట) 8 ధర్మార్థుండభివృద్ధగు (త) ధర్మాత్ముండభివృద్ధిగ (ట) 9 నీటను (త) 10 ప్రవర్తించియు నా విమల చరిత్రుండు (ట)

ఆ॥ ఈ కుచేలు చరిత మిలలోన నెటువంటి
మనుజు లైన 1వ్రాసినను జదివిన
వినినఁ దద్విధముల వివరించినను వారి
కాయు రర్థములు చిదాత్ముఁడొసఁగు 109

కం॥ అనినఁ గిరీటి కుమారుని
తనయుఁడు శుకయోగి వాక్సుధారస పానం
2బొనరించిన పిదప వినియోఁ
దనివి సనక భాగవత కధా 3సూక్తంబుల్ 110

శా॥ బృందారణ్య విహార గోపకలసద్బింబాధరీ గోపగో
బృందానంద కళా వివర్ధన మహాబృందార కానీక భూ
మందార ద్రుమ నంద నందన మహా మాయా వినోద 4క్రమా
మంద ప్రాభవ కృష్ణదేవ హరి శ్రీమన్నావరరామానుజా 111

కం॥ 5నీలాంబరావరజ హరి
6నీలాంబుద వర్ణదేహ నిర్మలయమునా
కేళి7ప్రియ 8భక్తి 8తగో
పాలక బాలక సహాయ పర్యుషితాన్నా 112

పంచచామరము :

బలారి కల్పి9తోరు వర్ష పాత వారణా
10ప్రలంబ పూర్వ నిర్ఝర ప్రభంజనాత్మరంజనా
పులింద కన్య కాకుచ ప్రఫుల్ల 11గండ పాళికా
గళ ప్రదేశ భాసమాన 12కౌస్తుభస్థితాంకితా 113

---

1. వ్రాసిన సభలలోన చదివి సరసముగను వినిన (అ) వినిన చదివి విధము వివరించినను వారికాయు వర్ధనము (ప) వారలకాయు రర్థంబు మహాత్ముఁడొసగు (ట) 2. బొనరించె (ట) బొనరించి మరియు వినినను (అ) 3. సూక్త మిలన్(ట) క్రమానంద ప్రాభవ (అ) 4. నీలాంబుదవరజ హరీ (ట) నీలాంబర వనజ హరి (త) 5. నీలాంజన వర్ణ బహువినిర్మల (త) 6. కేళీప్రియ (ట) 7. భక్తిత గోపాలక (త) 8. కల్పితారివర్ష వాతమత్త వారణా (అ) కల్పితాశనిపాత వాతహారిణా (ప) 9. ప్రలంబవైరి నిర్ఝర ప్రభంజనాత్మ కుంజరా (ప) ప్రభంజనానుంంజనా (ట) 10. గుచ్ఛపాలికా (ట) 11. కామముద్రికాంకితా (అ) కామముద్రితాంగితా (ట).

గద్య :

ఇది శ్రీమద్భ్రమ రాంబికా వరప్రసాద లబ్ధ సరస కవితాధురంధర సరసకవి మిత్ర యల్లనామాత్య పుత్ర సకల సద్గుణ విధేయ ఘట్టు ప్రభునామ ధేయ ప్రణీతంబైన కుచేలోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు సర్వంబును తృతీయాశ్వాసము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ

మాలిని : సరసిజనిభనేత్రా సత్యభామా కళత్రా
సురుచిర సితఘోణా చారుమార్గ ప్రవీణా
పరమపదకలాపా బ్రహ్మదివ్యస్వరూపా
గిరిధర బహులీలా కృష్ణగోపాల బాలా — (౮)

—oOo—